శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

# స మీ క్ష

[ కృష్ణాపత్రికనుండి పునర్ముద్రితము ]

*

• ద్వితీయ ముద్రణము •

సర్వస్వామ్యములు కృష్ణాపత్రికవి

1941

వెల

రూపాయి

IPLA18DB100 శ్రీ వేమన గ్రంథాలయము
తే. ప్రోలు (కృష్ణా)

# అనుక్రమణిక

## సాహిత్యము:



## శిల్పము:



## ధర్మము:

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)
౨౬౮౦

# తెలివిడి



ఇందలి వ్యాసము లొకనాటివి కావు. పత్రికలలో నపుడప్పుడు బయల్వెడలుచుండు వాదోపవాదములను బురస్కరించుకొన్నవగుటచే నివి యస్వతంత్రములు నసంపూర్ణములు; నంతియేకాదు; వీనికి గాలభేదము పునరుక్తిని, వాదతీవ్రత అత్యుక్తినిగూడ నాపాదించియుండవచ్చును.

కాళిదాసునకు సంబంధించిన రచనలు రవీంద్రుని వ్యాఖ్యల ననుసరించి ప్రవర్తించినవి. ఈ వ్యాఖ్యలచే కాళిదాసునకు ధర్మోపదేశికత్వము సిద్ధించుచున్నను, నిజమునకు గవీశ్వరులు ధర్మోపదేష్టలుకారు. అనుద్దిష్టమగు శబ్దబోధ వలెనే ధర్మబోధకూడ, వారికావ్యములందు గర్భితమైయుండును. అంతియేకాని వారు బుద్ధిపూర్వకముగ తమ కావ్యములను శబ్దశాస్త్రమునకు ధర్మశాస్త్రమునకు లక్ష్యభూతములొనర్పరు. వేదములవలె ప్రభుసమ్మితములును, పురాణాదులవలె మిత్రసమ్మితములునుగాక, కావ్యములు కాంతాసమ్మితములగుటచే ప్రత్యక్షబోధ వానిపని కాదు. పరోక్షమార్గముననే ధర్మము నవి హృద్గత మొనర్చును. వ్యాఖ్యాతలుమాత్రమా కావ్యములను తత్త్వదృష్టిచే వివేచించి ధర్మసారమును వెలికి దీయజూతురు. రవీంద్రుడు స్వయము కవియయ్యు, దత్త్వజిజ్ఞాసువుకూడ నగుటచే కాళిదాస కావ్యసమాలోచనమునందలి ధర్మనిరూపణమునకుగూడ గడంగెను.

కాళిదాసు సౌందర్యోపాసకుడు. శ్రీ అరవిందయోగి నుడివినటుల, ఇంద్రియరాజ్యము వాని భోగభూమి. కాని అయ్యది కేవలము భౌతికముకాదు. తన నిరుపమానకళాభిజ్ఞతచే నీ కవికులగురువు ఇంద్రియములందలి సత్యమును గడు హృద్యముగ నుద్ఘాటింపగల్గినాడు. ఇంద్రియములు రసస్నిగ్ధములైనప్పుడు విషయరాజ్యము ఆనందరసముయొక్క విలాస భూమిగ జూపట్టును. తత్త్వశాస్త్రజ్ఞునివలె కవి ఆత్మానాత్మ వివేచనము చేయక బుద్ధి కల్పించుకొను భేదముల కతీతుడై తన కళావైదగ్ధ్యముచే ఇంద్రియాతీంద్రియములమధ్య ఆనంద సేతువును నిర్మించి, సర్వమును రసమయముగ నొనర్చును. ఇంద్రియములు తత్వతః దేవతాగృహములు.

కాళిదాసుని కాలమున రాజమందిరములు కేళీగృహములై వెలసినవి. విషయలోలురగు రాజన్యుల నాశ్రయించిన కవులు, తమ పోషకులకు రాగోద్దీపనము గావించుటకే తమ కవితానైపుణ్యమును తార్చుచుండిరి. దేవమందిరములలో దీపధూపారాధనలొనర్చుచు రసాధిదేవతను భక్తకోటికి బ్రత్యక్షమొనర్చుచుండవలసిన కవులు ఆనాడు రాజసభలలో వేశ్యలవలె మేళములుకట్టి కామార్చన చేయుచుండిన మాట నిజము. కాని భారతీయుల ప్రకృతి, బయట నెట్టి విషయ లంపటమున జిక్కుకొన్నను, వారిలోపలదాగియుండు ధర్మనిరతియు, వైరాగ్యబోధమును పూర్తిగ లోపింపజాలవు. భారత వాణి అంతరముననుండి మేఘగర్జనమువలె "నఖలు నఖలు" అని ధర్మఘోష చేయుచునేయుండును. రోమనుల విషయ లంపటత్వమునకును, భారతీయుల భోగపరాయణతకును భేద మిచ్చుటనేకలదు. రోమనుల కామప్రవృత్తి వారిరాజ్యమును సభ్యతను తుదకు జాతినిగూడ విచ్ఛిన్నముచేయువరకు వదల

శ్రీ వేమన గ్రంథాలయము

లేదు. భారతీయుల భోగపరాయణత వీరి యంతఃప్రకృతిని సంఘటిష్ఠతను బూర్తిగ నభిభవింపలేకపోయెను.

కావుననే భరతవర్షమున ఆర్యధర్మము ఏనాడును నిశ్శేషముగ లోపించలేదు. దాని అప్రతిహతశక్తి నిరంతరము సాగివచ్చుచునే యుండెను. కావుననే యీ దేశము కర్మభూమియని పేరొందినది. భారత సభ్యతయందు ఇహాపరములను సమన్వయము చేసుకొనగల చైతన్యశక్తి గలదు. అర్థకామములు సంఘముపై బడి కొల్లగొట్టకుండ ధర్మమోక్షములు యామికులవలె హెచ్చరిక గలిగియే యుండెను. భోగపరాయణత మితిమీఱిన కాలమున భారతవాణి కాళిదాసుని ముఖతః భోగత్యాగములను సమన్వయించెను. "శైశవేఽభ్యస్తవిద్యానాం, యౌవనే విషయైషిణాం, వార్ధకే మునివృత్తీనాం, యోగేనాంతే తనుత్యజాం"—ఈ వర్ణనమునందు కాళిదాసు ఆర్యసభ్యతయొక్క సమరసధర్మమును సూచించినాడు. కుమారసంభవశాకుంతలాదులయందుగూడ నీ సామరస్యమునే ఆ మహాకవి అతులవిభూతితో చిత్రింప గలిగెను.

బ్రహ్మాండమునందొక అంశమాత్రమో, ఒకదిక్కో, కేవలము ఉపరిభాగమో యనదగు నీ వాస్తవలోకమే స్థూల దృష్టికి పూర్ణసత్యముగ గన్పట్టును. కవులెప్పుడును దాని నతిక్రమించుటకే చూచుచుందురు. దాని కావలనున్న వెలుగులు వారి నాహ్వానించుచుండును. వాస్తవ లోకాతిక్రమణము భావశబలతకు ముఖ్యలక్షణము. దీనినే పాశ్చాత్యులు "Idealism" ఐడియలిజమందురు. రసభావస్ఫూర్తిచే బుద్ధియందంకురించు వ్యక్తిగతసంస్కారవిశేషమునే పాశ్చాత్యులు "ఐడియలిజ"మందురు. అంతియేకాని వారి కది ప్రత్యఘాను

భవవిషయము కాదు. వారి భావనాశక్తి వాస్తవలోకమును విడిచి ఎక్కువదూరము పోజాలదు. చాలవరకు దాని పొలిమేరలందే విహరించుచుండును. ప్రవృత్తిప్రధానమగు వారి సభ్యతకూడ వ్యావహారిక ప్రపంచమును విడనాడు సాహసమును వారికొనగజాలదు. వారి సభ్యతయందు, సంస్కారమునందు కొఅవడిన యీ "ఐడియలిజమ్" వారి కవితయందు కొంతవరకు గోచరించుననుటకు సందియము లేకున్నను, అది (Subjective) వ్యక్తిగతమైన చిత్తసంస్కార విశేషమేకాని అందవరోక్షానుభూతి లేదు.

భారత కావ్యజగత్తు దీనికంటె భిన్నమైనది. భారత ధర్మము నివృత్తిపూర్వకముగావున ఆధ్యాత్మికజ్ఞానసంపద, భారత జాతీయజీవనమును, లోపలను బయటనుగూడ తరతరములనుండియు నావరించి ప్రకృతిగతమై పాదుకొనిపోయినది. భారతకవిత అట్టి జాతీయసంస్కృతియందు పుట్టిపెరిగినదగుటచే భారతకవుల "ఐడియలిజమ్" ప్రత్యక్షవిషయము. పాశ్చాత్యుల "ఐడియలిజము" వలె నది ఊహాకల్పితమైనదికాదు. భారతకవి రసభావవశుడగుటతోడనే, వాస్తవజగత్తు నతిక్రమించి ఆనందరససింధువున నిమగ్నుడగును. అప్పు డూర్ధ్వలోకము లన్నియు వివృతద్వారములై కవికి అమృతాభిషేచనముచేయును. ఇయ్యది అప్రియత్నోపపన్నము; ఉపాసనాబలముచే సిద్ధించిన ఆత్మప్రతిభ; ఆర్యఋషుల కృపాకటాక్షముచే జేకూరిన నిస్తులభాగ్యము.

భరతవర్షములో గూడ ఆర్యధర్మచ్యుతులైన కుకవులు లేకపోలేదు. జుగుప్సాకరములైన నీచకావ్యములెన్నియో యిచట గూడ వెలసినవి. ముద్రిణాసౌకర్యమే లేనియెడల నవి యేనాడో మక్షికములకు భక్ష్యములయ్యెడివి. అంతియే

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

కాని భారతప్రకృతి వానిని జీర్ణము చేసికొనజాలదు. నీచకావ్యములు పుట్టుకొనివచ్చుచుండిన రోజులలోనే "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అను విధివాక్యము పుట్టినది. కాని ఆ నీచకావ్యములయందుగూడ భారతీయుల కాణాచియగు రసానుభవము అచ్చటచ్చట గన్పించుచుండుటచేతనే వానికి కావ్యశబ్దవాచ్యత కలిగినది. రసవిచారము, ఈ దేశములోవలె నెచ్చటను బరిణతిని పొందియుండలేదు. ఇటీవల నీ శాస్త్రము బిరుసెక్కి ఘనీభవించినను, రసజగత్తుయొక్క విస్తీర్ణతను గభీరతను దెలిసికొనవలెనన్న భారతీయుల రసశాస్త్రమువలె నుపకరించగలిగినది మరియొకటి లేదు. రసస్వరూపము, కావ్యజగత్తు అను వ్యాసములందీ విశేషమించుక సూచింపబడినది.

శిల్పవ్యాసములు పాశ్చాత్య కళావ్యామోహితులకు సమాధానములుగ వ్రాయబడినవి. భారతీయుల కల్పనాశక్తి శిల్పమునందువలె నితరవిద్యలయం దంతగా వెల్లడికాలేదు. భారతశిల్పము కేవలము దేవతాసృష్టి; విశ్వకర్మ స్వయముగ గల్పించుకొనిన కళాప్రపంచము. ఆ చిత్రరచన, ఆ మూర్తికల్పన, ఆ యాలయనిర్మాణము, ఆ రేఖావిన్యాసము, ఆ యలంకారపుష్టి, ఆ రాగవిస్తారము, ఆ యుజ్జ్వలసౌందర్యము, ఆ యాధ్యాత్మిక తేజము, భారతీయశిల్పజగత్తులో గాక మఱి యెచ్చటగాంచగలము! మానవునికళాసృష్టియందు ఈశ్వరసృష్టి సఫలత చెందుచున్నది. ఇక స్రష్టకును సృష్టికిని భేదమెక్కడ? మాయాశక్తిచే అరూపము నిరంతరము రూపొందుచున్నది. "ఆత్మమాయయా సృజామ్యహం." మానవుడు తిరిగి కళోపాసనచే రూపమును తొల్చి అందలి అరూపమును బ్రత్యక్షమొనర్చుకొనుచున్నాడు. సృష్టియందీశ్వరుని అవతరణము,

శిల్పమునందు మానవుని ఆరోహణము— ఈ రహస్యమును భారతశిల్పముగాక మఱి యే యితరశిల్ప ముద్ఘాటింపగల్గినది? కళాప్రయోజనము, శిల్పలక్షణములు, విగ్రహనిర్మాణము మొదలగు వ్యాసములందు, భారతశిల్ప సంప్రదాయము యొక్క మూలసూత్రములు దిఙ్మాత్రముగ సూచింపబడినవి.

"రూపకల్పన" "సాధన" యను వ్యాసములయందు భగవత్స్వరూప మొకింత విశదీకరింపబడినది. పురాణములందలి బ్రహ్మ విష్ణు మహేశ్వరు లను మూర్తిత్రయకల్పనముతో భారతీయజ్ఞానము పారము ముట్టిన దెంచరాదు. భాగవతతత్త్వమునందలి మూర్తిత్రయము: అంతకంటెను గభీరమైనది. "బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే" అని భాగవతకారుడు అద్వయమైనపరతత్త్వమును నిర్వచించినాడు. బ్రహ్మ, పరమాత్మ, భగవానుడు, ఈ మూడును పర్యాయపదములుకావు. ఇవి వేదాంత త్రిత్వమును వ్యక్తీకరించు సాంకేతిక పదములు. సర్వాతీతమైనది-బ్రహ్మము. సర్వాంతర్యామి-పరమాత్మ. మఱి యీ ద్వయమును అతిక్రమించి వీనిని అంగీభూతమును అంతర్భుక్తమును చేసుకొనుచున్నది భాగవతతత్త్వము. మొదటిది "The Transcendental". రెండవది The Immanental. మూడవది "The Concrete Whole." ఈ మూడును తత్వతః ఒక్కటే. కాని ద్వంద్వభూయిష్ఠమైనబుద్ధికి ఈ మూడును పరస్పరవిరుద్ధములైనతత్త్వములుగ గోచరించును. బుద్ధినే పరమప్రమాణముగ జేసుకొనిన దార్శనికులు ఈ మూటిని సమన్వయింపలేక మతవివాదములందు జిక్కుకొని, పాక్షికసిద్ధాంతములను చేయబూనిరి. సర్వాతీతమైన పరబ్రహ్మమే సత్యమని కొందరు, సర్వాంతర్యామియైన పరమాత్మయే సత్యమని మరికొందరు,

శ్రీ వేమన గ్రంథాలయము
తెనాలి ప్రోలు (కృష్ణా)

భగవత్తత్త్వము భక్తులుకల్పించుకొనిన ఉపాస్యమని మరి కొందరు,- ఈ విధముగ భిన్నసంప్రదాయములను తదను గుణములైన సాధనవిధానములను గల్పించుకొనుచుండిరి.

గీతలలో ముగ్గురు పురుషులు పేర్కొనబడిరి. ఒకడు క్షరపురుషుడు. రెండవవాడు అక్షరపురుషుడు. క్షరాక్షరముల కును పరాపరప్రకృతులకును అతీతుడైన మూడవవాడు పురుషోత్తముడు. శ్రీకృష్ణుడు "నేను క్షరుడనుగాను అక్షరుడను గాను, ఈ రెంటిని అంతర్భుక్తముచేసుకొనిన పురుషోత్తము డను" అని ముక్తకంఠముతో బలికినాడు. ఈ పురుషోత్తమ స్వరూపమే భాగవతమునందు భగవత్తత్త్వముగ నిరూపించ బడినది. వివిధదర్శనములు, భిన్నసాధనములు, భక్తిజ్ఞానవైరాగ్యములు, భగవత్తత్త్వమునందు సమన్వితములైనట్లు ఏ యితర తత్త్వమునందును కాజాలవు. భగవత్తత్త్వము నవగాహించకున్నచో భారతీయుల విగ్రహారాధనముయొక్క మూలరహస్యము గోచరముకాజాలదు. కేవల నిర్గుణోపాసకులకు సాకారోపాసన గౌణము. కావుననే ప్రతిమార్చన అల్పబుద్ధులైన మందాధికారులకొరకు ఉద్దేశింపబడినదని మాయావాదులు చెప్పుదురు. కాని మందాధికారులకొరకు ఉద్దేశింపబడినది ప్రతీకోపాసనగాని, సాకారోపాసనకాదు. మధ్యమాధికారులకొరకు ఉద్దేశింపబడినది సంపదకోపాసన. నిరాకార తత్త్వము ననుభూతము చేసికొనగల ఉత్తమాధికారులే సాకారోపాసనయొక్క పూర్ణప్రయోజనమును బొందగలరు. జ్ఞానము భక్తిసిక్తమైనగాని, నిఖిలరసామృతమూర్తిదర్శనము లభింపదు. ఆ యనన్యభక్తియందు సాకారనిరాకారములు, సగుణనిర్గుణములు, పరాపరప్రకృతులు ఐక్యములగును.

బుద్ధి యెప్పుడును పార్థక్యమునే చూచుచుండును. అఖండసత్యమును ఖండఖండములుగ జీల్చి, ఒక్కొక్కటినే పూర్ణసత్యమని భ్రమపడుచుండును. "సమంబ్రహ్మ" ము నందీభేదములెక్కడ? ఒక్కనాదమే గాయకుని శారీరమున భిన్నరాగ ప్రస్తారములుగా అభివ్యక్తమగురీతి, ఒక్క శ్వేత కిరణమే స్ఫటికద్వారమున ప్రసరించినప్పుడు సప్తవర్ణశోభితమై ప్రకాశించినటుల, సంస్కృతబుద్ధికి సకలతత్వములు ఒక్క భగవంతుని భిన్నదిక్కులుగ, భిన్నకళలుగ, చిత్రవిచిత్ర లీలావిలాసములుగ ప్రత్యక్షమగును. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను మంత్రమునందలి "ఏకమ్" సంఖ్యావాచకము కాదు. అది తప్ప మరియొకటిలేదని అర్థము. "ఏకం సత్ నాన్యత్ కించిదస్తి" సత్తుచిత్తుల కభేదమని దాని భావము. ఆ యైక్యము అనుభవైకవేద్యము.

పాశ్చాత్య సభ్యతాసంఘట్టనమున భారతసంస్కృతి యొక్క క్రమవికాసమునకే కాదు, మొదలు ధారకే ముప్పు వచ్చినది. సంఘములోపలను బయటనుగూడ తీవ్రమైన పోరాటమేర్పడెను. జీవనముయొక్క వివిధప్రకరణములయం దెట్టి సామరస్యమును గన్పట్టుటలేదు. ధర్మార్థకామమోక్షములకు బరస్పరము స్పర్థ కలిగెను. భారతజాతి స్వయం నియంతృత్వాధికారమును గోలుపోయి అంధప్రాయమైన అనుకరణములోనికి దిగినది. భరతవర్షమువలె ఆత్మవిస్మృతి బొందిన దేశము మరియొకటిలేదు. కాని యీ పురాణపుణ్యావని స్వశక్తిని మరచి ఎంతకాల మిట్లు నిద్రించగలదు? భారత జాతిని పారతంత్ర్యమున బడవేసిన ఆపాశ్చాత్యసంఘట్టనమే నేడు దానిని తిరిగి ప్రబుద్ధమొనర్చుచున్నది.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

భారత సంస్కృతి చందనతరువువంటిది. దానిని నర కినకొలదియు క్రొత్త క్రొత్త పరిమళములు బహిర్గతములగు చుండును. భారతీయులు తిరిగి స్వస్వరూపసాక్షాత్కారమును బొందుటకు అన్వేషణమును ప్రారంభించిరి. ఈ మధ్యకాలములో ఎందరో భక్తులు యోగులు తత్త్వవిదులు సంస్కర్తలు పరిశోధకులు శ్రేణులుదీర్చి బయలుదేరలేదా? చూచుచు జూచుచుండగనే నవ్యభారతము తిరిగి సృష్టియగుచున్నది. భరతవర్షము విశ్వమధ్యముననిలచి, జ్ఞానసామ్రాజ్యమున గురుపీఠము నధిష్ఠింపనున్నది. ఆ శుభముహూర్తముకొరకు ఆ కళ్యాణసంరంభమునకై ప్రపంచమంతయు వేచియున్నది. దేశములోపల ప్రతిభాశాలురు ఆ భావిభాగ్యోదయ రేఖలను గాంచి, ఉపన్యాసములనుబాడుచు అర్ఘ్యోదకములనువిడుచు చున్నారు. ఆ సౌభాగ్యరేఖలను స్థూలారుంధతీ న్యాయముగానైన సూచింపగలిగినయెడల, నీ కూర్పు సార్థకము కాగలదు. భారతసభ్యతా జిజ్ఞాసువులయందు సమాలోచనమును బురికొల్పుటయే యీ ప్రచురణముయొక్క ఉద్దేశ్యము. పఠితృలోకమే అందులకు ప్రమాణము.

1—6—37 మ. కృ.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

I శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

# మంగళగీతము

భైరవి

అయి భువన - మనో - మోహిని !
అయి నిర్మల - సూర్య - కరోజ్జ్వల - ధరణి !
జనక - జననీ - జనని !
నీల - సింధు - జలధౌత - చరణతల
అనిల - వికంపిత - శ్యామల - అంచల
అంబర — చుంబిత - ఫాల - హిమాచల
శుభ్ర - తుషార - కిరీటిని !
ప్రథమ - ప్రభాత - ఉదయ - స్తవగగనే
ప్రథమ సామ - రవ - స్తవ - తపోవనే
ప్రథమ - ప్రచరిత - స్తవ - వన - భవనే
జ్ఞాన ధర్మ కథా పుణ్య - ఖ్యాతినీ !
చిర కళ్యాణమయీ - త్వంధన్య
దేశ విదేశే - వితీర్ణ - అన్న
జాహ్నవీ - యమునా - విగళిత - కరుణా
పుణ్య - పీయూష - స్తన్య - వాహినీ.

రవీంద్రుడు.

3 శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)

## ప్రణయకీర్తనము * *

కవికులతిలకమగు కాళిదాసుని కృతులు శృంగారరస ప్రధానములు. శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, బీభత్స, రౌద్ర, శాంతములనెడు నవరసములలో శృంగారము ప్రథమమే కాక, ప్రధానము కూడ నగుటచే ఆలంకారికులు దీనిని ఆదిమరసమని ప్రశంసించిరి. వైష్ణవభక్తులు నిరూపించు శాంత దాస్య సఖ్య వాత్సల్య మధురములనెడు పంచ భావములలో మధురభావము రసశిరోమణిగ పరిగణింపబడుచున్నది. శృంగారరసమునకును మధురభావమునకును స్థాయి భావము రతియగుటచే నీరెండును ఒకటియేయని తెలియనగును. పరస్పరరూపలావణ్యములం దుద్భవించి, స్వప్నచిత్రసాక్షాద్దర్శనములచే దృప్తినొందక, ప్రియాంగప్రాప్తికై నిత్యనూతన రూపములం దాల్చుచు, ఒకప్పుడు శిరీషముకంటెను కోమలమై, ఇంకొకప్పుడు వజ్రముకంటెను కఠోరమై, హర్షము, విషాదము, ధైర్యము, గర్వము, కార్పణ్యము, క్రోధము, క్షమ, దురభిమానము, నిర్వేదము మొదలగు వికారములనొందుచు, ఏకనిష్ఠ, సంగలిప్స, ఆత్మప్రసన్నత్వము, కారుణ్యము, ఏకాత్మత మొదలగు భావముల కావాసమై జరామరణశూన్యమై స్థిరసౌదామినింబోలె విరాజిల్లు నాయికానాయకుల యీప్రేమలీలావిలాసము ఎల్లదేశములలోను

4 ఎల్లకాలములలోను కవులకు వర్ణనీయమైన విషయమగుటలో నాశ్చర్యమేమి ?

ప్రాచ్యులు పాశ్చాత్యులునగు కవులెల్ల రీ శృంగారరసాస్వాదనమునందు లాలసులై యుండినను, వారి రచనలయందు చూపిన పోకడలయందేకాక రసస్వరూపనిరూపణమునందు గూడ విశేషవ్యత్యాసము పొడగట్టును. ఆంగ్లేయసాహిత్యము నందు సుశిక్షితులైన మన విద్యాధికులు దేశీయసాహిత్యము నెడల తరచుగ జూపు నిరసనభావమే యీ వ్యత్యాసమును చెప్పక చెప్పుచున్నది. "లవ్" అను ఇంగ్లీషు పదమునకు దేశీయవాఙ్మయమునందు పర్యాయపదము లేదని చెప్ప సాహసించు వివేకులు మన విద్యాధికులలో బయలుదేరుటయే పాశ్చాత్య సాహిత్యము వారిలో నెట్టి వ్యామోహమును గల్పించినదియు తెల్లమొనర్చుచున్నది. కాని ఉభయఖండముల వాఙ్మయములను జాగ్రత్తగ బరిశీలించినచో ముఖ్యముగ ప్రణయకీర్తనమునందు పాశ్చాత్యకవు లెంత వెనుకపడినదియు స్పష్టపడును. ఈ మాట మన విద్యాధికులకు ఆశ్చర్యమును గలిగించక మానదు.

పాశ్చాత్యకవులు రచించిన శృంగారరసప్రధానములగు కావ్యములందు ముఖ్యముగ నొక్క విశేషము గన్పట్టును. ఉద్దామమై, పొంగి పొరలి, కూలములను దెగద్రోయుచు, వెల్లువమై పాఱు భాగీరథింబోలె, నారీనరుల యౌవనప్రభావమున నావిర్భవించు ప్రణయము మానవకల్పితములగు నియమములను, విధినిషేధములను నతిక్రమించి, తన స్వతంత్ర నిరంకుశత్వమును జాటుకొనుటలో బ్రదర్శితమగు ఉద్వేగమును పాశ్చాత్యకవు లతిసమర్థతతో నిరూపించి రను

టకు సందియము లేదు. ఆ యుద్వేగము ముఖ్యముగ షేక్స్పియరు మహాకవియొక్క "ట్రాజిడీస్" అను దుఃఖాంత రూపకములలో నెక్కువగ గన్పట్టును. "రోమియో జూలియటుల" ప్రణయోద్దామత ఆంగ్లేయ సాహిత్యమునకెల్ల మేలిబంతియైనది. "షెల్లీ" మహాకవియొక్క "ఎపిసైకిడియను" వంటి కావ్యములలో ప్రేమయొక్క స్వాతంత్ర్యమును, నిరంకుశత్వమును నతిహృద్యముగ వర్ణింపబడియున్నవి. ఇటీవల ఆంగ్లేయనవలలలో, జాతిమతభేదములు, వివాహము, సామాజికనియమములు మొదలగు కల్పితవిధు లెట్లు ప్రేమను బంధించి యుంచజాలవో, ప్రేమప్రాబల్యమున సాంఘికసంస్థ లెట్లుకూలుచున్నవో, ఆవిషయములు విచిత్రరీతుల వర్ణింపబడుచున్నవి. "బియాట్రిస్" పాత్రరచనయందు కూడ నీ యవస్థ అతిక్రమింపబడలేదు. మొత్తముమీద పాశ్చాత్యసాహిత్యములందు ఎంతవఱకును ప్రేమయొక్క వేగము వర్ణింపబడుటయేకాని ప్రేమయొక్క చరమలక్ష్యమును కనుగొనుటకు ఆంగ్లేయకవు లంతగ బ్రయత్నింపలేదని పరిశీలకులు గ్రహింపకపోరు. ఇయ్యది వారి దోషముకాదు. ఏకవియు తన సంఘమునం దంతర్గతముగ లేని ధర్మభావమును వెలిబుచ్చజాలడు. ఆంగ్లేయజాతి ప్రేమయొక్క పరిపూర్తి ఎందున్నదియు గ్రహింపలేదనుట సాహసముకాదు. వారి సామాజిక రాజకీయసంస్థలే యిందుకు ప్రమాణములు. వారి సామాజికనీతియం దేలోపమున్నదో, ఆ లోపమే వారివాఙ్మయమునందుకూడ వ్యక్తమగుట సహజము.

మొదట రసమార్గముయొక్క సాధన వ్యతిరేకముఖమున నుండును. ప్రేమోదయకాలమున సర్వమును దాని సాఫల్యమునకు బ్రతికూలముగ నున్నట్లు గనుపడును.

సంఘము, వివాహము, సంసారము మొదలగు సమాజ నియమ బద్ధములగు నేర్పాటులన్నియు నీ ప్రేమాంకురమునకు అంతరాయములుగ భావింపబడును. ఈ వ్యతిరేకభావము హెచ్చిన కొలదియు ప్రేమయొక్క వేగముకూడ హెచ్చుచుండును. లజ్జ, భయము, అసహనము, ధైర్యము, క్రోధము, కార్పణ్యము మొదలగు రాజసికవికారము లన్నియు తీవ్రముగ బెరుగసాగును. నాయికానాయకు లీప్రతికూలావస్థనుండి తప్పించుకొనుటకు నొక కల్పితజగత్తును సృష్టించుకొందురు. అం దంతరాయము లుండవు. బంధనము లెదుర్కొనవు. స్వేచ్ఛావిహారమున పరస్పరసూవలాలనయందు విహ్వలులగుచుందురు. కాని ఇది కల్పితజగత్తు. ఇది సంఘముయొక్క పొలిమేరలలో, సంసారమునకు దూరముగ, వాయుమండలమున నిర్మింపబడు కృత్రిమసౌధమువంటిది. అందుండి చూచిన జగత్తు చలనములేనిదై యుండును. సమాజము ఆత్మను బంధించియుంచు శృంఖలమువలె గన్పట్టును. సంసారము మందమై భారమై తోచును. ప్రేమయొక్క నవకిసలయములు పరులదృష్టిని సహింపజాలవు. స్వాధీనతారసమునందే ప్రేమ తన యుద్దామతను ప్రజ్వలింపజేసికొనుచుండును. కాని యిది వాస్తవజగత్తు కాదు. ఇందు వస్తుతంత్రము లేదు. దీనిని బోషింపగల మార్గములు లేవు. ప్రతికూలమగు పరివేష్టనము నందు జిక్కుకొనిన జీవివలె నది నిరంతరము ఉద్రేకమున బ్రజ్వరిల్లుచుండును. స్థిరత్వము లేదు. సామంజస్యము లేదు. శాంతి లేదు. కల్యాణము లేదు. భయము, అసహనము, క్రోధము, విద్రోహము, చాంచల్యము మొదలగు చిత్తవికారములతో ప్రేమ యుద్వేజితమగుచుండును. దీనిని జ్వరమువంటి రోగమనిన దోషములేదు. పాశ్చాత్యసమాజము లట్టి యశాంతి

యందు, అట్టి వేగమునందు, అట్టి ప్రయాసయందు జిక్కు-కొనినప్పుడు, వారి సాహిత్యములందు కూడ నట్టి యశాంతి ప్రతిఫలించుటలో నాశ్చర్యము లేదు. వారి నాటకములు విషాదాంతము లగుట సహజము. సంఘము మారుచున్నను, నియమములు పరివర్తనము నందుచున్నను, వాని యడుగున ధ్రువత్వమును, స్థిరత్వమును, సామంజస్యమును ఏది కల్పింప గలదో అయ్యది పాశ్చాత్య నాగరకతయందు మృగ్యము. దానికొఱకు పాశ్చాత్యులింకను అన్వేషించుచున్నారు. దానిని కనుగొనుటకు వారికి తగిన చిత్తశాంతి యింకను కుదుర లేదు. ఈ ఇంద్రియ చాపల్యమున, ఈ భోగలాలసయందు, ఈ తీవ్ర ప్రయాసయందు, ఈ భయమోహములయందు, ఈ భ్రమయందు వారికి చరమలక్ష్యము గోచరము కాజాలదు. ఇంద్రియములు పరిశుద్ధత నొందినగాని, చిత్తమున కొంత శాంతి యలవడినగాని, ప్రపంచము యొక్క పోరాటము సంఘర్షణము స్పర్థయు నణగినగాని, సంఘముయొక్క పునాది యం దుండవలసిన స్తిమితత్వము, స్థిరత్వము, మంగళము హృద్గోచరములు కావు. ఆ సమయ మెప్పుడు వచ్చునో? అందుకై పాశ్చాత్యులింకను ఆవేదన పడవలసియున్నది.

సంస్కృతకవులును ప్రేమయొక్క వేగమును అసహనమును వర్ణించకపోలేదు. ఆ వర్ణనలు భరతవర్షముయొక్క శీతోష్ణస్థితులవలె నిరంతర స్పర్థతో, ప్రచండ వేగముతో, ప్రపంచ మంతయు తారుమారగుచున్నటుల చిత్రింపబడెను. పూర్వరాగముయొక్క ప్రథమావస్థయంతయు నట్టి ప్రేమోద్వేగముచే విరహవేదనల కాలవాలమగును. చేతనాచేతనములన్నియు బ్రతికూలములై, మిథునానురాగముపై స్పర్థ వహించును. సకల ఋతువులు సంహారమునకు గడంగును.

శీతమయూఖుడు సహితము ప్రచండభానునికంటె తీక్ష్ణతాప మును గలుగజేయును. కుసుమములు వజ్రబాణములకంటె కఠినములగును. మలయమారుతము విషప్రసారము భంగి అగ్నిజ్వాలలను రగుల్కొల్పును. సఖుల విశ్వాసముకూడ అనుమానాస్పదమగును. పితలు శత్రువులగుదురు. ఈ వ్యతి రేకావస్థను సంస్కృతకవు లత్యద్భుతముగ వర్ణించిరి. ఆ వర్ణించుటలో భరతవర్షముయొక్క ప్రకృతివైచిత్ర్యము లన్నియు నూతనార్థములతో వినోదభావమును వెలిగ్రక్కు నటుల సూచింపబడెను. అద్భుతమగు నీ కావ్యసృష్టిని ఒక్క సంస్కృతసాహిత్యమునందే చూచి యానందింపగలము. కాని సంస్కృతకవు లీ వ్యతిరేకపథమును మాత్రము వర్ణించి తృప్తి బొందలేదు. మోహమును అకృతార్థముగ జేయుటకు వా రిష్టపడరు. వారి సామాజికనీతి అందుకొప్పదు. కావుననే విషాదాంతకావ్యములను దేశీయాలంకారికులు దూష్యము లనిరి. అయ్యవి సృష్టియొక్క రహస్యమందిరమును బ్రవేశిం పని పాశ్చాత్యులకే సరిపోయినవి కాని సకలవ్యవహారముల కును చరమలక్ష్యమును, పరమార్థమును అనుభవసిద్ధము చేసికొనిన భారతీయు లందు కెట్లు సమ్మతింతురు ? ప్రేమో ద్వేగమునకు సంఘమును సంసారమును బలియిచ్చుట ధర్మ మునకు విఘాతము. సంహితలు, సాధనలు, సాహిత్యములు, కళలు,—సర్వమును హిందూదేశములో ధర్మభావమున సమ న్వయము కావలయును. అట్లుకాని ఏ యాచారమును, ఏ సాహిత్యమును హిందూసంఘము జీర్ణించుకొనజాలదు.

ప్రేమయొక్క పరిణామమును భారతీయ కవు లెట్లు నిర్ణయించిరను విషయము ప్రస్తుతాంశము. పాశ్చాత్యకవుల దృష్టిని మరుగుచేయు యవనికను సంస్కృతకవులు ఛేదించి,

ప్రణయలహరి యింకను రాగతాళములతో నృత్యమునల్పుచు ప్రవహించి, ప్రవహించి క్రమక్రమముగ విశుద్ధతజెందుచు సంసారసాగరమున నెట్లు నిస్తబ్ధత జెందుననదియు ననదృశముగ జూపిరి. వారిలో కాళిదాసు "కులగురువు". యౌవన ప్రభావమున నావిర్భవించు మోహము, సంయతిచే శాంతిని, ధర్మధారణచే ధ్రువత్వమును, సంసారముచే మాంగళ్యమును బొందినగాని, అయ్యది చంచలము, ప్రతికూలమునగు జగత్తు నుండి తప్పించుకొని కృతార్థత జెందనేరదు. ప్రేమలో వేగ మున్నంతకాలము స్థిరత్వము లేదు. విశృంఖలస్వాధీనతయందు స్థిరత్వముశూన్యము. బంధనమునందే సౌందర్యము జరామరణ ములు లేక స్థిరసౌదామినివలె విరాజిల్లును. హిందువుల పూర్వ మీమాంసాప్రకారము స్త్రీయొక్క జన్మము మాతృత్వము నందే సాఫల్యము నొందును. వివాహము సంసారమునకు భూమికవంటిది. స్వాతంత్ర్యప్రాప్తికి సమాజనియమములు సాధ నములే కాని ప్రతిబంధకములుకావు. దుఃఖద్వారమున ఆనం దమును, త్యాగముమూలమున భోగమును అనుభావ్యములు. సంయతి, స్థైర్యము, త్యాగము లేనినాడు ప్రేమ ననుభవించుట కధికారములేదు. బ్రహ్మచర్యమునందలి కఠోరనియమములే ప్రేమోద్దామతను తగ్గించి గృహస్థాశ్రమమందలి మాంగళ్య మున జేర్పగలుగును. గృహస్థాశ్రమమునకు రెండు ద్వార ములు కలవు. ఒకటి కళ్యాణబంధనము, రెండవది ఆత్మ యొక్క నిర్లిప్తత. కావుననే హిందూగృహమునకు ఋషి త్వము పునాదియైనది. "ప్రజాయై గృహమేధినాం" అని కాళిదాసమహాకవి చెప్పిన వివాహప్రయోజన మంగీకరించిన గాని, వివాహమున కధికారములేదు. లోకకళ్యాణమును లక్ష్య మునం దుంచుకొనని వివాహము వివాహముకాదు. అయ్యది

కేవలము విషయసంభోగము. ఎప్పుడు సంసారమునందలి
10 కళ్యాణము ప్రేమయొక్క చరమలక్ష్యముగ భావింపబడెనో అప్పుడు ప్రేమయొక్క అన్వయమార్గము గనుపెట్టబడెను. వ్యతిరేకమార్గమున సర్వనియమములు ప్రతికూలమైనట్లు అన్వయమార్గమున సమస్తము అనుకూలమగును. ఈమార్గమున ప్రేమోద్వేగము శాంతియందు పరిణమించును. ప్రణయమునకు ధ్రువత్వము సంఘటించును. సంసారమున మధురభావము విరాజిల్లును. ప్రేమ యిక కృత్రిమాలంకారములను, కల్పితజగత్తును, చంచలస్వభావమును వీడి, ధర్మముపై నిర్మింపబడిన భావప్రపంచమున ధ్రువత్వమును, శివత్వమును బొందును. ఇక సర్వము సమన్వయము కాకుండ నెట్లుండగలదు? శరీరము ఆత్మ, బంధనము స్వాతంత్ర్యము, ప్రేమ సంసారము, భోగము త్యాగము, దుఃఖము ఆనందము- సర్వము ఒక్క మధురభావమున ఒక్క శృంగారరసమున మేళనమగును. ఇత్యాదియే సంస్కృతకవులు త్రొక్కిన అన్వయమార్గము. ప్రేమ విషాదమునగాక మంగళముననేపూర్ణత్వము నొందును. అందు విఘాతమే లేదు. శివుడు మృత్యుంజయుడైయుండ వాని నాశ్రయించిన ప్రేమ యెట్లు విషాదమున నంతమొందును? పాశ్చాత్యుల ప్రణయకీర్తనమునకును, సంస్కృతకవుల ప్రణయకీర్తనమునకును ఇచ్చటనే వ్యత్యాసము గలదు. ఈజప్టుదేశ విమర్శకు డొకడు, పాశ్చాత్యుల ప్రేమ వివాహముతో నంతమగుననియు ప్రాచ్యఖండస్థుల ప్రణయము వివాహముతో నారంభించుననియు, నీయంశమునే భంగ్యంతరమున వెల్లడించెను. ఈసందర్భమున నొక యుదంతము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈమధ్య నొక ఆంధ్రవిద్యాధికు డొక యువతిని వివాహమాడెను. ప్రణయసమయమున

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)



నా వరుడు "సంతానము గలుగకుండ దైవమును బ్రార్థించు కొను" మని వధువున కుపదేశించెను. ఇది ప్రత్యక్ష నిదర్శనము. ఈ విద్యార్థికుడు కన్యయందు పత్నీత్వమునే జూచుట కుద్యుక్తుడయ్యెను గాని మాతృత్వము వానికి హృద్గోచరము కాలేదు. తన భార్యయందు మాతృత్వమును జూడలేనివాని యందు కాముకత్వము నశింపలేదని యర్థము. "ప్రజార్థై గృహమేధినాం" అను ఆదర్శమునందు గృహస్థాశ్రమము యొక్క పరమకళ్యాణమును మనోగతము చేసికొనినవానికే ప్రేమయొక్క నిజస్వరూపము సాక్షాత్కారము కాగలదు. అప్పుడే యోగికిని గృహస్థునకును గల సామంజస్యము తేటపడును.

శృంగారరసము సమస్తరసములకు నాయకమణి. ఈ రసమునకును ఏకాదశేంద్రియములలోని ప్రతి యింద్రియమునకును నిబిడమును, నిగూఢమునగు సంబంధము గలదు. ఈ రసము ప్రథమావస్థయందు కూసము విడిచిన కాలసర్పమువలె విషజ్వాలలు గ్రక్కుచుండును. కాని ఈ రసమున కాధారుడు మదనారియగు మహేశ్వరుడని మఱవగూడదు. మన్మథుని మొదట భస్మీభూతునిగజేసి తిరిగి అనంగునిగ బ్రతికించినగాని ఈ రసము నాస్వాదించుట కధికారము కలుగదు. లేనియెడల విషయలాలనయందు పెరుగు మోహము చంచలమై ముహూర్తముహూర్తము ఒక్కొక్క విషయము నాశ్రయించి ఉద్వేగము నొందుచుండును. పరముహూర్తమందు విషయాంతర ప్రేరణవలన భావవికారము కలుగుచుండును. విషయలిప్సాజనితమగు నీ యుద్వేగము చిత్తైకాగ్రతకును సమత్వమునకును వ్యాఘాతము గలిగించును. ఇది ధర్మధారణమున కంతరాయము. ధర్మము లేనిచోట రస ముప్పొంగజాలదు. రసాధి

కారమందు ఉద్వేగమును, చంచలత్వమును, బహుముఖత్వమును నిరోధింపవలయును. నిరోధించుట యనగా నిర్మూలన మొనర్చుటగాదు. ఆపస్తంబ, ఆశ్వలాయన గృహ్యసూత్రములు శుష్కవైరాగ్యమును బోధించవు. అవి కామసూత్రముల ననుసరించియే యుండును. హిందూ ధర్మమీమాంసలన్నియు, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురభావములను శాంతరసముపై నెలకొల్పజూచును. ఏలయన శాంతము సకల రసములకును ఆశ్రయము. చిత్రకారుడు చిత్తరువును చిత్రించుటకుబూర్వము, పటమునందు, ముందుగ సఫేదురంగును బూయును. అందుపై చిత్రవర్ణసమావేశ మొనర్చి విగ్రహమును జిత్రించును. అట్లే రసభోగియొక్క చిత్తపటమునందు ముందుగ శాంతరస శుభ్రవర్ణ మంకితముగావలయును. తదనంతరము శృంగారాదిరసమూర్తులు పరిపూర్ణవికాసము జెందును. కావున శాంతసమాహితుడు కానివానికి రసాస్వాదనగాని, సాధనగాని సంభవములుగావు. శాంతరసము నివృత్తిమూలకముగాదు. శృంగారరసముయొక్క స్థాయిభావము రతి. రతి నివృత్తికాదు. కాని ఇందు మమతాగంధముగాని, విషయసుఖస్పృహగాని, భోగవాసనాజనితోద్వేగముగాని, ఆత్మసుఖవ్యాఘాతజనితక్రోధముగాని ప్రబలకూడదు.

శ్లో॥ ప్రాయశః శమప్రధానానాం, మమతాగంధవర్జితా ।
పరమాత్మతయాకృష్ణే జాతా శాంతరతిర్మతా ॥

ఈశాంతరతియందలి ధర్మమే నాయికా నాయకులయం దుండవలసిన ప్రధానలక్షణము. ఈశాంతగుణము విశ్రుంఖలస్వాధీనతయందు అలవడనేరదు. సంహితలు ధర్మసూత్రములు నీ గుణవ్యవసాయమునకై ఆశ్రమవ్యవస్థల నేర్పరచి, సంయతిలేని రసాస్వాదనము విషయలౌల్యమని ఘంటాపథ

ముగ జెప్పుచున్నవి. ధర్మవ్రతనియమములచే సిద్ధిపొందని శరీరమందు కామముయొక్క పైశాచిక నృత్యము మాత్రమే గన్పడుచుండును. ఈనృత్యమునుజూచి రసలీలయని భ్రమ పడుట మహాపాతకము. ఆనృత్యము పైశాచికము గనుకనే విషాదాంతమగును. నియమబద్ధ సంసారమున బ్రకాశించు విశుద్ధమధురరసము మంగళాచరణముతో నుపసంహారము నొందును. భారతీయుల గృహస్థాశ్రమ రహస్యమును దెలిసి కొనిన సంస్కృతకవులు మంగళాంతములగు రూపకములను రచించి ధన్యులైరి. దారువునందు బుట్టిన అగ్ని క్రమముగ దారువునే దహించు భంగి శరీరలావణ్యమున నుద్భవించిన అనురాగమను నిర్ధూమధామానలము ధర్మధారణచే ఇంద్రి యములను జయించి మమతాగంధరహితమగు శాంతరతియం దోలలాడును. పరిణయముయొక్క యీపరమరహస్యమును కాళిదాసమహాకవి తనరచనలయం దెట్టి యసదృశ కళానైపు ణ్యముతో నుత్తేజింపజేసినదియు ముందు చూపబడును.

1916

*

శ్రీ వేమన గ్రంథాలయము

## కుమారసంభవము * *

ప్రణయమహిమను దెలియజెప్పుటలో జగత్పితలగు పార్వతీపరమేశ్వరుల ప్రేమలీలావిలాసముకంటె మంచి యుపమానము లేదు. కవికులగురువు కాళిదాసు పార్వతీమహేశ్వరుల ప్రణయమును గీర్తించి ధన్యుడయ్యెను. ఈ పార్వతీమహేశ్వరులెవరు? ఆనందస్వరూపమగు పరమతత్త్వము కేవలము విశుద్ధాద్వయవస్తువు కాదు. కాళిదాసు పరమతత్త్వము నిట్లు నిరూపించుచున్నాడు:

> త్వామామనన్తి ప్రకృతిం పురుషార్థప్రవర్తినీం
> తద్దర్శిన ముదాసీనం త్వామేవ పురుషం విదుః
> త్వమేవ హవ్యం హోతా చ, భోజ్యం భోక్తా చ, శాశ్వతః
> వేద్యం చ వేదితా చాసి, ధ్యాతా ధ్యేయం చ యత్ పరమ్॥

సచ్చిదానందస్వరూపుడగు పరబ్రహ్మమున జ్ఞాత-జ్ఞేయము, కర్తృ-కార్యము, భోక్తృ-భోగ్యము, అచింత్యరూపమున భేదాభేదములను బొందుచున్నవి. ఆ లీలావిలాసమనిర్వచనీయము. ప్రపంచమున బ్రకాశించుచున్న బాహ్యలీల ఆ పరమతత్త్వమునందలి ప్రకృతిపురుషుల అభ్యంతరలీలయొక్క ఆభాసమే. కాని ఆ యభ్యంతరలీల నెందరు అనుభూతము చేసికొనగలరు? స్థితప్రజ్ఞులగు జీవన్ముక్తులే యట్టి యనిర్వాచ్యానందమున నోలలాడగలరు. ఆ యానంద

మును లోకులకు జవిచూపుటకై కాళిదాసమహాకవి పార్వతీ పరిణయమను నొక పురాణగాథ నవలంబనముగ దీసికొని, కుమారసంభవమను లోకోత్తరమైన ప్రబంధమునురచించెను. ఈ పురాణగాథ చరిత్రవిషయమా యను శంకతో మనకు బనిలేదు. మనకు గావలసినది సాహిత్యవిషయము మాత్రమే.

అప్రాకృతవిషయములతో నిండిన పురాణములు సాహిత్యమున కెట్లుపకరించునని ప్రశ్నించవచ్చును. లోక వ్యవహారములకు సరాసరి నకలుగనుండునదియే సాహిత్యమని పాశ్చాత్యుల యభిప్రాయము. సంస్కృతకవుల యభిప్రాయ మట్టిదికాదు. కవి కేవలము "కాపీస్టు"కాని "ఫొటోగ్రాఫరు"కాని కాడు. "వాక్యం రసాత్మకం కావ్యమ్" రస లీలలను ప్రదర్శించునదియే సాహిత్యము. "రససిద్ధాః కవయః" రససిద్ధులైన కవులే యట్టి రసలీలలను బ్రదర్శింపగలుగుదురు. "నిరంకుశాః కవయః" కవులు నిరంకుశులు. లోకము వారిని శాసింపజాలదు. కవులే లోకములను శాసింప గలుగుదురు. కావ్యములు వ్యవహారదర్పణములైనచో నవి ఉద్దీపన సాధనములు కాజాలవు. కవులు మంత్రద్రష్టలగు ఋషుల వలె, బాహ్యలోకవ్యవహారముల మఱుగున, సృష్టియొక్క హృదయాంతరాళమున బ్రవహించు రసవాహినియందు బ్రవేశించి, అందుండి అమృతభాండములను బైకిదెచ్చి లోకులకు బంచిపెట్టుదురు. ఆ యమృతభాండములు లోకవ్యవహార చరమలక్ష్యములను జూపును. దేవతలు పురాణకవుల మానసమూర్తులు. భరతవర్షాంతరాళమున బీజరూపముగ నుండిన భక్తిజ్ఞానవైరాగ్యములకు విచిత్రరీతుల రూపకల్పనలు గావించి, పురాణరచనలయందొక క్రొత్త ప్రపంచమును సృష్టించిరి. ఈప్రపంచము వ్యాసాది మహర్షుల గభీర

రసానుభవములనుండి బహిర్గతమగుటచే నిది మనకును బాహ్యావిషయము కాజాలదు. పురాణములు భారతధర్మ ప్రపంచమున దాగియుండు రసజగత్తుయొక్క ప్రకాశములని తెలియనగును. యథార్థముగ నాలోచించితిమేని ఈరస జగత్తు బాహ్యావ్యవహారములకంటెను సత్యమైనదనికూడ గ్రహింపగలము. అందుకనియే వ్యవహారములు మారు చున్నను పురాణములు సతతము ధర్మప్రపంచము నుద్దీపనము గావించుచు తమ యాధిపత్యమును గాపాడుకొనుచున్నవి. ఎందఱు కవులో శతశతాబ్దములనుండియు పురాణము లను గనులనుండి అమూల్యములగు రత్నములను దీసి సానబెట్టి సరస్వతీదేవికి కంఠాభరణములను గావించుచుండిరి. సరస్వతీ దేవియొక్క అపరావతారమని కీర్తిగాంచిన కాళిదాస మహా కవియే పురాణేతిహాసములనుగూర్చి "మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః" మణులను మాలికలుగ గూర్చు టయే నాపని యని చెప్పుకొనెను. ప్రణయకీర్తనము గావిం చుటలో సంస్కృతసాహిత్యమునందే కాదు, మఱి యేయితర సాహిత్యమునందైనను పార్వతీపరిణయమువంటి లక్ష్య మిం కొకటి లభించుట అసంభవము. అందు భరతవర్షముయొక్క మర్మమంతయు మూర్తీభవించియున్నది. కాళిదాసు రస సిద్ధుడగుటచే శివపురాణమునుండి ఈ యసదృశమైన వస్తువు గైకొని అసమానమగు కళావైదగ్ధ్యమును ప్రదర్శించెను.

దక్షప్రజాపతిపుత్రిక యగు సతీదేవి శివుని స్వయముగ వివాహమాడెను. దక్షు డొకమారు యజ్ఞము చేయుచు, సమస్తదేవతలను బిలిచి శివునిమాత్ర మాహ్వానింపలేదు. సతీదేవి తనభర్తకు తన తండ్రి గావించిన తిరస్కారమును భరింపజాలదు. ఎవరివలన శివునకు తిరస్కారము గలిగెనో,

హానివలన బొందిన దేహమును త్యజింపక సతీదేవి యెట్లూర కుండగలదు? సతీదేవి యోగబలముచే తన దేహమును దక్షుని యజ్ఞశాలయందే త్యజించెను. ఎట్టి యపూర్వపాతి వ్రత్యము! దాక్షాయణి అట్లు తన దేహమును త్యజించిననాటి నుండియు భరతవర్షము పుణ్యసతుల కాలవాలమై దనరు చుండుటలో నాశ్చర్యమేమి? సతీవియోగముచే నీ యర్ధనారీ శ్వరుడు శక్తివిహీనుడై తపోనిమగ్నుడయ్యెను. పార్వతి మృత్యుంజయు కాకపోవుటచే తిరిగి క్రొత్త దేహమును ధరించక తప్పదు. ప్రకృతి పురుషుని ఆశ్రయించుకొనియుండుననియు, పురుషుడు ప్రకృతిపై నాధారపడకపోయినను దాని అభావ మున నిర్గుణుడై యుండుననియు ఈ సందర్భము బోధించు చున్నది. ఈమాఱు పార్వతి యెట్టి దేహమును ధరించ వలెను? శివుని మహదైశ్వర్యము నెఱింగి వానియెడ పూజ్య భావము గలిగి యుండువాడే పార్వతికి జనకుడు కాగలడు! అట్టివాడు హిమవంతుడు. హిమవంతుడు నగాధిరాజు. పూర్వపశ్చిమ సముద్రముల వరకు వ్యాపించియున్నవాడు. ఉత్తమగుణసూచకములగు రత్నములు ఓషధులు మొదలగు ద్రవ్యములకు బుట్టినిల్లు. మేరువునకు సఖుడు. సోమ రసము వానియందే లభించుచుండుటచే యజ్ఞభాగమునకు గూడ సతర్హుడు! హిమాలయము ఒక అధిష్ఠాన దేవత యొక్క స్థూలదేహము. పృథివ్యాకాశములు మొదలుకొని సమస్తమునులకుగూడ బూజ్యురాలైన మేన కులశీల సౌందర్యాదులచే హిమవంతునకు వరణీయ యగుటచే ఆయనకు భార్య యయ్యెను. ఈ దంపతులకు మైనాకుడు ప్రథమసంతానము. మైనాకము అచలము కాదు. సప్త సముద్రములలోను సంచారము చేయుచుండును. ఇంద్రుని

వజ్రాయుధము పర్వతపక్షములెల్ల ఛేదించుచుండ మైనాకము సముద్రమున దాగుకొని అచలము గాక యుండ గలిగెను. ద్వితీయసంతానము పార్వతి. ఈ పార్వతియే ఆదిశక్తి, జగజ్జనని. ఈమెకు పూర్వ పశ్చిమసముద్రములవరకు వ్యాపించిన పర్వతచక్రవర్తి తండ్రియు, దిగంతములను నిండియుండు మేన తల్లియు, సప్తసముద్రములను సంచరించు మైనాకుడు భ్రాతయు నగుటలో నాశ్చర్యము లేదుగాని, మఱియీ పార్వతి తిరిగి శివుని చెంత కరుగుటెట్లు? "దేవతాత్మ" యగు హిమాలయుడు సర్వధర్మములు నెఱిగినవాడు. కావున తన కుమార్తెను ఇంకొక చక్రవర్తి కొసంగక, మహేశ్వరుని ఆశ్రమమునకు గొంపోయి అర్ఘ్యోదకముతో వానిని బూజించి జయావిజయులను నిరువురు సఖులను తోడొసగి, ఈశ్వరుని శుశ్రూషార్థము నియమించెను.

సతీవియోగముచే శక్తివిహీనుడైన శివుడు వ్యాఘ్రచర్మము ధరించి, గంగాధారపడుచోట, దేవదారువనాభ్యంతరమున, గభీరమైన తపస్సునకు గూర్చుండెను. అచ్చట మృగనాభిగంధభరితములైన కమ్మని తెమ్మెరలువీచుచుండెను. కిన్నరలు ఇంచుక గానము చేయుచుండిరి. నందియు, భృంగియు యథేచ్ఛగ సంచరించుచుండిరి. పార్వతి తన మృదుహస్తములతో జలమును, పుష్పములను, కుశలను శివున కందిచ్చుచుండెను. శివుడీ కన్యయొక్క పరిచర్యల నేభావమున స్వీకరించుచుండినదియు కవి చెప్పలేదు. పార్వతి శివుని కటాక్షములకు బాత్ర కాకపోయినను, వాని జటాజూటమున బ్రకాశించుచున్న చంద్రకళచే దేహక్లాంతిని మాత్రము దూరము చేసికొనుచుండెను. శివుని తపస్సున కుద్దేశమేమి?

స్వయం విధాతా తపసఃఫలానాం
కేనాపి కామేన తపశ్చచార ॥

మహేశ్వరుని మనమునందలి కామన యేదియో యెవరు చెప్పగలరు? అది అనిర్వాచ్యము. ఆదిశక్తి తిరిగి తన చెంతకు ఎప్పుడు వచ్చునాయని తపస్సు చేయుచుండెను గాబోలు! తపోనిరూఢుడైన శివుడు నవయౌవనముచే దీప కళికవలె బ్రకాశించుచున్న పార్వతిచేయు శుశ్రూష కంగీక రించెను. "వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం నచేతాంసి త ఏవ ధీరాః." శివుడీమెపై నొక్కమారైనను తనకటాక్ష మును బఱపలేదు. కాని పార్వతి అతిసహనముతో నియమ వేదికను చక్కగ శుభ్రముచేయుచు, నిత్యానుష్ఠానార్థము జలమును దర్భలను దెచ్చిపెట్టుచు, ప్రతిదినమును శివుని గొల్చుచుండెను. ఈ విధముగ గొన్నిదినములు గడచెను. శివుడు తన తపస్సును వదలి పార్వతిని స్వీకరించునట్లు లేదు. దేవతలు తొందరపడుచుండిరి. తారకాసురుని బాధచే దేవ తాశ్రమములన్నియు సంక్షుభితములగుచుండెను. పార్వతీపరిణ యమునగాని లోకమునకు తిరిగి కళ్యాణము చేకూరదు. పార్వతీసాన్నిధ్యమునయితను తపోవ్యగ్రమైన శివునిచిత్తము నాకర్షించుటకు సమర్థముకాలేదు. ఇంద్రసభ జరిగెను. పార్వతికి మన్మథబాణము తోడ్పడినగాని దేవతల యభీష్టము సిద్ధింపదని అచట నిశ్చయింపబడినది. మన్మథుడును, రతీ దేవియు, వసంతుడును శివుని యాశ్రమమునకు బోయిరి. వసంతునిరాకతో ఆ గిరిపరిసరముల అకాలవసంతోదయమై మోడువడియున్న చెట్లన్నియుజిగిర్చెను. పుష్పములు వికసించి పరిమళముల వెదజల్లుచుండెను. తుమ్మెదలు ఝంకారములు చేయుచుండెను. శుకములు కలరుతములు సేయసాగెను. పశు పక్షులు కిన్నరులుమున్నగు స్థావరజంగమప్రాణికోటియంతయు కామాతురతజెంది కలయికను గోరుచుండెను. మునులు

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)



సహిత మీ కృత్రిమవసంతావిర్భావముచే శృంగారవిరకాములు తలనూప, మనోనిగ్రహము బూనవలసినవారైరి. శివగణమంతయు తారుమారైనది. గణేశుడుకూడ చంచలుడయ్యెను. ద్వారపాలకుడుగనున్న నందికేశ్వరుడు వామప్రకోష్ఠమున హేమవేత్రము నుంచుకొని నోటిపై వ్రేలిడుకొని శివగణముల నల్లరిచేయకుండ వారించుచుండెను. ఆనందీశ్వరుని యాజ్ఞచే,

నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం
మూకాణ్డజం శాన్తమృగప్రచారమ్
తచ్ఛాసనాత్ కానన మేవ సర్వం
చిత్రార్పితారమ్భ మివావతస్థే ॥

చెట్లు కదలలేదు. తుమ్మెదలు చలింపలేదు. పక్షులు కూయలేదు. మృగములు సంచరింపలేదు. ఆ యరణ్యమంతయు చిత్తరువులో వ్రాయబడినదియుంబోలె నొప్పుచుండెను. వసంతుడు నిశ్చేష్టుడయ్యెను. నందికేశ్వరుడు మదనుని జూడలేదు. మదనుడు వాని దృష్టిపథమున బడకుండ సురపొన్నల శాఖల చాటున దాగుకొని అటనుండి ముక్కంటిని జూచుచుండెను. ఆ యవసరమున త్ర్యంబకుడు వీరాసనము దాల్చి నిశ్చలుడై సమాధినిమగ్నుడై యుండెను.

అవృష్టిసంరమ్భ మివామ్బువాహ
మపామివాధార మనుత్తరంగమ్
అన్తశ్చరాణాం మరుతాం నిరోధా
న్నివాతనిష్కమ్ప మివప్రదీపమ్ ॥

పరమేశ్వరుడు అంతర్వాయువు లన్నిటిని బంధించి వర్షాడంబరము లేని నిండుమేఘమువలె, అలలు లేని సరోవరము

వలె, చలించని దీపమువలె నుండెను. లోపలి తేజస్సు యొక్క జ్వాలలు బ్రహ్మరంధ్రమును దున్ని ఆపైనున్న బ్రహ్మ కపాలముయొక్క నేత్రాంతరముగుండ పైకి లేచుచుండెను. ఈ తీరున నున్న మహేశ్వరుని జూడగానే మరునకు భయము పోకెను. చేతనున్న బాణమును విల్లును జారిపోయెను. భయకంపితుడైన వసంతుడు, ఆ సమయమందు సఖులతో ఆశ్రమమున కరుదెంచు గిరిరాజకన్యనుగాంచి ఆమె కంఠము నలంకరించిన పుష్పమాలగ శివుని సాన్నిధ్యమున జేరెను.

సుగన్ధినిశ్వాసవివృద్ధతృష్ణం
బిమ్బాధరాసన్నచరద్ద్విరేఫమ్
ప్రతిక్షణమ్ సంభ్రమలోలదృష్టి
ర్లీలారవిన్దేన నివారయన్తీ ॥

ఈ శ్లోకము శాకుంతలములోని "చలాపాఙ్గందృష్టిః" అను శ్లోకమును స్మరణకు దెచ్చుచున్నది. పార్వతి నిజనిశ్వాస పరిమళమునకై అధరబింబముపై వ్రాలుచున్న తుమ్మెదను మాటిమాటికి తత్తరమున చంచలదృష్టులతో గాంచుచు, లీలారవిందముచే వారించుచు, శివుని ముందర నిలచెనట. ఇట్టి సౌందర్యవిలాసమును బ్రదర్శింపుచు గిరిరాజకన్య మహేశ్వరునకు యథాప్రకారము ప్రణిపాతపూర్వకముగ బుష్పముల నందిచ్చుచుండెను. అట్లు ప్రణమిల్లిన శైలసుతకు పరమేశ్వరుడు "అనన్యభాజం పతి మాప్నుహీతి" "వేరొకతెను బొందని మగనిం బడయుదువుగాక" యని దీవన యొసంగెను. పార్వతి సన్నిధానమునందుండుటచే నిదియే మంచి సమయమని తలచి కాముడు శివునిపై తన బాణమును గురిపెట్టి వింటినారిని పలుమాఱు సవరింపుచుండెను. అంతట హరుడు చంద్రోదయమునందలి సముద్రమువలె గొంచెము ధైర్య మెడలి

పార్వతీవదనముపై వలపుచూపులు నిగిడించెను. మదనుని బాణముచే పార్వతికిగూడ రోమాంచ ముదయించెను. బాల కదంబకల్పములగు నంగములచే భావప్రకాశము నల్పుచు వ్రీడావశమున నా బాల మోమును వంచి ప్రక్కకు తిరిగెను. మహేశ్వరుడు జితేంద్రియుడు. ఈ మనోవికారమునకు గారణ మేమని నలుదెసలు దిలకించెను. మదనుడొకమూలను ఆలీఢ పాదుడై నిల్చి బాణమును సంధించుచుండెను. తపోభంగము కావింపగడంగినందులకై పరమేశ్వరునకు గోపమువచ్చెను. అంతట తటాలున తృతీయనేత్రమునుండి మిట్టిమెఱయు జ్వాలలతో అగ్ని మొగసెను. "క్రోధం ప్రభో సంహర సంహరేతి" "స్వామీ కోప ముపసంహరింపు ముపసంహరింపు" మని ఆకాశమున దేవతలు మొఱలిడునంతలోనే మదనుడు భస్మావశేషుడయ్యెను.

శివుడు జితేంద్రియుడు. సర్వమయుడు. కావున మోహనకర్తయగు మదనుని భస్మము చేసెను. పార్వతి మనమునందలి ఆశాలత వాడెను. దేవతలు నిరాశజెందిరి. కాని పార్వతి నిరాశ జెందలేదు.

నినిన్ద రూపం హృదయేన పార్వతీ

శివచిత్తమునకెక్కని యీ నా పాడుసౌందర్య మేపాటిదని మనస్సులో తన సౌందర్యమును నిందించుకొనెను. శివచిత్తము నాకర్షింపగల సౌందర్యము మదనవసంతుల సాహాయ్యముచే సిద్ధించునది కాదని తెలిసికొనెను. తపస్సుచేత సంపాద్యమైన రూపమే మృత్యుంజయునకు తన్ను అర్ధాంగలక్ష్మిగ జేయగలుగునని నిశ్చయమొనర్చుకొనెను. కవి సార్వభౌముడిచ్చట ప్రేమోద్దామత నెట్లు నిగ్రహించినదియు

విమర్శనీయము. మేనాదేవి "తపః క్వ వత్సే క్వచ తావకం వపుః" మృదులమైన నీ శరీరము తపఃక్లేశమున కోర్వదని ఎన్నియోవిధముల బాలికను నివారించెను. కాని "పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్" పల్లమునకు బాఱుచున్న నీటిని మెరకకు పాఱించుట యెట్లు? కఠోర తపస్సుచేగాక శివుడెట్లు లభించును? జనకుని అనుజ్ఞ బడసి గౌరీశృంగమున తపోవనమును నిర్మించుకొనెను. ముత్యాలపేర్లను తీసి రుద్రాక్షమాలికలను స్వీకరించెను. పీతాంబరముల వదలి కాషాయ వస్త్రములను ధరించెను. కేశములు జడలుకట్టుకొనిపోయెను. భూతలము శయ్య అయ్యెను. నేత్రములయందలి చంచలత్వము వీడెను. స్వహస్తములతో వనవాటికను పెంచుచుండెను. హరిణములతో స్నేహము నెఱపుచుండెను. ప్రకృతి యొక్క సహజసరళత్వమును నిర్మలత్వమును అలవరచుకొను చుండెను. ఆశ్రమమును జూడవచ్చిన మునిజనులకు అతిథి సత్కారము గావించుచుండెను. క్రమముగ నా తపోవనము పవిత్రతరమగుచుండెను. ఇంతలో గ్రీష్మకాలము వచ్చెను. ఇంకను మహాదేవునకు దయ రాలేదు. ఉమాదేవి ఇంకను కఠినవ్రతములను బూనెను. పంచాగ్నిమధ్యముననుండి తపస్సు చేయనారంభించెను. నేత్రాంతములు నల్లబడెను. శరీరము నుండి వెచ్చని గాడ్పులు వచ్చుచుండెను. కుటీరము వదలి శిలపై బండుకొనసాగెను. పిమ్మట పుష్యమాసము రాగా నామె జలస్తంభనము మొదలిడెను. పార్వతి ముఖము జలముపై పద్మమువలె ప్రకాశించుచుండెను. ఉపవాసములు హెచ్చెను. తనువు కృశించిపోవుచుండెను. కాని పార్వతి నియమమును వదలలేదు. వ్రతములు కఠినతరము లగుచుండెను. పర్ణములను దినుటగూడ మాని అపర్ణయని పేరు

గడించుకొనెను. తపోవృద్ధులు కూడ నిట్టి నియమములకు లోబడజాలరు. యౌవనమత్తత యంతయు హరించెను. హావభావ లీలాచాంచల్యము పూర్తిగ నష్టమాయెను. ఉమా దేవి తపోమహిమ లోకలోకాంతరముల వ్యాపించినది.

ఈ యవస్థలో నొక జటాధారి యాశ్రమమునకు వచ్చెను. ఇక పార్వతియొక్క అగ్నిపరీక్ష యారంభమైనది. పార్వతి అతిథిని సత్కరించినది. అతిథియగు బ్రహ్మచారి యోగక్షేమములడిగి నీ తపస్సున కుద్దేశ మేమని ప్రశ్నించెను. "రాజకన్య లెందుకు తపస్సు చేయుదురు? నీకోరికను మన్నింపని యువకు డేలోకమందైన నుండునా? దేవతలు గూడ నీతో రాజ్యము చేయుట కిచ్ఛగింతురే? హిమవంతుని పుత్రిక నవమానము చేయగలిగిన వాడెవ్వడు? నీవు కఠోర వ్రతములచే నీశరీరమును శుష్కింప జేసికొనుచున్నావు. నీ యౌవనలావణ్య మంతయు నీతపఃక్లేశముచేత మాసిపోవు చున్నది. నేను సంపాదించిన తపఃఫలములో సగము నీకిచ్చి వేసెదను. దీనినిగూడ స్వీకరించి నీవాంఛను దీర్చుకొనుము" అని యాబ్రహ్మచారి పార్వతికి బోధింప మొదలిడెను. తన సంగతిని దాను జెప్పుకొనుట కిష్టములేక పార్వతి తన సఖిని వివరములను జెప్పుమని సంజ్ఞచేసెను. అప్పుడు సఖ యిట్లు చెప్పదొడంగెను :—

"ఈ కన్యామణి మహాదేవుని అర్ధాంగలక్ష్మియగు టకు ఉత్కంఠయై యున్నది. మదనుడు భస్మావశేషుడైనను ఈమెహృదయము శీతలము కాలేదు. కిన్నరులు మహాదేవుని చరిత్రమును గానముచేసినప్పుడు ఈమె భావవివశయై, కంఠ స్తంభిత బాష్పయై విలపించుట జూచి వారును విలపించెడి వారు. "నీవు సర్వగతుడవని వేదవిదులు కీర్తించెదరు. నేను

తపస్సు చేయునది నీకొఱకని నీకు దెలియదా ?' అని యీామె దుఃఖించును ! ఎంతకాల మీాతపస్సు ? తనచేతితో నాటిన చెట్లు పుష్పించి ఫలించినవి. కాని యీామె ఆశాలత ఫలించ లేదు. ఫలించు లక్షణములు గూడ గన్పట్టవు. మా సఖిపై ఎప్పుడా మహాదేవునకు కృప కల్గునో ? సఖుల మగు మేము ఆమె కష్టమును జూడ లేకున్నాము !" ఈ వృత్తాంతమును వటుడు విని "ఇది నిజమా, పరిహాసమా ?" యని పార్వతిని జూచి యడిగెను. పార్వతి స్ఫటికమాలను జేతితో త్రిప్పు చుండెను. ముఖము తప్తకాంచనము భంగి ప్రకాశించు చుండెను. పార్వతి మాటలాడుట కారంభించునుగాని మాట అధరములను వదలి బయటకురాదు. అతిప్రయత్నముపై మాట పెదవిదాటును. ఇంతకాలము పార్వతి మహాదేవ ప్రణయకాంక్షిణి యని విన్నాము. ఇప్పుడామె ముఖతః శివ కీర్తనము వినుటకు మనహృదయములు తత్తరపడుచున్నవి.

యథాశ్రుతం వేదవిదాం వర త్వయా
జనోఽయ ముచ్చైః పద లఙ్ఘనోత్సుకః
తపః కి లేదం తదవాప్తిసాధనం
మనోరథానా మగతిర్న విద్యతే.

ఓ వేదజ్ఞవరేణ్యుడా ! నీవు విన్నమాట వాస్తవమే. ముగ్ధురాలనైన నేను శివలాభరూపమైన మహోన్నత పదవిని గోరి, అది అత్యుచ్ఛమగుటచే అతీతమైన యీాతప స్సును సాధనముగ బూనుకొని యున్నదానను. కోరికలు ఎంతటి విషయము మీాదనైనను బ్రసరించును గాని శక్తిని ఆలోచించవుగదా, కావున అసాధ్యమని వదలుదానను గాను.

ఇట్టి మాట నెప్పుడైన వింటిమే ? ఇందు చాంచల్యము లేదు. ఇంద్రియస్పర్శ లేదు. ఇది ఐహికవిషయసంబంధము

శ్రీ వేమన గ్రంథాలయము

కాదు. స్థిరము, ధీరము, హారము, అచలమునగు ప్రణయము. ఇందు నేను అనునదిలేదు. అహము విచ్ఛిన్నమైపోయినది. మిగిలినది ఆకాంక్ష,-దురాకాంక్ష; ఉపాయము కఠోరతపస్సు. ఇంకొక మార్గములేదు. ఎంత ఆత్మవిసర్జనము, ఎంత దైన్యము, ఎంత భక్తి ప్రకాశింపుచున్నది! కాని ఇంకను అగ్నిపరీక్ష పూర్తికాలేదు. బ్రహ్మచారి శివుని నిందింపనారంభించెను. శ్మశానము, గజచర్మము, దరిద్రత, సర్పములు, వృషభము అన్నియు నేకరువు పెట్టినాడు. శివనిందను తండ్రిముఖము నుండి వినినప్పుడే దేహము త్యజించిన సతి అపరిచితుడగు నీ యువకుని దూషణవాక్యములను సహింపగలదా? ఈ యప్రియములను వినగానే పార్వతి యధరము అదరనారంభించెను. నేత్రాంతములు కెంపెక్కెను. స్థిరస్వరమున నిట్లుచెప్ప దొడంగెను. "మూఢులు ఈశ్వరుని వాస్తవస్వరూప మెఱుంగరు. మహాత్ముల నడవడి నెఱుంగనేరక వారిని దూషింతురు. లోకాతీతమహిమాస్పదునికి సంపదలెట్టివో, భూషణములెట్టివో, వాహనములెట్టివో ఎవరికేమి తెలియును? ఇంతకును నీతో వాదమెందుకు? మహేశ్వరుడు దుష్టుడైననేమి? వానికి నా మనస్సును అర్పణము జేసినాను. ఇక నిందయొక్క భయములేదు" అని సఖినిజూచి, "నిందించినవారేకాక, నింద వినినవారుగూడ పాపులగుదురు. మాట్లాడనీయవల''దని చెప్పి తాను లేచి ప్రక్కకుబోయెను. బ్రహ్మచారి యింతలో నామె చేయిపట్టుకొనెను.

శ్లో॥ తం వీక్ష్య వేపథుమతీ సరసాఙ్గయష్టి
ర్నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహన్తీ
మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః
శైలాధిరాజతనయా నయయా నతస్థౌ॥

ఆమె యొడలు చెమర్చెను. ఎత్తినకాలు ఎత్తినట్లేయుండెను. ముందడుగును బోజాలదు. వెనుకకును బోజాలదు. అంతట శివుడు "ఓ సుందరీ నీ తపస్సుచే నన్ను బిలచి నీదాసునిగ జేసికొంటివి'' అనగనే తపఃక్లేశము బ్రహ్మానందముగ బరిణమించెను. ఆమెశరీరము నూతనమూర్తిమత్తచే ప్రజ్వరిల్లెను. కవిశేఖరుడిచ్చట గాంధర్వవివాహము గ్రహించక దానపూర్వకమగు పాణిగ్రహణమునే వర్ణించెను. ఈ ప్రణయము శమదమములచే శాంతినొందినది. ప్రేమోద్ధృతత్వమును స్వభావోద్దామత్వమును సూచించు గాంధర్వమిచట పనికిరాదు. వివాహ సంస్కార మట్టిదికాదు. ఇయ్యది సాంఘికబంధనము. సహజమగు సౌందర్యమున చాంచల్యముగలదు. ధర్మబద్ధమైన పరిణయమున తపస్సౌందర్యము స్థిరసౌదామనివలె విరాజిల్లును. ఇకకృత్రిమాలంకారములతో బనిలేదు. బాహ్యప్రకృతియొక్క లీలావిలాసము లతిక్రమింపబడినవి. హావభావలీలాచేష్టలకిక తావులేదు. పుష్పము ఫలించినది. నగరాజకన్య మహేశ్వరుని అర్ధాంగరాజ్యలక్ష్మియైనది. పురుషుడు ప్రకృతిని స్వీకరించెను. లోకమునకు మంగళము చేకూరినది. దేవతలెల్లరు పరమామోదమున మునింగిరి. దేవగణములు, సప్తఋషులు, దిక్పాలకులు కల్యాణమును వీక్షించుట కేతెంచిరి. అరుంధతమ్మకూడ ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మాండమంతయు తూర్యనాదములు సల్పుచుండెను. ఏమీ ప్రణయమహిమ! ప్రేమ-కల్యాణమున, సౌందర్యము-మంగళమున, దుఃఖము-ఆనందమున, త్యాగము-భోగమున, పరిణతిచెంది ప్రకృతి పురుషుని జేరినప్పుడు లోకలోకాంతరములు "రసోవైసః" యనుకీర్తనమును సామచ్ఛందస్సున గానముసేయుచు నృత్యము సల్పును.

కాళిదాసు పాఠకుల నెట్టి యున్నత భావశిఖరమున జేర్చెను! పార్వతీజననమునుండి కల్యాణమువరకు ఎట్టి నిరుపమాన శిల్పమును బ్రదర్శించు సోపానపరంపరల నిర్మించెను! ఈకవి శేఖరుడు ఋషితుల్యుడనుటకు సంశయమేమి? చక్రవర్తి పుత్రికారత్నమును శివశుశ్రూషయందు నియోగించెనేకాని రాజసౌధములకు బంపలేదే! శుశ్రూషయందు ఆత్మప్రదానము, పూజ్యభావము అలవడును. కాని కవి యింతటితో తృప్తినొందలేదు. స్వభావ సౌందర్యమునందలి చాంచల్యమును ఉద్ధృతత్వమును సంయమముచే నిరోధించవలెను. యౌవన మత్తతను రగుల్కొల్పుచున్న వసంతుని, మోహ ప్రభావమును పోషించు మన్మథుని తిరస్కరించవలెను. కామదహన మెట్టి కావ్యసృష్టి! ఏసాహిత్యమందైన నిట్టి యపూర్వ కళాచాతుర్యము ప్రదర్శింపబడెనా? పరిణయస్వరూపమును తెలిసికొనిన కవియే యట్టి యుత్కృష్టకల్పనను గావింపగల్గును. శాకుంతలములోని దుర్వాసశ్శాపమును, కుమారసంభవమునందలి కామదహనమును, కాళిదాసునకు కవితా ప్రపంచమున సార్వభౌమత్వము నీయగల్గును. మదనుని భస్మీభూతునిగ జేసినందుకు పార్వతి శివుని చిత్తకాఠిన్యమును నిందించలేదు. ఇయ్యది శివశుశ్రూషచే గలిగిన సంస్కారము. శుశ్రూషవలన పూజ్యభావ మలవడినను, సౌందర్యముయొక్క స్థిరత్వమీమెకు గోచరముకాలేదు. మదనదహనమునందు దీని యభావముమాత్రము మనోగతమయ్యెను. "వ్యర్థం సమర్థ్యలలితం వపుః" సుందరమైన తన మేను నిష్ప్రయోజనమని తెలిసికొనెను. "నినిన్ద రూపం హృదయేన పార్వతీ" శివలాభమును గల్గించలేని తన సౌందర్యమును నిందించుకొనెను. కాని పార్వతియొక్క హృదయము శూన్యమయ్యెను. అంతకుపూర్వముయౌవనమత్తత యచ్చట రాజ్యముచేయుచుం

డెను. ఇప్పుడు దాని దురంతప్రభావము భగ్నమగుటతోడనే హృదయము శూన్యమయ్యెను. ఇక తప్తకాంచనమువలె ప్రకాశించు తపస్సౌందర్య మీహృదయపీఠిక నధిష్ఠించవలెను. కవి యందులకై యీ కన్యకామణిని తపోవనమున జేర్చెను. ఇది మూడవమెట్టు. యౌవనమత్తతయొక్క నిరర్థకత గోచరమైన లాభములేదు. శమదమములచే భావవేగము శమించవలెను. ఇందుకు ప్రథమమున గర్వరాహిత్యము కావలెను. చక్రవర్తి యొక్క పుత్రికయనిన నెట్టి ప్రమత్తత! శివపూజా ధురంధరత్వ మనిన నెట్టి యధికారము! చిత్తశుద్ధిలేకయే ఉన్నతమైన జ్ఞానసాధనల నవలంబించిన వారియం దిట్టి అహంభావము జనియించి, ధర్మవికాసమునకు ప్రతిబంధక మేర్పడును. అట్టి యున్నతసాధనలకు ముందుగా అధికారమును సంపాదించుకొనవలెను. నిస్స్వార్థతయే యట్టి యధికారము నొసంగగలదు. అహంకారరాహిత్యమే యట్టి యర్హత నీయగలదు. కావున పార్వతి శివపూజను వదలి ముందుగ ప్రకృతియందలి చేతనాచేతనములను బూజింపవలెను. మానవుడు వానికంటె నెట్లు ఎక్కువ? వృక్షలతాదులయందు, కురంగశాబకములయందు సహజసరళత్వము గలదు. నిత్యనిర్మలత్వము గలదు. వనవాటికయందలి పుష్పమెట్లు నిర్మలముగనుండునో గమనింపుడు! ప్రత్యూదయమున దళములపైబడు ధూసరమును హిమాంబువులు గడిగివేయుచుండు నా నిర్మలత్వము నిరుపమానము. మానవహృదయమునందట్టి నిర్మలత్వమేదీ! తపోవనమందలి హరిణశాబకమెట్టి సరళవిశ్వాసముతో, ఎట్టి సహజస్నేహముతో మెలంగుచుండును! తన్ను వేటాడవచ్చిన వ్యాధునైన గుర్తింపజాలదు. ఆ కోమలవిశ్వాసమే భక్తికిమూలము. అట్టి విశ్వాసము కుదురనిది శివపూజకధికారములేదు. పార్వతి వనపాలనమందు హరిణముల సరళవిశ్వాసమును, లతల సౌకు

మార్యమును,పుష్పముల నిర్మలత్వమునుసంపాదించెను. అనధి కారి బ్రహ్మజ్ఞానము సాధింప మొదలిడినప్పుడు తదితరసాధకుల యెడల నిరసనభావము కలుగుటనిక్కము. అయ్యది ధర్మజీవ నమున కెంతయు ప్రతికూలము. పార్వతి మునిజనంబుల సేవించ మొదలిడెను. "అతిథి దేవో భవ!" అతిథి పూజచే నిరహంకారభావము, సర్వసమత్వము, వినయసంపన్నత లభ్య మగును. పార్వతి సమవయస్కలగు తన సఖులతో సఖ్యము నెరపుచుండెను. కాని యీ పరిచర్యలయం దింకను స్థిర త్వము లేదు. తపస్సు ఆత్మప్రిదానముతో ప్రారంభమగును. కానిఅది స్థైర్యమున,ధీరత్వమున,కఠోరనియమముల నేకాగ్రత నొందవలెను. ఆత్మనిశ్చయము, త్యాగము, సహనశీలము దృఢపడినగాని తపస్సు పక్వముగాదు. బాల్యముయొక్క చాపల్యమును, యౌవనమునందలి ఉద్ధృతత్వమును, మధ్య వయస్సునందలి అహంకారమును,శమదమాదిషట్కసంపత్తిచే తొలగించి, పరిణతవయస్సుయొక్క శాంతమును, ధీరత్వమును నిర్లిప్తతను సాధించుట యత్యవసరము. అప్పుడు గాని ముముక్షుత్వమున కధికారము కలుగదు. తపఃక్లేశముచేపార్వతి ఈశ్వరసాక్షాత్కారమున కధికారమును సంపాదించుకొనెను. పార్వతియందు పూర్వములేని ఆత్మసౌందర్యము దీపశిఖవలె ప్రజ్వరిల్లెను. మదనుడు అనంగుడై సజీవియయ్యెను. మమ తాగంధములేని భోగము, ఇంద్రియస్పర్శలేని శాంతరతి, భావావేశములేని మంగళము, పార్వతియందు మూర్తీభవించి నవి. ఇక పార్వతి శివుని యర్ధాంగలక్ష్మియై భాసిల్లదా? శివుడిక శక్తివిహీనుడై యుండజాలడు. త్రిలోకనాధుడే పార్వతిని వెదుకుచు వచ్చును.

"అద్య ప్రభృత్యవనతాఙ్గి, తవాస్మి దాసః
క్రీతస్తపోభిః"

మహేశ్వరుడెంత కరుణామయుడు! తనంత తానే నిర్గుణయోగనిద్రనుండి బయల్వెడలి శక్తిరూపిణియగు పార్వతిని జేపట్టి నీకు దాసుడనని ప్రణమిల్లెను! త్రిలోకనాథుడు దాసానుదాసుడగుట ఎంతమనోహరము! క్లేశమంతయుబోయి శాంతము తేజరిల్లెను. దుఃఖము శాశ్వతానందమున బరిణమించెను. ఈశ్వరసంభోగమున లోకమునకు మంగళముచేకూరె. పార్వతి తపస్సుతో నొక పార్వతికేకాదు, సకల దేవతలకు ఈశ్వరసాక్షాత్కారము లభించె. "విపక్వం ఫలమద్య నః" మా తపస్సులుకూడ నేడు ఫలించినవని దేవతలు కీర్తించిరి. "మనోరథస్యావిషయం, మనోవిషయాత్మనః" సకల జగత్తులకు నాథుడవగు నీవు మమ్ము దలచుకొనుటయే మా మహాభాగ్యము! అహా! పార్వతి తపఃప్రభావమెట్టిది! "అత ఆహర్తు మిచ్ఛామి పార్వతీ మాత్మజన్మనే" "కుమారసంభవముకొరకు పార్వతిని సంగ్రహించుచున్నాను" అని మహేశ్వరుడు వలుకుచున్నాడు. కళ్యాణముయొక్క చరమలక్ష్యము ఫలించినది. "నచాహంలౌల్యాత్ స్త్రియమిచ్ఛామి, కింతు దేవోపకారాయ" కాళిదాసకవిశేఖరుడు ఎట్టి ఉత్తమోపదేశమును గావించెను! ప్రణయము పరిణయమున సాఫల్యము నొందినది. సమస్తమంగళములు చేకూరినవి.

1916

*

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)

## శాకుంతలము * *

అభిజ్ఞానశాకుంతలము కాళిదాసీయనాటకములలోనే గాక, సర్వరూపకములలోను శ్రేష్ఠతమముగ బరిగణింపబడు చున్నది. "కావ్యేషు నాటకం రమ్యం, తత్రాపిచ శకున్తలా" యను నార్యోక్తి యీ యంశమును దృఢపఱచుచున్నది. "ప్రపంచమును స్వర్గమును నొక్కచో జూడదలచితిమేని, అయ్యది శాకుంతలమునందే గాననయ్యెడి"నని "గేతి" యను జర్మనుదేశ కవివరేణ్యుడు ఒక పద్యమున నుడివియున్నాడు. ఈ నాటకము మొదటినుండి తుదివఱకును పాఠకుని మనము నిరవధికమగు మాధుర్యమునందు ప్రశాంతియందు రామణీయకమునందు ముంచుచుండును. ఈ విషయమునే బాణమహాకవి

> నిర్గతాసు న వా కస్య కాళిదాసస్య సూక్తిషు
> ప్రీతి ర్మధురసాన్ద్రాసు మంజరీష్వివ జాయతే ॥

అని వచించినాడు. ఈ రూపకరాజము సంపూర్ణ నాటకలక్షణోపేతమై విరాజిల్లుచున్నది. కాని "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అను సుప్రసిద్ధవచనము ఉత్తర రామచరిత్రమున కాధిక్యత నొసంగుచున్నది.

శాకుంతలమునందువలె, రసభావగుణౌచిత్యఘటనాలంకారాదులు ఉత్తరరామచరిత్రయందును లోకోత్తరముగ బ్రదర్శింపబడినవనుటకు సందియములేదు. కాని కళాకౌశల

మున భవభూతి కాళిదాసుని మించుననుట సంశయాస్పదము కాళిదాసునికవిత్వము వ్యంగ్యప్రధానము. భవభూతికవిత్వము వాచ్యప్రధానము. కాళిదాసు తాను చూపదలచిన విషయమును ఒకటి రెండు రేఖలలో బహుసుకుమారముగ సూచించి వదలివేయును. భవభూతియన్ననో, ఆరసమును సూక్ష్మదర్శినీయంత్రముక్రింద బెట్టి, దానియంగోపాంగవిశేషముల నన్నిటిని సవివరముగ అభివ్యక్తముసేయును. కావున సామాన్యపఠితసహితము ఉత్తరరామచరిత్రమును జదివి సులభముగ నానందించవచ్చును. కాని శాకుంతలము వ్యంగప్రధానమగుటచే రసజ్ఞులుకాని దాని మాధుర్యమును సంపూర్తిగ గ్రోలజాలరు. కవితాకౌశలము వాచ్యమునందుకంటె వ్యంగ్యమునందేయెక్కువగ కాననగును. కవిత్వము వక్రోక్తియని యొక ఆలంకారికుడు చెప్పినమాట వాస్తవము. "అంతర్గూఢాభిమానోక్తిరుదాత్తఇతిగీయతే" యని సర్వశ్రేష్ఠమగు ఉదాత్తప్రబంధముయొక్క లక్షణము నిరూపింపబడుచున్నది. ధ్వనివిషయమున కాళిదాసమహాకవి అద్వితీయుడు. ఇందుకొక నిదర్శనమిచ్చిన జాలును. మదనావస్థయందున్న దుష్యంతుడు లతామండపమున శయనించియున్న శకుంతలను జూచినపుడు "అయే లబ్ధం నేత్రనిర్వాణమ్" అని తన యనిర్వాచ్యానందమును వెలిబుచ్చును. ఈ స్వల్పవాక్యమునం దెట్టి యర్థగౌరవము రసపుష్టియు గలవో, రసజ్ఞులే గ్రహింపగలరు. ఈ భావమునే భవభూతి యీ పద్యమునందు వెల్లడించెను.

అవిరళ మివ దామ్నా పౌండరీకేణ నద్ధః
స్నపిత ఇవ చ దుగ్ధస్రోతసా నిర్భరేణ
కబళిత ఇవకృత్స్నం చక్షుషా స్ఫారితేన
ప్రసభ మమృతవేగేనేవ సాన్ద్రేణ సిక్తః.

ఈ యుభయకవుల సూక్తులను బోల్చి చూచినచో నే కవియొద్ద కళాకౌశల మెక్కువకలదో స్పష్టమగును. శాకుంతలము శృంగారరసప్రధానము, ఉత్తరరామచరిత్రము కరుణరసపూరితము. శృంగారరసకావ్యముల యందు కవి విశృంఖలముగ భావవేగమును బెంచి వ్రాయజాలడు. ఇందుకు సంయమ మత్యావసరము. కాళిదాసమహాకవి కట్టి యపూర్వ సంయమ ముండుటచేతనే రసశిరోమణియగు సౌందర్యరసము నుపభోగించుట కధికారియాయెను. సంయమములేని కవికి శృంగారవర్ణనమునం దధికారములేదు. అట్టి యనధికారులీ కార్యమునకు బూనుకొనుటచేతనే కావ్యప్రపంచమునకు గొప్ప విపత్తు నంఘటించినది. శాకుంతలమునం దీ కవికుల తిలకుడు ఎట్టి యపూర్వసంయమము జూపినదియు విమర్శనీయము. ఆ సంయమవిశేషమును గమనించినగాని కాళిదాసుని కవితాకౌశలము హృద్గతము కాజాలదు. అందుకనియే కాళిదాసు నాటకారంభమున "అభిరూపభూయిష్ఠా పరిషదియం" అని సూత్రధారునిచే బలికించెను. సకల కళాభిజ్ఞులైన విచక్షణులే శాకుంతలమును జూచి యానందించగలరు. మానవాదిధర్మశాస్త్రములు, కౌటిలీయకాద్యర్థశాస్త్రములు, వాత్స్యాయనాది కామశాస్త్రములు, భరతాది నాట్యశాస్త్రములు, సాంఖ్యయోగాది మోక్షశాస్త్రములు మొదలగువాని జ్ఞానముగల ప్రతిభాశాలులే తన కావ్యనిర్మాణ సంవిధానమును గ్రహింపగలరని కాళిదాసు సుకుమారముగ సూచించుచున్నాడు.

ఆరంభమందే తపోవనమునుజూపి తత్సందర్శనముచే పాఠకునియందు చిత్తసంస్కారము గలిగించినగాని కవిసార్వభౌముడు ప్రణయమహిమను ప్రదర్శించుటకు ఇష్టపడలేదు.

ఏమి! ఆ కణ్వాశ్రమముయొక్క ప్రశాంతత, నిర్మలత్వము, ధర్మోజ్జ్వలత! ఇక్కడ శాసన కాఠిన్యములేదు. భీతిలేదు. విశృంఖలత లేదు. తపస్సంయమప్రభావముచే నావనమంతయు ఆశ్రమముగ మారిపోయినది. ప్రకృతికూడ నా సంయమము నవలంబించి ధర్మతేజమును వెదజల్లుచున్నది. మాలతీనదీ నిర్మలోదకములు నిత్యము వృక్షమూలముల క్షాళనము చేయుచున్నవి. పర్ణశాలలనుండి సతతము వెడలు హోమధూమము లచటి తరుకిసలయములకు బవిత్రత నాపాదించుచున్నవి. శుకములు నిర్భయముగ నీవారధాన్యములను ముక్కున గఱచికొని తమ కోటరముల కెగిరిపోవుచున్నవి. హరిణములు కోమలవిశ్వాసముతో వనమందంతట దిరుగుచుండ, వాని వెంబడి హరిణశిశువులు దర్భాంకురములను గొఱుకుచు చెంగు చెంగున గంతులిడుచున్నవి. శకుంతలయు, సఖులును వనజ్యోత్స్నలతాదులకు జలసేచనము సేయుచుండిరి. ఎట్టిరమణీయత, ఎట్టి ప్రశాంతి, ఎట్టి విశ్వాసము, ఎట్టి కోమలత్వము ఈ వనాంతరమున రాజ్యము సేయుచుండెను!

అంతలో "ఆశ్రమమృగోయం నహన్తవ్యో నహన్తవ్యః" అను నొక భయానకవాక్య మీతపోవనప్రశాంతిని భగ్నము సేయును. దినదినము ప్రీతిమై నీవారధాన్యముల దినుపించు హస్తములు, జలములను త్రాగించు హస్తములు, గాయములకు ఇంగుదీతైలమును రాయు హస్తములును, తమయందు విశ్వాసమునే ప్రోదిసేయ పెరుగు నాహరిణశాబకములకు, పాపము, ప్రాణాంతకములగు బాణములను సంధించు కిరాత హస్తములు గూడ నుండునని యెట్లు తెలియును? ఆశ్రమ మృగములకే కాదు, అచ్చటి బాలికలకు గూడ దెలియదు. ఆశ్రమమున లతలతో, పుష్పములతో, సారంగములతో

బెరుగుచున్న శకుంతలకు తాను దుష్యంత బాణమునకు లక్ష్య మైతినని ఎట్లు తెలియును? హరిణములు స్యందనాశ్వములకు సహితము భయపడక వ్యాధునివంక జూచుచందమున శకుంత లయు తన హృదయమున నెట్టిగాయము కాబోవుచున్నదియు నెఱుగక దుష్యంతుని "చతుర గంభీరాకృతి" ని విస్మయ ముతో జూచుచు నిలబడెను.

నఖలు నఖలు బాణః సన్నిపాత్యోయ మస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః.

పుష్పరాశిపై యగ్నిపడినది. దుష్యంతుని బాణము శకుంతల కోమలహృదయమున నాటుకొన్నది. సంభ్రాంత చిత్తయై చూచుచున్న శకుంతల "సాధ్వసాదవచనాతిష్ఠతి" ఎక్కడిది యీభయము! ఈమోహము! ఈలజ్జ! శకుంతల యిట్టి చిత్తవికారమును బూర్వమెన్నడు నెఱుగదు. కాని యీనూతనవికారము తపోవనవిరుద్ధమైనదనిమాత్రము తెలిసి కొనగలిగెను. "కిం ను ఖల్విమం దృష్ట్వా తపోవన విరోధినో వికారస్య గమనీ యాస్మి సంవృత్తా" ఇది అనురాగ బీజము. శకుంతల నాగరకన్య యైనచో, నీబాణమునుండి తప్పించు కొనెడిది. కాని శకుంతల ముద్దరాలు. తపోవనమున బెరిగిన ఆబాల కేవైపునుండి యేమి వచ్చునో యెట్లు తెలియును? మన్మథుని అవిశ్వాసముతోడ జూడకపోవుటచే నామె మనో వికారమునకు బాల్పడిన దయ్యెను. "అవ్యాజ మనోహరం వపుః" స్వభావసిద్ధమైన రమణీయతచే విరాజిల్లుచున్న ఆ బాలికను "యౌవన మంగేషు సన్నద్ధమ్" యౌవన మత్తత ఆశ్రయించినది. "ప్రభాతరళము" ప్రకృతిసిద్ధమునైన సౌందర్యచాంచల్య మామెయందు మూర్తీభవించెను. అప్సర స్సంభవయగునామెయందు నాకసుగంధముగర్భితమైయుండె.

కాన దుష్యంతుని "చతుర గంభీరాకృతి" ఆ కన్యకాహృదయమున కామము నుద్దీపనముగావించి స్వభావవేగమున విజృంభించునట్లు చేయగలిగెను.

ఈమె కేవలము అజ్ఞానమైయుండినను, ఇట్లుతటస్థించెడిది కాదు. ఈతపోవనము నిర్జనారణ్యముగాదు. కాశ్యపగౌతము లీమెను వాత్సల్యమున బోషించుచుండిరి. సఖులు స్నేహరస ప్రదానములచేతను, పరిహాసభాషణములచేతను సఖ్యతను గలుపుచుండిరి. శకుంతల నావరించియున్న వనము మూక ప్రకృతికాదు. మాలతి, వనజ్యోత్స్న, వకుళ, నవమల్లికా సహకారలతాగుల్మవిశేషములును, సారంగయూథములును, స్నేహరసమున గరగిపోవుచుండెను. సఖులగు ననసూయా ప్రియంవదలవలె ఈ వనవృక్షములును లతలునుగూడ సకృత్రిమసౌహార్ద్రము నామెయెడ బ్రసరింపజేయుచుండెను. కవి యిచ్చట జేసినది బహిఃప్రకృతి వర్ణనగాదు. శకుంతలాచరిత్రోన్మేషముకొఱకు తపోవనము నిర్మించి శకుంతల నా వనమునకు నంగభూతగా జేసెను. కావున శకుంతల సంసారవాసనలేని స్త్రీరూపము దాల్చిన ఋష్యశృంగుడు కాదు. కావుననే సంశయరహితమైన యా శకుంతల యొక్కక్షణములో మదనునికి లొంగిపోయెను. పాషాణము బ్రద్దలగుటతోడనే గర్భితమైయున్న పర్వతఝురి స్వభావవేగమున బ్రవహింప మొదలిడెను. తపోవనతరుచ్ఛాయల బెరిగినను ఈమె తాపసుల కఠిననియమములచే బంధింపబడియుండలేదు. ధర్మభావ మీమెను పరోక్షముగమాత్ర మావహించియుండెను. అందుకనియే ఈ చిత్తవికారము తపోవనవిరుద్ధమని గ్రహింపగలిగెను. కాని భావవివశమై, చిత్తమును నిరోధింప నశక్తమై, దుష్యంతుని హస్తముల జిక్కెను.

స్వభావస్వచ్ఛందతకును, సంఘనియమములకును సంగమస్థల మునయున్న గాంధర్వము కృత్రిమమునుగాదు, కేవల విశృంఖలమునుగాదు. కాని యౌవనమత్తత, సౌందర్యచాంచల్యము, విస్మయతాత్రసవిహ్వలతాదులు చివుళ్లుదొడుగు యౌవనచపల వ్రీణయవల్లి యీ గాంధర్వము నాశ్రయించును. శకుంతలకు తొల్లింటి నైసర్గికసరళత్వము, సహజకోమలత్వము పోయినవి. బాల్యము స్వర్గతుల్యము. శకుంతల యీ స్వర్గధామమునుండి పదచ్యుతినొంది అపరాధమున కాశ్రయమిచ్చినది. అన్యమనస్కయై చింతానిమగ్నయయ్యెను. తపోవనమంతయు నీమె దృష్టినుండి మరుగయ్యెను. తపోవననియమములు దూరమై పోయినవి. అచ్చటి ప్రశాంతి, మాధుర్యము, సరళత పూర్తిగ నష్టమయ్యెను.

తీవ్రాఘాత ప్రతిహతతరు స్కంధలగ్నైకదంతః
పాదాకృష్టవ్రతతి వలయాసంగసంజాతపాశః
మూర్తో విఘ్నస్తపస ఇవ నో భిన్నసారంగయూథో
ధర్మారణ్యం ప్రవిశతి గజః స్యందనాలోకభీతః.

తపోవనమంతట బ్రతిధ్వనించిన యీ కేకను శకుంతల భావావేశమున వినదయ్యెను. ధర్మారణ్యమున మత్తగజము ప్రవేశించెను. తపస్సు విఘ్నమయ్యెను. శకుంతలాస్వర్గధామము విచ్యుతమయ్యెను. అపరాధము హృదయమున బ్రవేశించి ప్రాయశ్చిత్తమును గోరుచుండెను.

విచిన్తయన్తీ యమనన్యమానసా
తపోధనం వేత్సి నమా ముపస్థితమ్.

ఆహా! శాంతిభంగము దుర్వాసశ్శాపమున వజ్రబాణమువలె శకుంతలపైబడెను. కవి యిచ్చట బ్రదర్శించిన

కళాకౌశల మనన్యసామాన్యము. శకుంతల తన హృదయేశుని ధ్యానించవచ్చును. కాని తక్కిన నియమములను మఱచు నంతటి ప్రణయవేగము కూడదు. తపోధనులను సహితము ఆదరించనంతటి విహ్వలత శాంతిభంగ మనుట నిక్కము. దుఃఖానుభవముచేగాని శకుంతలకీయావేశము చల్లారదు. ఈచాపల్యము నశించదు. హృదయము పరిశుద్ధముకాదు. ప్రణయము ధ్రువత్వము నొందదు. నష్టమైన స్వర్గము తిరిగి ప్రాప్తించదు.

శకుంతల కిక తపోవనమునందు తావులేదు. తన యందు ప్రణయబీజము నాటిన పురుకులావతంసునియొద్దకు బోవలెను. కాని తపోవనమునుండి యామెను బంపివేయుట యెట్లు? శకుంతల తపోవనమునకు అంగభూతమైపోయెను. అనసూయ చెప్పినట్లు శకుంతలలేని తపోవనము శూన్యమే. తల్లియంకమును వీడి శిశువు పరస్థలమున కెట్లుపోగలదు? "కథ మిదానీం తాతస్యాంకా త్పరిభ్రష్టా మలయతటోన్మూలితా చందనలతేవ దేశాన్తరే జీవితం ధారయిష్యే"-ఇట్టి వేదనతో శకుంతల తపోవనమును వీడవలసివచ్చెను. కాని తపోవనముకూడ నిట్టి వేదనయే పొందుచుండెను.

> క్షౌమం కేనచి దిన్దుపాండుతరుణా మాంగల్యమావిష్కృతం
> నిష్ఠ్యూత శ్చరణోపభోగసులభో లాక్షారసః కేనచిత్
> అన్యేభ్యో వనదేవతాకరతలై రాపర్వభాగోత్థితై
> ర్దత్తా న్యాభరణాని తత్కిసలయోద్భేదప్రతిద్వన్ద్విభిః.

ఆహా! ఏమి యీ నఖ్యారనముయొక్క ఆదానప్రదానములు! పతిగృహమునకు బోవుచున్న శకుంతలకు వనమంతయు గానుకల నర్పించి, సంతుష్టి నొందుచున్నది. ఇంగుదీ

తైలముచే గాయమును మానుపట్టించుకొన్న హరిణశాబకము శకుంతలను వీడిపోజాలకున్నది. శకుంతలావియోగభారమున

ఉద్గళితదర్భకబళా మృగాః
పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృతపాండుపత్రాః
ముంచ న్త్యశ్రూణీవ లతాః

మృగములు తినుచున్న దర్భలను వదలివేయుచున్నవి. మయూరములు నృత్యములను మానెను. పండుటాకులు రాల్చు లతలు అశ్రువులను వదలుచున్నట్లున్నవి. కణ్వుని కంఠము స్తంభితమైనది. తపోవన మంతయు జింతాభారముచే నాక్రందన మొనర్చుచున్నది.

ప్రకృతి నిట్లు దృశ్యమొనర్చుట కాళిదాసునకే తగినది. ఒక్క ఉత్తర రామచరిత్రమందు మాత్రము దీని ప్రతిబింబమును గొంతవఱకు జూడగల్గుదుము కాని మఱి యే యితర సాహిత్యమునందును ఇట్టి కరుణరసము ప్రకృతినుండి వెలువడ లేదు.

హస్తినాపురము కేవలము నూతనప్రపంచము. ప్రకృతికి దానికి చాలదూరము. నాగరకత తనచుట్టును ప్రాకారములను నిర్మించుకొని జగత్తునుండి విడివడినది. "జనాకీర్ణం మన్యే హుతవహపరీతం గృహమివ" జ్వాలాచక్రముచే నావరింపబడిన గృహమువలె నున్నదనుచున్నాడు శార్ఙ్గరవుడు.

అభ్యక్తమివస్నాతః శుచిరశుచిమివ ప్రబుద్ధఇవసుప్తమ్ ।
బద్ధమివస్వైరగతిర్జనమిహ సుఖసంగినమవైమి ॥

అని శారద్వతు డనుచున్నాడు. మునిజనమున కాపురము భయావహముగ నుండెను. ఇచ్చటి రాజశాసనమును,

భీత్యావహత్వమును వా రెప్పుడును అనుభవించి ఎఱుంగరు ఈ ద్వారములు! కృపాణహస్తులగు నీ రాజభటులు! సంశయానుమాన, భయ, కాపట్య, అవిశ్వాస, చాపల్యములను నీ కక్ష్యాంతరములు! ఈ ప్రపంచమెక్కడ! సరళవిశ్వాసము తోడను అకృత్రిమసౌహార్దముతోడను, తపస్సౌందర్యము తోడను నిండిన తపోవనమెక్కడ! ఇచ్చటనా మన ముద్దరాలు కాపురము చేయవలసినది! కాని శకుంతల కింకను రాజసౌధమున బ్రవేశించుట కర్హత రాలేదు. మహిషియై రాజశుద్ధాంతమున భాగ్యభోగముల ననుభవించుచుండినచో శకుంతల జీవనమునకు బరిపూర్ణత చేకూరదు. ప్రణయమున కిచట బూర్ణత్వ మెక్కడిది? శకుంతల దుష్యంతునకు బహు సులభముగ జిక్కుటచే శకుంతలయందుగాని దుష్యంతుని యందుగాని ఈ ప్రణయలాభముయొక్క మూల్యము స్ఫుటము కాలేదు. కావున కవి శకుంతలను రాజసౌధాంతముననుంచుటకు కాదిచ్చటకు దీసుకొనివచ్చినది. శకుంతల దుఃఖభాగినియై, యౌవనమత్తతయు భావవేగమును నశించినగాని ప్రణయ మహిమ వెల్లడికాదు. అనుతాపము దుష్యంతునిహృదయమును దగ్ధము చేసినగాని శకుంతలాలాభము నాతడు గుర్తింపజాలడు. కవిసార్వభౌముని అపూర్వకళాకౌశల మిట్టి పట్టులనే కలదు.

భాగ్యభోగ్యములతో తులతూగు హస్తినాపురమునకు వచ్చితిమి. యౌవనమత్తతకు పుష్టిని సార్థక్యమును సంపాదింపగల యీ నగరమునకు నాయికను గొనితెచ్చిన కవిసార్వభౌముడు తన యపూర్వసంయమముచే నా ప్రణయ వేగము నంతను జిక్కుసేయు విస్మృతిసేతువు నడ్డముపైచినాడు. గర్భవతి దిక్కులేనిదయ్యెను. పక్షి యెగదన్నుకొనిపోయినట్లు శకుంతలను మేనక ఎక్కడికో ఎగదన్నుకొనిపోయెను. శకుం

తలా హృదయమున నెట్టి దుఃఖాగ్ని రగులుచున్నదో యెవరికి దెలియును? కవి యేకారణముచేతనో ఆ రోదనమును మనకు వినిపింపలేదు. దుష్యంతుని విస్మృతియందు బడవేసెను. శకుంతలను శాంతినిలయమునకు బంపివేసెను. మన మేకాకులమై వేలును పెదవిపైనుంచుకొని, నిశ్శబ్దముగ ఆశ్చర్యపడుచుంటిమి. భర్తచే దిరస్కరింపబడిన శకుంతలను తిరిగి తపోవనమునకు బంపక యెక్కడికో తెలియరానిచోటి కేల పంపవలసివచ్చెనో! ఇచ్చటనే కలదు కాళిదాసు ప్రతిభా ప్రభావము. అనివార్యవేగమున బరుగిడుచున్న ప్రణయమును మనము చూచుచు చూచుచుండగనే నిస్తబ్ధత జెందించిన కవి యెంతటి క్రూరచిత్తుడో! ఒక్క నిట్టూర్పుగూడ వినబడదు. శకుంతల ఏమనుకొనుచున్నదియు దెలియదు. పోనీ, శకుంతల యొక్క పూర్వపు నర్మభాషణములనైనను జ్ఞప్తికి దెచ్చుకొందమన్న నవియు గానరావు. అపురూపమగునిట్టి స్వల్పసంభాషణముతో నాయికా నాయకుల నెడబాపిన యీ కవి కెంత క్లుప్తి! ఎంత సంయమము! ఏ దిక్కునను ప్రతిధ్వని కూడ వినబడదు! ఆ శాంతి దుర్భరము! ఆ నిస్తబ్ధత దుఃఖావహము.

ఓహో! హంసపదిక పాడిన ఆ గీతిక మన శ్రోత్ర పుటముల నింకను బ్రతిధ్వనించుచునేయున్నది.

అభినవమధులోలుప స్త్వం
తథా పరిచుమ్బ్య చూతమంజరీమ్
కమలవసతిమాత్రనిర్వృతో
మధుకర విస్మృతో స్యేనాం కథమ్.

కవిసార్వభౌముడు ప్రణయచపలత్వము నెంత మనోహరముగ వర్ణించినాడు! ఈ చాపల్యము పోయినగాని,

విస్మృతితమస్సులు చెల్లాచెదరై ప్రణయము స్థిరసౌదామనివలె బ్రకాశింపజాలదు. ఇక్కడ కవి దుష్యంతుని అనుతాపమున బడవేసి అపరాధమునుండి మంగళమునకు దీసికొనిపోవజూచుచున్నాడు. అభిజ్ఞతచే దుష్యంతునకు గలిగిన అనుతాపము వాని హృదయమును బరిశుద్ధము చేసినగాని శకుంతలను స్వీకరించుట కధికారము లేదు. బాహ్యావిఘ్నము కాదిచ్చట దాపురించినది. బాహ్యావిఘ్నములను శాసనము చేదొలగించి బలముచే గమ్యస్థానమును జేరవచ్చును. అట్లు చేరుట లోకసామాన్యమగు మార్గము. బలము, భీతి, విజయము— ఈ మూడు మాటలలో లోకమంతయు నిమిడియున్నది. కాళిదాసోపదేశమంతయు,— ప్రణయము, అనుతాపము, క్షమ, శాంతి, మంగళము, పూర్ణత్వము— అను మాటలలో నిమిడియున్నది. విశ్వాసఘాతుకుడ నైతినని దుష్యంతు డెంత పరితపించెను! ఈ పరితాపము ఆత్మవస్తువు. ఇయ్యది బయటిది కాదు. తప్తకాంచనమువలె హృదయము బరిశుద్ధినొందినగాని దుష్యంతుడు తపస్సౌందర్యమును వీక్షింపజాలడు. అనుతాపద్వారముననే స్వర్గప్రాప్తి సాధ్యము.

శకుంతల దుఃఖభాగినియైనది. ఇక అనన్యమనస్కయై యుండజాలదు. పార్వతి తన చలాపాంగముచేత శివుని బొందజాలకపోయెను. శకుంతల తన స్నిగ్ధవీక్షణములచేతనే దుష్యంతుని సులభముగ బొందెను. శివుని బొందజాలక పార్వతి తపస్సునకు గడంగెను. శకుంతలయో, దుష్యంతుని బొందిన మీదటనే తపస్సు చేయవలసివచ్చెను. ఎటులైనను తపస్సు తప్పదు. శకుంతల మారీచాశ్రమమున తపశ్శాలినియాయెను. దుష్యంతునకు స్వర్గప్రయాణమున తన మనోభీష్టము సిద్ధించును. ఎటుల? యౌవనమత్తతయందున్న శకుంతలను

ఏకాంతమున జూచుటచేతనా? కాదు. ఇప్పు డదంతయు మారిపోయినది.

కథమివ సంపూర్ణమపి మే మనోరథం నాభినందామి

(ఇతి బాలం పరిష్వజతే)

అహో! పుత్రాలింగనమున మనోరథము సిద్ధించినది. పుత్రాలింగనమే ప్రణయమునకు మంగళాచరణము. ఈ ముహూర్తముననే ఏకవేణీధరయగు శకుంతలాదేవి ప్రవేశించును.

వసనే పరిధూసరే వసానా
నియమక్షామముఖీ ధృతైకవేణిః
అతినిష్కరుణస్య శుద్ధశీలా
మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి.

ఇప్పుడు దుష్యంతునకు నేత్రనిర్వాణ మొనర్చుచున్న రూపము "ప్రభాతకళాతరళజ్యోతి" గాదు. శుద్ధశీల, భరతుని తల్లి, కేవలము మాతృస్వరూపము. శకుంతల యిప్పుడు చూచుచున్నది "చతురగంభీరాకృతి" యగు దుష్యంత మహారాజును గాదు. పశ్చాత్తాపవివర్ణుడైన యీ పురుషుడెవరు?

మాతః ఏష కోపి పురుషో
మాం పుత్ర ఇత్యాలింగతి.

అని భరతుడు తల్లికి తన జనకునిజూపును. దుష్యంతుడు శకుంతలా పాదములపైబడి "సుతను హృదయాత్ ప్రత్యాదేశ వ్యలీకమపైతు తే" యనినాడు. అంతటితో దుష్యంతుని అనుతాపము పూర్తియైనది. శకుంతలాదేవియొక్క దుఃఖముకూడ నంతరించినది. ఆనందము వెల్లివిరిసినది. మంగళము చేకూరినది. నిశ్చయము! "ఉదేతి పూర్వం కుసుమం తతఃఫలం"

తపోవనములో వికసించిన పుష్పము హస్తినాపురములో వాడి స్వర్గములో ఫలించినది. తపోవనము సరళ విశ్వాసముతో నిండిన శైశవావస్థ. హస్తినాపురము సంసారప్రతిఘాతభీషణ మగు మధ్యాహ్నకాలము. స్వర్గము శాశ్వతానందనిలయమగు పరిణతవయస్సు. అభిజ్ఞానశాకుంతలమున కవి భూతలమును స్వర్గధామముగ బరిణమింపజేసి చూపినాడు. పుష్పము ఫలించు నటుల మర్త్యలోకము స్వర్గమునందును, స్వభావము ధర్మము నందును, ప్రణయము మంగళమునను, దుఃఖము ఆనందము నను, త్యాగము భోగమునను బూర్ణత్వము నొందినవి.

1916

*

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)

# మేఘసందేశము * *

"మేఘదూత" యందు వర్ణితమైన జీవనధార మధురమైన మందాక్రాంతావృత్తరూపమున తరంగితమైనది. రామగిరిశీతనగమధ్యస్థమైన ఆ ప్రాచీనభరతవర్షమునుండి యక్షునివలె మనమును ఒక వర్షఋతువునందేగాక, సంతత ప్రవాసులమైతిమి. ఎచ్చటి యుపవనముల వెలుగులలోని కేతకీవృక్షపంక్తులు తెల్లని పూలరేకులతో శోభిల్లుచుండెనో, ఎచ్చట ప్రావృట్కాలమునకు బూర్వమే గ్రామరథ్యలలోని చెట్లు గూండ్లను కట్టుకొను కాకాదిగ్రామపక్షుల కలకలములచే నాకులితములయ్యెనో, ఎచ్చటి గ్రామపరిసరముల జంబూవనములు విస్తారముగబండి నల్లని మేఘములవలె నొప్పుచుండెనో, అట్టి దశార్ణదేశ మెచ్చటికి బోయినది? వత్సరాజుయొక్క వాసవదత్తాపహరణము మొదలైన అద్భుతోపాఖ్యానములతో వినోదపఱచు కథాకోవిదగ్రామవృద్ధులుగల ఆయవంతీపుర మేమైనది? ఆ శిప్రానదీ తటవర్తిని యగు ఉజ్జయినీ నగరరాజమో? నేడది సమస్త వస్తుసంపూర్ణమై బహుళైశ్వర్యములతో తులతూగుచుండినమాట నిజమే కాని, అంతమాత్రముచే మన స్మృతి సంపూర్ణమగునా?

జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపైః
బంధుప్రీత్యా భవనశిఖిభిర్దత్తనృత్యోపహారః
హర్మ్యేష్వస్యాః కుసుమసురభి ష్వధ్వఖేదం నయేథాః
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాంకితేషు.

[ ఓ మేఘుడా! ఉజ్జయినీనగరహర్మ్యగవాక్షముల
48 నుండి వెడలు కేశసంస్కారధూపముల పరిపుష్టశరీరుడవై, నెయ్యంపుబెంపున నేత్రోత్సవముగ నీయెదుట నృత్యము చేయు పెంపుడునెమిళ్ల నృత్యసేవ లంగీకరించి, గృహాలంకారార్థమై చల్లబడిన పువ్వుల పరిమళముచే ఘ్రాణతృప్తి యొనర్చుకొనుచు, దర్శనీయములగు అందకత్తెల పాదముల లత్తుకజాడలు కనులవిందుఁ బొనర్ప ఉజ్జయినీనగరశోభను గాంచుచు నా హర్మ్యములందు విశ్రాంతియు, వినోదము పొందగలవు. ]

ఆ లలితవనితల కేశసంస్కారధూపముల పరిమళము లేశమైనను నేడు మన ముక్కుపుటముల జొరకున్నదిగదా! అంధకారబంధురములైన నిశీథసమయములందు ఆ భవనశిఖరములపై బరుండియుండు పారావతముల సుఖనిద్రయు, ఆ విశాలనగరపరిత్యక్తపథముల నిస్తబ్ధతయు నొకింత స్మృతికి దెచ్చుకొందుమేని, ఆ రుద్ధద్వారసుప్తసౌధములనుండి ఆనిర్జన రాజపథములందలి సూచీభేద్యములైన తమస్సులగుండ ఉద్రిక్తకాములై స్వయముగ కాంతార్థినులై ఒంటరిగ నేగు నభిసారికల హృదయస్పందనము లొకింత యూహింపగలుగుదుమేని, మదనవశంవదలైన ఆ రమణుల కాలితెన్నుల కనకనికషస్నిగ్ధమైన కాంతి నించుక ప్రసరింపజేసి మార్గమును చూపగలిగితిమేని ధన్యులమే.

ఆ ప్రాచీనభరతఖండమునందలి నదీపర్వతనగరముల నామములు సయితమెంత రమ్యములు! అవంతి, విదిశ, ఉజ్జయిని, విశాల, రేవ, శిప్ర, వేత్రవతి, చర్మణ్వతి—ఆహా! ఈ నామములయం దేదో యనిర్వాచ్యమైన శోభ, సౌందర్యము, మాధుర్యము గలవుకదా! నాటినుండియు ఆ భాష,

ఆ వ్యవహారములు, ఆ విలాసములు క్రమముగ జీర్ణించి అప భ్రంశమును బొందినవికాబోలు. నేటి నామకరణములుగూడ నట్టి విపర్యయములలోనివే. ఆ రేవా శిప్రా నిర్వింధ్యానదీ ప్రాంతములనున్న అవంతీ విదిశా విశాలాపురముల నెట్లైన

నొక్కసారి ప్రవేశించి ఆ పూర్వలక్ష్మీశోభాదర్శనముచే నొక్క ముహూర్తమాత్ర మానందింపగలమేని నేటి పట్టణ విక్షోభములనుండి విముక్తిపొందగలుగుదుము. కాని, యక్షుని మేఘము ఏయే గిరిసరిన్నగరములమీదుగా విశ్రమించుచు, క్రీడించుచు, వినోదించుచు సంచరించెనో, ఆ మజిలీలగుండ విరహాకాతరుడగు పాఠకుని దీర్ఘనిశ్వాసములు నేడు వయ నించుచున్నవి. ఎచ్చట వల్లీవధువులు ప్రేమరసస్నిగ్ధ లోచనలయ్యు భ్రూవిలాసముల నెఱుగరో, పరిచితభ్రూలతా విభ్రమములగు ఎచ్చటి నెఱజాణల వక్షోత్క్షేపములచే కృష్ణశబలప్రభలు కౌతూహలపూర్వకములై యిటునటు మీటిన మల్లెలవెంటబోవు మధుకరశ్రేణుల సిరిని దొంగిలించు చుండునో - అట్టి కాళిదాసుని భరతవర్షమునకు దూరమై పోతిమి. ఆ కవియొక్క మేఘముతప్ప, నేడచ్చటకు దూతగ నేగుట కింకెవరున్నారు?

మానవులు సముద్రములో దూరదూరముగ విసరి వైచిన ద్వీపములవలె నున్నట్లొక ఆంగ్లకవి వాక్రుచ్చినాడు. ఉన్నతపదమునుండి యీ లంకలను గాంచినచో, ఎవని అభి శాపముననో ఈ భరతఖండము వ్రక్కలై, ముక్కలై వాని మధ్య విలాపరాశి పొంగి పొరలి నురుగులు గ్రక్కుచున్నట్లు తోచును. ఘూర్ణమానాంభోధివంటి యీావర్తమానమునుండి కాళిదాసమహాకవివర్ణితమైన ఆ ప్రాచీనభరతవర్షతలము నొక్కసారి తిలకింపుడు! శిప్రాతీరమున రమణీయములగు

శిరీషోద్యానములందు కుసుమముల నేరు నా పుష్పలావికలు, అవంతీనగరచైత్యములందు ఉదయనుని ప్రణయగాథలను వినుపించు ఆ కథాకోవిదగ్రామవృద్ధులు, ఆషాఢమాసపు తొలిమేఘమును ముంగురుల నెత్తిపట్టుకొని కాంచుచు ప్రియ సమాగమముకొరకు ప్రాణములను నిలుపుకొనియున్న ఆపథిక వనితలు— ఆహా! ఆ నారీనరుల విలాసములలో లీనమై పోవుటకు ఏ పాఠకుని హృదయ మువ్విళ్లూరదు ?

మన పూర్వులకు, మనకును నిగూఢమగు సంపూర్ణైక్యత లేదందుమా? ఉన్నను కాలము వారికిని మనకును నిష్ఠురమైన వ్యత్యాసమును కలుగజేసినది. కాని కవికృపవలన నా ప్రాచీనకాలము అమరసౌందర్యములకు ఆటపట్టయిన అలకాపురమైనది మనకు. మనము విరహవిధురమగు వర్తమానమునుండి యా యలకానగరమునకు ఊహామేఘమును దూతగ పంపుచున్నాము. ఓ అలకానగరీ!

యత్రోన్మత్తభ్రమరముఖరాః పాదపా నిత్యపుష్పా
హంసశ్రేణీరచితరశనా నిత్యపద్మా నలిన్యః
కేకోత్కంఠా భవనశిఖినో నిత్యభాస్వత్కలాపా
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమోవృత్తిరమ్యాః ప్రదోషాః.

ఎల్లప్పుడును వసంతమగుటచే ఉన్మత్తభ్రమరములచే ముఖరితములగు పూలచెట్లతోడను, హేమంతాదులయందును పద్మములచే శోభిల్లు తామరకొలంకులతోడను, మొలనూళ్లుగ నాచరించు హంసశ్రేణులతోడను, పింఛములు విప్పుకొని సదా నర్తించుచు కేకలిడు క్రీడామయూరములతోడను, శుక్లపక్షములోవలె నెల్లపుడు వెన్నెలచే రమణీయములగు

రాత్రిలతోడను ప్రకాశించు నీవు మాకు నేడతీతవై పోతివి. నీకడకు మే మెట్లువత్తుము ?

వర్తమానముననే కాదు. సర్వకాలములందు ప్రతి మానవునిలోను అఖాతమగు విరహముగలదు. ఏ ప్రియుని గలసికొన గోరుదుమో, ఆప్రియుడు మానససరోవరతీరమున ఆకైలాసశిఖరమున నివసించుచుండును. అచ్చటకు కేవలము నూహలను పంపగల్గుదుమే గాని సశరీరముగ బోవుటెట్లు? ఓ ప్రియుడా! నీ వచ్చట, నే నిచ్చట. మన మధ్యనున్న అనంతమగు నీ యంతరము నెవరుదాటగలరు? అనంత కేంద్ర ప్రవర్తియగు ఆప్రియతముని సాక్షాత్కారమును బొందగలవా రెవరు? నేడు కేవలము భాషలో, భావములో, ఆభానలో, ఇంగితమున, భ్రాంతియందు, వెలుగునీడలలో, జనన మరణముల స్రోతోవేగముల మధ్య, వానియొద్దనుండి యేతెంచు దక్షిణపవనాంకూరలవమునే మహాభాగ్యముగ నెంచుకొనుటే కాని ఈ విరహాలోకమున నింతకంటె నెక్కువ నెవ రాశింప గలరు?

భిత్త్వా సద్యః కిసలయపుటాన్ దేవదారుద్రుమాణాం
ఏతత్క్షీరస్రుతిసురభయో దక్షిణేన ప్రవృత్తాః
ఆలింగ్యంతే గుణవతి! మయా తే తుషారాద్రివాతాః
పూర్వం స్పృష్టం యది కిల భవే దఙ్గమేభి స్తవేతి.

[అప్పుడే దేవదారు చిగురాకు పుటంబులవిప్పి ఆ పాలయోడికల నుబ్బు పరిమళమూని, దక్షిణముఖముగా నిచటికి వీచుచున్న మంచుగొండగాలులను ఓ గుణవతీ! తప్పక కౌగిలింతు, అవి నీ శరీరమును ముందుగ తాకెనను తలంపుతో]

ఏమీ, యీ విరహము! ఉభయులము, రెండువేళల వియోగవివశులమై విలపించుచున్నాము. మన మిర్వురము

నిర్జనగిరిశృంగముల నిలువబడి ఉత్తరపుదిక్కునకు జూచు
52 చున్నాము. ఉభయులమధ్య ఆకాశము, మేఘములు, సుందర భూమి, రేవ, శిప్రి, అవంతి, ఉజ్జయిని, సుఖసౌందర్యభాగ్య భోగముల చిత్రరచనలు విస్తరించియున్నవి. ఈ రమ్య దృశ్యము లన్నియు ప్రియుని జ్ఞప్తికిదెచ్చుచున్న వేకాని సంయో గమును గూర్చుటలేదు. ఆకాంక్ష నుద్దీపింపజేయుచున్న వే కాని నివృత్తిపరచుటలేదు. ప్రియులమధ్య ఇంత యంతర మేమి? కాని యెన్నడో మన ముభయులము ఏకలోకమున నివసించి, యిప్పు డందునుండి నిర్వాసితులమైతి మను విష యము మనస్సున స్ఫురించుచుండును. "హృదయమందిరము నుండి నిన్ను బయటకు గెంటిన దెవరు?" అని ఒక వైష్ణవ కవి పృచ్ఛించుచున్నాడు. ఏమి జరిగినది? నా హృద్దేశ వాసి బయటి కేల వచ్చెనో? అచ్చట స్థానము లేదు కాబోలు. అద్వైక్యమునుండి బాహ్యులమై యొండొరుల జూచుకొని నేడు వికలచిత్తుల మగుచున్నాము. విరహమునం దెంత విధురత! ఆకాంక్షయం దెంత వ్యాకులత! ఉభయులము తిరిగి యేకము కాజాలమా? ఈదూరమును దాటుదమన్న నీ విశాలభూమి అడ్డు తగులుచున్నదికదా!

శాపాంతో మే భుజగశయనా దుద్ధితే శార్ఙ్గపాణౌ
శేషా న్మాసా న్గమయ చతురో లోచనే మీలయిత్వా
పశ్చాదావాం విరహగణితం తం త మాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చంద్రికాసు క్షపాసు.

[ఈ దుఃఖము నిరవధికము గాదు. విష్ణుమూర్తి శేష శయనమునుండి మేల్కాంచు నప్పటికి నాకు శాపావసానము కలుగును. శేషించియుండు నాలుగు మాసములును నెట్లో విరహతాపము నోర్చుకొని జీవించియుండుము. అటుతరువాత,

నీ విరహావస్థలో తలపోసికొనెడి సకలభోగములను శరత్కాలపు ముదురువెన్నెల రాత్రిలలో అనుభవింపగలము.]

ఓ నిర్జనగిరిశిఖరవిరహాకాతరుడా! స్వప్నమున నే ప్రియురాలి నాలింగన మొనర్చుచుంటివో, మేఘముఖమున నే సుందరికి సందేశము బంపుచుంటివో, ఆమెతో నొక యపూర్వసౌందర్యధామమున నొకానొక శారదపూర్ణిమా రాత్రిమున నీకు శాపముతీఱి తిరిగి చిరసంయోగము ఘటిల్లు నని యీ యాశ నీ కెవరు కల్పించిరి?

ఇష్టాన్ దేశాన్ జలద విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మాభూదేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః

[ఓ మేఘుడా! వర్షలక్ష్మిచే నత్యంతము శోభిల్లుచు నీకిష్టమైన దేశములు తిరుగుము. నీకు నీ భార్యయైన మెఱుపు తీగెతో వియోగము కలుగకయుండునుగాక.]

ఓ యక్షుడా! నీకు చేతనాచేతనభేదజ్ఞానము మున్నే పోయినది. ఇపుడు సదసద్వివేకమును గూడ నతిక్రమించితివా యేమి! నీతోపాటు మేఘునిగూడ కృతార్థునొనర్చుచున్నావు!

1933 *

శ్రీ వేమన గ్రంథాలయము
వేలప్రోలు (కృష్ణా)

## కావ్య జగత్తు * *

మానవునకు రూపదర్శనమునందు సహజమైన ఆసక్తి కలదు. మానవుని సహజాభిలాషలలో ఈ రూపలాలస యొకటి. బాలుడు మొదలుకొని వృద్ధుని వఱకు ఈ ప్రదర్శన కౌతూహలము వ్యాపించియున్నది. కేవలముసాంసారిక తాపత్రయములందు జిక్కుకొనిన జననీజనకులుకూడ విరామకాలము లందైనను తమ బాలబాలికల ఆటపాటలను జూచి ఆనంద నిమగ్నులు కాకుండ నుండజాలరు. ప్రతిమానవుడును తన రూపమును తాను తన కుటుంబముననో, తన సంఘముననో, తన దేశముననో, వ్యష్టియందో లేక సమష్టియందో—ఏదోవిధముగ అనేక దిక్కులనుండి దర్శించి సార్థకతనొందును. మానవునకు గల ఈ రూపపిపాస కేవలము కృత్రిమము గల్పితము గాదు. ఆనందరసస్వరూపుడైన ఈశ్వరునియందే ఈ రూపపిపాస కలదు. ఈశ్వరుడు కేవలము నిర్గుణుడైనచో, ఈ సృష్టికి తావే లేదు. విద్యలకును కళలకును ప్రయోజనము కాని సార్థకతకాని యుండదు. అప్పు డీ రూపములును, ఈ రూపపిపాసలును కేవలము తుచ్ఛములు, త్యాజ్యములు అగును. కావున నిరాకారుడన, అతీతుడయ్యు సర్వాకారుడై బహురూపుడై వెలయుటయని గ్రహింపవలయును. "సకామో అజాయత బహుస్యాం ప్రజాయెయేతి" అనుటచే, ఈశ్వరుని ఆనందరస మెప్పుడును భోక్తృభోగ్యరూపముల విచిత్రగతుల, విచిత్రలీలల, విచిత్రరసముల చిందుచుండును. ఈశ్వరుని యీ బహురూప సమృద్ధియే మానవునియందు

గూడ నిహితమైయుండి సకల కళలను, విద్యలను బురికొల్పు చున్నది. అనగా, ఏ సృజనాశక్తి ఏ యఖండానందరసము ఈశ్వరునివిశ్వరూపునిగ జేసెనో, ఆసృజనాశక్తియే ఆయానంద రసమే మానవులపట్ల కావ్యజగత్తునందు బరిపూర్తి నొందు చున్నది. ఈశ్వరసృష్టికిని, మానవరచనకును నిజముగ భేదము లేదు. ఈశ్వరసృష్టి మానవరచనయందు చరితార్థతను, పూర్ణ తను బొందునప్పుడే సృష్టిరహస్యము బుద్ధిగోచరమై, కళల ప్రయోజనము గ్రాహ్యమగును. ఋషిముఖవినిస్సృతములైన వేదము లపౌరుషేయములని చెప్పుట కిదియేకారణము.

హిమవన్నగమునందలి శిల్పముకంటె, గంగాయమునల గానమాధుర్యముకంటె, నత్యున్నతమై, అతిగభీరమై, అతిమధు రమై, విశ్వమర్మభేదకమైన శిల్పకళ వేదములందుబ్రకాశించు చున్నది. వేదము కేవలము విశ్వవృక్షాగ్రమున వికసిం చిన సుందరకుసుమము. కావుననే ఆ కుసుమలావణ్య మెప్పటి కిని వాడునదికాదు. ఆ కుసుమసౌందర్య మెన్నటికిని మాయు నదికాదు. ఆ కుసుమపరిమళ మేనాటికిని క్షీణించునదికాదు. అయ్యదియే సకలవిద్యలకు, సకలకళలకు, సకలచరితలకు, సకల సాధనభజనలకు మొదలిగనియై, యుగయుగముల దివ్య జ్యోతింబోలె మానవుని స్వర్గారోహణమునకు మార్గమును చూపుచున్నది. మానవముఖవినిస్సృతమయినను నిజమైన కవితయందు విశ్వకవియొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములే గాంచ నగును. ఆ విశ్వకవియే మానవుని జిహ్వాగ్రమున వాణీ రూపమున నృత్యముచేయుచు సకలకళలను విరజిమ్మును. మానవజిహ్వ, మానవహృదయము నెంత పరిశుద్ధమైన, ఈశ్వరవాణియు నీశ్వరరూపము నంతసుందరముగ నంత మధురముగ నావిష్కృతమగును.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)



మానవునకు రూపతృష్ణ యెంతయున్నను ప్రతిరూపము నాతని నాకర్షింపదు. మన వ్యావహారికజీవితమును చుట్టుకొని యున్న రూపసమూహమంతయు వ్యవహారైకప్రయోజనమగుటచే నది శిల్పమనిపించుకొనదు. పదార్థముల వ్యావహారిక ప్రయోజనమును దెలుపు పని శిల్పముదికాదు. అర్థశాస్త్ర వాణిజ్య పరిశ్రమాదులగు జీవికాసాధనముల దాపని. అవి పదార్థముల స్థూలరూపములనే వెల్లడించునుగాని నిజస్వరూపమును వెల్లడించవు. కావుననే మానవుడు కేవలము వ్యవహారముతో తృప్తిపొందుటలేదు. వ్యవహారమునందును సుఖదుఃఖములున్నవి. అందు ఉత్తేజనమునుగలదు. పోరాటమును గలదు. కాని ఇవియన్నియు మానవజీవితముయొక్క బాహ్యప్రవృత్తులేకాని జీవనముయొక్క ఆంతర్యమును స్పృశించునవి కాకపోవుటచే, వ్యావహారికములగు నీ జీవనపుటెల్లలను బంధనములను తప్పించుకొనుటకు మానవ హృదయ మెప్పుడును పరితపించుచుండును. పదార్థములకును విషయములకును వ్యవహారము నిర్దేశించురూపముచే మానవుని రూపలాలస సంతృప్తిపడుటలేదు. కావుననే వ్యవహార ప్రయోజనమునందు కలుగని సంతృప్తి నాతడు కావ్యజగత్తునందు బడయగోరును.

ప్రకృతిశాస్త్రముకూడ విషయస్వరూపమును వెల్లడించుటకు ప్రయత్నించునుగాని తత్ప్రయత్నములెల్ల విషయముల బాహ్యరూపపరీక్షతోడనే సమాప్తమగుటచే దానికి కావ్యత్వసిద్ధిలేదు. అది విషయముల యాంతర్యమును సూక్ష్మదృష్టితో జూడదు. హృదయముతో సంబంధముగలవ్యవహారదృష్టికైనను విషయములు కొంతవరకు భావమయముగదోచునుగాని హృదయమును ఇంద్రియములనుండి పూర్తిగ బహిష్కరించు ప్రకృతిశాస్త్రమునకట్టి దృష్టిలేదు. నాతోటలోని నారికేళవృక్షమును

జూచునప్పుడు నాకొకింత భావస్ఫూర్తి కలుగును. అయ్యది నా పూర్వులచే నాటబడినది. నాబాల్యక్రీడలను జ్ఞప్తికి దెచ్చుచున్నది. నా కుటుంబముయొక్క, నావంశముయొక్క చరిత్రము అందు లిఖింపబడియున్నది. దైనికవ్యవహారసంబంధములలో గూడ హృదయమిట్లు వ్యాపించియుండుటచే సంసార మొకించుక భావాత్మక మగుచున్నది. వృక్షశాస్త్రమునం దీ భావము పనికిరాదు. మమతాగంధవర్జితమైన ప్రకృతిశాస్త్రమునకు మానవహృదయమునకు జాలదవ్వు. ప్రకృతిశాస్త్రము ఇంద్రియముల కొకవిధమైన సంగత్యాగమును బోధించును. ఏపూర్వస్మరణయు, నేరసభావమును, ప్రకృతిశాస్త్రజ్ఞుని నేత్రమును రాగరంజితము కానీయదు. ఒక విధమయిన నిర్మమత్వముతో ఇంద్రియముల నుపయోగించినప్పుడే ప్రకృతిపరిశోధన సాధ్యమగుచున్నది. కావున రాగద్వేషములకు మానాభిమానములకు పూర్వసంస్కారములకు ప్రకృతిశాస్త్రమునందు తావులేదు. కేవలము రాగశూన్యమైన ఇంద్రియానుభూతియే ప్రకృతిశాస్త్రమునకు విషయము. అట్టియనుభూతితో పదార్థముల అంగప్రత్యంగములను విడదీసి పరీక్షించుటయే ప్రకృతిశాస్త్ర కర్తవ్యము. అట్టి పరీక్ష విషయముల స్వరూపమును వెల్లడింపగలదా? ఆ పరీక్షచే గనుగొనిన రూపమహిమ మన హృదయమును సంతృప్తిపరచునా? పుష్పదళములను కత్తితో ఛేదించి, "మైక్రోస్కోపు" అద్దముక్రింద బెట్టి చూచి, దాని నాళములను బరిశీలించినంతమాత్రమున పుష్పస్వరూపము వెల్లడియగునా? ఎప్పుడు దళములను పుష్పమునుండి విశ్లేషణమొనర్చి కత్తి నాటునకు బలియొనర్చితిమో, అప్పుడే పుష్పరూపమును వికృతమొనర్చితిమి. అదియునుగాక, హృదయమును బాలి

శ్రీ వేమన గ్రంథాలయము
- తెలప్రోలు (కృష్ణా)



దోలిన ఇంద్రియానుభూతి విషయముల స్వరూపము నెట్లు వెల్లడింపగలదు? విషయముల సార్థకత విషయియందే కదా కలదు? అట్టి విషయిని దూరమున నుంచి విషయములను బరిశోధింపజూచుట వాక్యమునుండి పదములను విడదీయుటవంటిది. పదప్రయోజనము సమగ్రవాక్యమునందే కలదు గాని ప్రత్యేకపదముల విడివిడిగ నెంతపరీక్షించినను, వాని యర్థ మించుకయైనను గ్రాహ్యమగునా? అటులనే సకలవిషయములకు జ్ఞాతయు భోక్తయునైన మానవాత్మను నిరోధించి, విషయములు స్వతంత్రములను భ్రమయందు పడవేయు ప్రకృతిశాస్త్రము మానవహృదయము నెప్పటికిని సంతృప్తిపరుపదు. కాని ప్రకృతిశాస్త్రపఠనముచే సృష్టివైచిత్ర్యములు వెల్లడియై, మనమున కొంత విస్మయము నాహ్లాదము కలుగవచ్చును. కాని ఈ చిత్తవృత్తులు నిజముగ ప్రకృతిశాస్త్రప్రకరణములోనివి కావు. విషయములను విషయినుండి విడదీయుట యసాధ్యమనుటయే మన మిచట గ్రహింపవలసినది.

చరిత్రలుగూడ కొంత సూపప్రకటనకు గడంగును. కాని చరిత్ర కవిత కాదు. చరిత్ర సృష్టికాదు. సంఘము యొక్క కొన్ని ఘటనలను కర్మలను ఉద్యమములను ఒక యనుక్రమణికగ వర్ణించునది చరిత్ర. కాలప్రవాహమున అనేకములైన మార్పులు జరుగుచున్నవి. వానిలో చక్షుర్గోచరమైనకొన్ని పైపై అలలను పరామర్శించునది చరిత్ర. ఈ చరిత్రవలన సంఘముయొక్క బాహ్యరూపము వెల్లడికావచ్చును. దాని ఆంతర్యము గాని, సమగ్రసత్యముగాని గోచరముకాదు. చరిత్రయందు నిజముగ సత్యములేదు. చరిత్రకారుని ఇష్టానిష్టములు, వాని వివేచన, వాని పరిశీలన

ఒక విధమైన కాల్పనికజగత్తును రచించును. ఏలయన చరిత్ర
60 కారుని దృష్టి ఖండదృష్టి. విశ్వమునంతటి నాతఁడొక్కమారు పరికింపఁడు. భూతభవిష్యద్వర్తమానముల నొక్కదృష్టిలోఁ జూడఁజాలఁడు. విశ్వమును ఖండములుగఁ జీల్చును. కాలమును యుగములుగఁ బరిచ్ఛేదించును. బింబమును ముక్కలుగఁజేసి చూచుటచే బింబాకృతి యెట్లు వెల్లడియగును ? చరిత్రకును, ప్రకృతిశాస్త్రమునకువలెనే, కొంత ప్రయోజనము కలదు. కాని ప్రకృతిశాస్త్రమువలెనే, చరిత్రయు దేశకాలముల బాహ్యరూపమునే ప్రదర్శించునుగాని కవితవలె ఆంతర్యమును వెల్లడింపజాలదు.

ఈ విషయపరిశీలనకు తత్త్వశాస్త్రము కూడ గడంగును. కాని తత్త్వశాస్త్రము సహితము కవితకాదు. తత్త్వశాస్త్రము తర్కబద్ధమైనది. బుద్ధియొక్క న్యాయములకు లోఁబడినది. సత్యాసత్యము లను పరస్పరవిరుద్ధములైన ఆశయములను కల్పించుకొని అది మానవుని అనుభవములలోఁ గొన్నిటి నంగీకరించుచు, కొన్నిటిని విసర్జించుచు, ఒక కాల్పనికమయిన సామంజస్యమును నెలకొల్పఁజూచును. మీమాంస పరీక్షకు సాధనమే కాని సృష్టికి తోడ్పడదు. ప్రేమయొక్క ఆకర్షణ బుద్ధిచే కట్టుబడునదియుగాదు. బుద్ధి జగత్తులో నొక విధమైన క్రమమును,-సంగతి, విరోధ, సమన్వయముల ద్వారమున ఐక్యతను జూపుటకు బ్రయత్నించినను ఆ జగత్తు పూర్ణజగత్తుకాదు. ఎప్పుడు మన జీవనములోఁ గొంత భాగమును విసర్జించి మిగిలినదానిపై సత్యమును బ్రతిష్ఠింపజూతుమో ఆసత్యము ఖండసత్య మగునేకాని పూర్ణసత్యమెట్లగును ? మానవహృదయము బుద్ధి గీయు గీతలలో ఇమిడియుండుట కిష్టపడదు. మనస్సు ఇంద్రియముల నతిక్రమించి అతీం

ద్రియమైన రూపమును జూడగోరునట్లే, ఆత్మయు బుద్ధియొక్క ద్వంద్వ నిరూపణముచే బద్ధము కాక, బుద్ధినిగూడ నతిక్రమించి, సీమలేని, పారములేని, అనంతసౌందర్యనిలయమును జేర జూచును. బుద్ధి స్వతంత్రముకాదు! వెనుక ఉపలబ్ధి లేని యెడల, బుద్ధియొక్క వ్యాపారము నిలిచిపోవును. ఉన్న అనుభవములపై బుద్ధి తన అంకితములను ముద్రించి, వర్గవిభాగము చేయజూచునే కాని, లేనియనుభవమును సృష్టించలేదు. అట్టి బుద్ధి రూపముయొక్క పూర్ణసౌందర్యము నెట్లు వెల్లడి చేయగలదు? రూపము నతిక్రమింపగలిగినప్పుడే రూపముయొక్క సౌందర్యము గోచరమగును. మనస్సు రూపమునందే ఆబద్ధమైనంతకాలము రూపముయొక్క మర్మము గ్రాహ్యముకాదు. రూపారూపముల ఐక్యతను జూడగల సామరస్యము బుద్ధికందని విషయము. కవియొక్కడే అరూపుని రూపమును జూడగలడు.

వాస్తవజగత్తున కతీతమైనది, ప్రకృతిశాస్త్రము వెల్లడి చేయలేనిది, చరిత్ర వర్ణించలేనిది, తత్త్వశాస్త్రము నిర్దేశించలేనిది, కవిత కెట్లు దర్శనయోగ్యమగునని ప్రశ్నింపవచ్చును. మానవుని రూపలాలనయందున్న ఆవేగమెట్టిది? మానవుడు తన్ను తాను తెలుసుకొనుటకు ప్రయత్నించుచున్నాడు. తన సంఘస్వరూపమును దెలిసికొనుటకు బ్రయత్నించుచున్నాడు. తనచుట్టును విస్తృతమైయున్న జగత్తుయొక్క స్వరూపమును జూడగోరుచున్నాడు. రూపముయొక్క బాహ్యరేఖలను, స్థూలాకృతినే కాక, దానిమర్మమునుగూడ విప్పి చెప్పగలిగినట్టిదే మానవహృదయమును సంతృప్తిపరుపగలదు. వాస్తవజగత్తునందు ఈమర్మము వ్యక్తమగుటలేదు. వాస్తవజగత్తు పంకిలమై ఖండఖండములై యున్నది. కావుననే మనదృష్టి దీని నతిక్రమించి, దీనివెనుకనున్న పూర్ణరూపమును జూచుటకు బరితపిం

చుచున్నది. ఇట్టి సందర్భములలో కేవలవాస్తవజగత్తును బ్రదర్శించుటవలన మనస్సు వెగటునొందునేకాని, సంతృప్తి నొందదు. కావున కవిత వాస్తవలోకపు నకలు వ్రాయుట కొప్పుకొనదు. కవిత మానవునిదృష్టిని వాస్తవమునుండి పైకి నాకర్షించి, వాస్తవము వెనుకనున్న యథార్థమును, సత్యమును వెల్లడించును. మన వాస్తవజగత్తువెనుకను మూడులోకము లున్నవి. కవిత ఈమూడులోకములను యథేచ్ఛగవిహరించును. ఈ మూడులోకములకును అతీతమయిన దిక్కును చేరగల్గి నప్పుడే, ఈ త్రిభువనస్వరూపము హృద్గోచరమగును.

మొదట మన వాస్తవజగత్తువెనుక నున్నది భూలోకము, పృథివి. ఇది కేవలము యంత్రమువగిది పనిచేయు చుండుశక్తి. తన్నుతాను తెలిసికొనలేని ఒక అపారమైనశక్తి బ్రహ్మాండము నంతను యంత్రమువగిది ఆడించుచున్నది. ఈ శక్తి అమోఘము; కాని జడము. దాని ప్రవాహములో సకలచరాచరములు తృణములవలె నెగిరిపోవుచున్నవి. "భయాత్తపతి సూర్యః" సూర్యుడుగూడ భయమువలన తపించుచుండ నిక దాని సమ్ముఖమున నిలబడి 'నీ వెవ్వ' రని ప్రశ్నింపగలవా రెవరు? ఈ జడప్రకృతి మహోన్నతమైన పాషాణప్రాకారమువలె మన చుట్టును ఆవరించి యున్నది. అయ్యది బధిరము, అంధప్రాయము, మూకమునయ్యు, సమస్తమును అణచిపెట్టి నిరంకుశముగ రాజ్యముచేయుచున్నది. దాని పదాఘాతముచే భూమి కంపించుచున్నది. అగ్నిపర్వతములు బ్రద్దలగుచున్నవి. సముద్రములు ఘూర్ణిల్లుచున్నవి. జంతుసంతానము, మానవసంఘములు దద్దరిల్లిపోవుచున్నవి. దానియట్టహాసమున సామ్రాజ్యములు రక్తపాతమున మునుగుచున్నవి. దాని వీక్షణమున లోకములు దహించుకొనిపోవు

చున్నవి. ఆశక్తి అగ్నికంటె తీక్ష్ణమై, వాయువుకంటె శీఘ్రమై, లోహముకంటెను కఠినమై, సర్వత్ర వ్యాపించి యున్నది. ఈభూలోకమునందు పురుషుడు నిద్రించుచున్నాడు. ప్రకృతి జడమై వెలుగుచున్నది. అట్టి భూలోకముయొక్క రూపపరిదర్శనమును చేయగల్గినది కవిత. కవి యీ జగత్తు యొక్క పునాదులలో దూరి బ్రహ్మాండమున కంతకు ఆధార భూతమైన అన్నస్వరూపమును దర్శించి "అన్నాద్దేవ ఖల్విమాని భూతాని జాయంతే... అన్నంబ్రహ్మేతి వ్యజానాత్" యని కీర్తించును. వాని దృష్టి ఈ దేశకాలపటములను ఛేదించుకొని కారణజలములలోని మత్స్యకూర్మవరాహరూపములను దర్శించగలదు. ప్రకృతి, చరిత్ర, తత్త్వశాస్త్రముల కందని పరమరహస్యము లివి.

భూలోకముపైది భువర్లోకము. ఇచ్చటిశక్తిజడము కాదు. ప్రాణమయము. ప్రాణశక్తి త్రిభువనములనిండి నిబిడీకృతమైయున్నది. ఎప్పుడును రూపములను సృష్టించుచున్నది. తిరిగి రూపములను విలీనము చేయుచున్నది. ఇందు విధివిరామములు లేవు. నిత్యసృష్టి, నిత్యప్రళయము. జననము తరువాత మరణము, మరణము పిమ్మట జననము దివారాత్రములవలె ఛందోబద్ధముగ నృత్యము చేయుచున్నవి. ప్రాణిని ప్రాణి హింసించుచున్నది. ప్రాణినుండి ప్రాణి యుద్భూతమగుచున్నది. ప్రాణమునందు కలయిక, ప్రాణమునందు వియోగము, ప్రాణమునందు భిన్నత్వము విచిత్రగతుల రాగప్రస్తారములవలె విలసిల్లుచున్నవి. క్షుత్తు పిపాస నిద్రా మైథునము వృద్ధి క్షయము స్వసంరక్షణము సంహారము సంతానము పారంపర్యత స్వజాత్యభిమానము జీవనసంగ్రామము—ఇవియెల్ల ప్రాణముయొక్క లీలలు. ఈ భూమి

యందు బలహీనునకు స్థానములేదు. బలవంతునిదే రాజ్యము. సంహారమునందేస్థితి. జడమునందు ప్రాణములేదు. ప్రాణము నందు హృదయములేదు. ప్రాణములో ఆకర్షణకలదు. అభి మానముగలదు. కాని మృత్యువు తప్పదు. సర్వము విషా దాంతము. ప్రాణి పరుగిడి పరుగిడి, ఎగిరి ఎగిరి తుదకు విధి యను పాషాణముపై తన శిరమును వ్రక్కలుచేసికొనును. కాని ప్రాణి నిరాశచెందియుండదు. ఎవ్వుడును ఆశతో దీపించు చుండును. తుదకీ యాశాదీపము తైలవిహీనమై వెలుగక ఆరిపోవును. త్రాగినకొలదిని దాహము, తినినకొలదిని క్షుత్తు తీక్ష్ణములగును. నిత్యప్రయాస, సతతశ్రమ, అవిచ్ఛిన్నమైన పోరాటము! ప్రకృతి యిల్లు మానవస్వేచ్ఛకు నలువైపుల పర్వతాకారముగ నిల్చి, ఎదుర్కొని, మానవుని నిత్య దాసునిగ, బానిసనుగ జేసివైచుకొనుచున్నది. ఈ పోరాట మునందు స్వేచ్ఛకు విజయములేదు. కాలము, దైవము, విధి ప్రకృతియు అప్రతిహతములై వైరమును బురికొల్పుచున్నవి. ప్రాణముయొక్క పల్లవి అమంగళము, నాశనము, మృత్యువు, అపజయము, దుఃఖము, శూన్యము. భూలోకగర్భమున పెన వేసికొనియున్న పెనుచీకటివంటిది కాక భువర్లోకమునందలి అంధకారము తారాస్వప్నములతో అమననసిసివలె భాసి ల్లును. కావున మఱింత భీకరమైనది. ఆశాదీపము చల్లారిన పిమ్మట నొదవు శూన్యము దుర్భరము. ఇందు వేకువకలదు. జీవముకలదు. ప్రయాసగలదు. కాని చూపులేని వేకువ, సుఖములేని జీవనము, ఫలసిద్ధిలేని ప్రయాస. గ్రీకునాటకముల యందు, తదనుసరణముగ పాశ్చాత్యుల "ట్రాజెడీ" ల యం దును, భువర్లోకమునందలి మానవలీలలు, అతి చమత్కృతితో వర్ణింపబడినవి. కాని ఈ ప్రాణమయజగత్తుయొక్క లోతు

పాతులు భారతకవులకే గ్రాహ్యములు. భారతకవి ఈ జగత్తునుజూచి భీతిల్లడు. ఆ మహేశ్వరుడగు శివుని బాదములక్రింద దొ్రక్కుచు నర్తించు మహాకాళీస్వరూపమునుజూచి తల్లి యని ప్రణమిల్లును. సంహారము ఒక క్రీడవంటిది. యోధునకు రణకేళి యెట్టిదో, శక్తికి సంహార మట్టిది. ఛిన్నమస్తకివలె తన రక్తమును తానే పీల్చుకొని రౌద్రబీభత్సములం దోలలాడుచున్నది. శ్మశానము రుద్రుని ఆవాసము. కాలసర్పములు మహేశ్వరుని భూషణములు. భువర్లోకమునందలి ప్రాణస్పందన విధానము జీవశాస్త్రజ్ఞునకు తెలియజాలదు. కాళీ ఉపాసకుడైన కవికే ప్రాణమయజగత్తుయొక్క శక్తిస్వరూపము సాక్షాత్కారమగును.

భువర్లోకముపైది సువర్లోకము. ఇందలి శక్తి జడమునుగాదు, ప్రాణమునుగాదు, మనోమయము. అంధకారమును జీల్చుకొనుచు జ్ఞానకిరణము ప్రసరించినది. నిస్తబ్ధతనుండి వాగ్దేవత బహిర్గతమైనది. దుఃఖమునుండి సుఖముబయల్వెడలినది. జననమరణములనుండి అమృతము స్రవించినది. అసత్యమునుండి సత్యజ్యోతి ప్రకాశించినది. పృథివి కేవలము స్థితి. ప్రాణము కేవలము గతి. సువర్లోకము కేవలము ఆరోహణము. పృథివియందు సంఘర్షణమే కాని జయములేదు, అపజయమును లేదు. భువర్లోకమున అపజయముమాత్రమేకలదు. స్వర్లోకమున జయాపజయములు రెండునుగలవు. సత్యాసత్యములు, ధర్మాధర్మములు, సుఖదుఃఖములు, పుణ్యాపాపములు రెండును పారిపార్శ్వికముగనున్నవి. మానవుని బోధమంతయు అసత్యమును విడిచి సత్యమునకు, అధర్మమును విడిచి ధర్మమునకు, దుఃఖమును విడిచి సుఖమునకు, పాపమును విడిచి పుణ్యమునకు నడచుచుండును. వివర్తధర్మమే వాని జీవనసాధనము.

"అసతో మా సద్గమయ." ఈ ధర్మసమరమున అసురులకు అపజయము, దేవతలకు జయము ధ్రువము. ఈ ద్విముఖము దాల్చిన స్వర్లోకము, భయమోహముల కాకరమైనను, ఆ భయమోహములను బారదోలు సంజీవినియు నందేకలదు. సత్యమే ముందుగ అసత్యరూపమున బయలుదేరి తుదకు తన సత్యరూపమును వెల్లడిచేయును. అసురులుకూడ ప్రచ్ఛన్న దేవతలు. రుద్రుని అంతస్స్వరూపము శివము. హాలాహలముక్రింద అమృతభాండము దాగియున్నది.

మానవుని పాదములు పృథ్విపై నిలిచియున్నను, వాని బాహువులు భువర్లోకమునందు వ్యాపించియున్నను, శిరము మాత్రము స్వర్లోకమునందే కలదు. భూలోకము తమస్సు, భువర్లోకము రజస్సు, స్వర్లోకము సత్త్వము. ఈ మూడు లోకములలో నేదిలేకపోయినను మానవుని ఉనికియే యసాధ్యమగును. కాని తలక్రిందుమాత్రము కాకూడదు. శిరమును భూలోకమునం దుంచినయెడల మానవజీవనము యంత్రము వగిది నిర్జీవమగును. పృథివి మానవుని పాదపీఠము. శిరస్సు స్వర్లోకమునందుంచనియెడల మానవజీవనము రాక్షసమగును. భువర్లోకము గడియారములోని స్ప్రింగువంటి ఉజ్జీవిక. అది లేనియెడల భూలోకమునుండి స్వర్లోకమునకు బోవుటకు సేతువుండదు. ఈ రెంటిమధ్యను అఖాత మేర్పడును.

ఈ స్వర్లోకమునందలి రూపప్రదర్శనమునందు పాశ్చాత్త్యులకును, భారతీయులకును సంప్రదాయభేదముగలదు. స్వర్లోకము ద్వంద్వభూయిష్ఠమైయుండుటచే ఈశ్వరునకు శత్రువుగ సైతానును సృష్టించవలసివచ్చినది. ప్రపంచ విస్తారమే పాశ్చాత్త్యులకు ధ్యేయము. ఎక్కువజ్ఞానమును, ఎక్కువ బలమును, ఎక్కువసుఖమును బొందుచుండుటయే పాశ్చాత్త్య

మానవుని ఆశయము. ఎవడు శతమానవులబుద్ధిని, శతమానవుల బలమును, శతమానవుల ఆనందమును తనయందు వికసింప జేసికొనగలడో అతడే ఉత్తమపురుషుడు. భారతీయుని ఆశయము, మానవుడు బృహత్తరశక్తిమంతమైన మానవ రూపమును బొందుటకాదు. మానవత్వము కేవలము ఈశ్వరుని లీలాభూమి. రసికశేఖరుడగు గోవిందునియందుగాని మానవసంసారములోని దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములకు బరిపూర్తిలేదు. మర్త్యలోకము అవతారపురుషులకు ధర్మక్షేత్రమేకాని నిత్యవాసముకాదు. భారతకవి ఋషివలె మానవలీలయందు నిఖిలరసామృతమూర్తియొక్క దివ్యకళల ననుభూతము చేసికొనగల్గెను.

భారతీయుని అతీంద్రియదృష్టి స్వర్లోకమునందు బంధింపబడుట కియ్యకొనక, తదతీతమైన సత్య,తపో,మహర్లోకములను ఆధ్యాత్మికజగత్తును అన్వేషించెను. మానవుడిచ్చట బృహద్రూపమును దాల్చిన "సూపర్-మాన్" కాడు. మానవుడు దేవత్వమున రూపాంతరము బొందును. ఇచ్చటి అనుభవము దుఃఖములేని సుఖముకాదు. సుఖదుఃఖముల కతీతమైన ఆనందరసము. ఇచ్చటినీతి అధర్మముబయట నుండు ధర్మము కాదు. ధర్మాధర్మముల కతీతమైన సాధర్మ్యమోక్షము. ఇచ్చట గోచరమగునది అసత్యమును వీడిన సత్యము గాదు. సత్యాసత్యముల నిముడ్చుకొని, ద్వంద్వములకు లోబడని, నిర్వికల్పమయిన అనంతసత్యము. ఇయ్యది కేవలము సాక్షాత్తు రాధాకృష్ణులు నివసించు ఆనందధామము-బృందావనము. ఇచ్చటి వృక్షము కల్పతరువు. ఇచ్చటి గోవు కామధేనువు. ఇచ్చటి పృథివి చింతామణి. ఇయ్యది అమృతనికేతనము. భూర్భువస్సువర్లోకములలో ఈశ్వరుని బాహ్య

కావ్యజగత్తు
శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)

లీలలు మాత్రమే గోచరమగును. ఈ సత్యలోకమున ప్రకృతిపురుషుల, రాధాకృష్ణుల, అభ్యంతరలీలామృతమును పానముచేసి కృతార్థులము కావచ్చును. భారతకవి రససిద్ధుడగుటచే అన్నిలోకములను స్వేచ్ఛగ విహరించిరాగలడు. మన పురాణేతిహాసములయందు ఈలోకములన్నియు నిజరూపమున ప్రదర్శించబడినవి. ప్రస్తుతకవు లిట్టి బోధము లేక, కేవలము తామసికాచారబద్ధులైపోయిరి. నిరంకుశత్వమును గోలుపోయి బానిసలైన కవులు త్రిలోకసంచారులెట్లగుదురు? కవి యనగా ద్రష్ట. ఏదీ ఆచూపు? ఆ విశ్వరూపమునువీక్షించుచూపు కూపస్థమండూకముల కెట్లబ్బును? అలసులకు ప్రాణశక్తిక్రీడ యెట్లు గోచరమగును? సముద్రము లంఘింపగల ఆంజనేయు డేడీ నేటికవులలో? తీవ్రధర్మసంగ్రామమున నిలబడగల కర్మవీరుడేడీ స్వర్లోకమును జైత్రించుటకు? శ్రీ గోపీజనపరివేష్టితుడగు ఆ మోహనమూర్తిని దర్శింపగల భక్తుడేడీ బృందావనమును ప్రదర్శించుటకు? త్రికాలజ్ఞానము, సౌందర్యబోధము, ఆనందరసనిమగ్నత, అతీంద్రియస్పర్శానుభూతి,— ఈ నాలుగు లక్షణములు లేనిది ఉత్తమకావ్యరచన యసంభవము. వ్యాసుడు మర్త్యలోకమునందలి ధర్మసంగ్రామ రహస్యమును అతులకౌశలముతో నుద్ఘాటించి, మహాభారతమునకు పంచమవేదమను ప్రసిద్ధిని కలిగించెను. వాల్మీకి మానవచరిత్రయందలి భావశబలతను కావ్యాదర్శమున ప్రతిఫలింపజేసి శ్రీరామచంద్రుని భారతీయులకు ఉపాస్యదేవతగ బ్రసాదింపగల్గెను. కాళిదాసు ప్రణయకీర్తనముచే పృథివిని స్వర్గధామమున జేర్పగల్గెను. భారతీయుల కావ్యజగత్తు పారములేని ఆనందసింధువు.

1920

*

## రసస్వరూపము * *

శ్రీ రాధామాధవవిలాస గీతగోవింద కృష్ణకర్ణామృత కావ్యములందలి గీతామృతమును గ్రోలి ఎవరు భావోన్మత్తులు కాకుండనుండగలరు? ఒక్క సంస్కృతసాహిత్యమున దక్క మఱియొకచో దుర్లభమగు నీ కావ్యవర్ణనముచే గల్గు ఆరసావేశావస్థ అనుభవైకవేద్యమే కాని ఇట్టిదని చెప్పుట కేరి తరము?

" వినిశ్చేతుం శక్యో నసుఖమితివా దుఃఖమితివా
ప్రమోహో నిద్రావా కిము విషవిసర్పః కిముమదః
తవస్పర్శేస్పర్శే మమహి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతిచ సమ్మీలయతిచ "

అనియు, ఉన్మిషితవేద్యాంతరసంపర్కశూన్యాపరిమిత భావమనియు చెప్పబడిన అప్రాకాశానంద చిద్రూపమిట్టిదని నేనెట్లు చెప్పగలను? ఈయపూర్వవస్తువును మిథ్యయని విశుద్ధాద్వైతవాదులు చెప్పెదరుగాక! ఆ లీలామానుషవిగ్రహము అలీకకల్పన యని బ్రహ్మసామాజికు లాక్షేపింతురుగాక! ఆ మధురరసము రక్తమాంసముల యుత్తేజనమని "ప్యూరిటెన్లు" నిషేధించెదరుగాక! మనుష్యుడుకానివాని నేనెట్లుపాసింపగలను? ఉపాస్యుడు మనుష్యుడుకాదనుకొనినచో రసభంగముకాక యేమున్నది? మమతాగంధములేని నిరాకారతత్త్వమునందు రసాస్వాదనమెట్లు? లీలామానుషవిగ్రహము వంధ్యాపుత్రునివలె అలీకకల్పనయా? కల్పనవలన పులకలును, అశ్రువులును కలిగినను అవి శరీరవికారములేకాని సాత్త్వికములు

కావు. మృదంగముపై దెబ్బపడుటతోడనే, కాలు నృత్యము సేయవచ్చును. కాని హృదయాంతరాళమున భావతరంగములు వానియంతట నవియే పొంగిపొరలి, అంగములను జలింపచేసి, నృత్యశీలునిగజేయు విషయము వేఱు, ఈ వికారములు వేఱు. పదములయందలి ఛందస్సును, ఝుంకారమును, రాగమును, మానవుని స్నాయుమండలి నుత్తేజితము చేసి, పులకాశ్రువులను అంగవిలాసమును గలిగింపవచ్చును. కాని అందు సత్యరసానుభూతి యెక్కడిది? గతానుగతికమైన సామాన్యలోకము, ముఖమున ఊర్ధ్వపుండ్రములను, కాళ్లకు గజ్జెలను, చేతుల చిరుతలను ధరించినవారి స్నాయువీయోత్తేజనమునే రసానుభూతియని భ్రమపడుటచే గీతగోవిందాది మహాపదముల మర్యాద చెడుచున్నది.

జయదేవాదికవివరేణ్యుల సాహస మేమని చెప్పవచ్చును? సర్వాంతర్యామియు సర్వాతీతుడును నగు పరబ్రహ్మమును తోడిమానవునిగ జేసివైచినారే! కాని ఇది కేవలము కవిచాతుర్యమా? మానవకోటిని సృష్టించి, ధరించి, పాలించి, ప్రవర్తింపజేయుచున్నది మానవుడేనా? మానవరూపము నిత్యమైనయెడల మానవధర్మముకూడ నిత్యము కావలెను. నరరూపము నిత్యసిద్ధము కానియెడల, క్రమాగతముగ నిన్ని నరరూపములెట్లు కలుగుచున్నవి? నరప్రకృతి అనాదిసిద్ధమే కానియెడల, నరప్రకృతి ధారావాహికముగ వికాసము నొందుటెట్లు? నరరూపము సార్వజనీనము, విశ్వగతము, నిత్యసిద్ధము. అయ్యదియే దేశకాలములందు క్రమాగతముగ భిన్నభిన్న వ్యక్తులయందభివ్యక్తమగుచున్నది. ఆ రూపము పూర్ణము. ఈ వ్యక్తులరూపము అసంపూర్ణము. ఆ ప్రకృతి దేశకాలాతీతము. ఈ ప్రకృతి దేశకాలములందు

అంశామాత్రముగ బహిర్గతమగుచున్నది. దాని పూర్ణత్వమే మన అపూర్ణత్వమునకు ప్రమాణము. మనయందు పరిణామము నొందుచున్న ప్రకృతి దానియందు నిత్యము ప్రస్ఫుటమై యున్నది.

మానవునకు సహజముగ రూపలాలస గలదు. ఇది యెక్కడిది? సకలనారీనరులలోనున్న విశ్వమానవరూపము నకై మనచక్షువులు వెదకుచున్నవి. మనగుణములపై మనకు స్వభావసిద్ధమగు నాకర్షణకలదు. మనహృదయము ఆ యనంతగుణునికొరకు అన్వేషించుచున్నది. మన ఇంద్రియ ములు, మన ప్రాణము, మన మనస్సు, మన బుద్ధి-సర్వస్వము ఆ లీలామానుషవిగ్రహమును దెలిసికొనుటకు, జూచుటకు, స్పృశించుటకు, భోగించుటకు, వ్యాకులత నొందుచున్నవి. మానవుని సకలప్రయత్నములు, సమస్తోద్యమములును, నరునియందుండు నరోత్తముని, పురుషునియందుండు పురుషోత్తముని బొందుటకై ఆమానవదు చుండును. నరోత్తమునికొరకు నరుడు, నరునికొఱకు నరోత్తముడు అనవరతము నన్వేషించు చున్నారు. కావుననే ఒకనరుడు ఇంకొక నరుని గుర్తింప గలుగుచున్నాడు, ప్రేమింపగలుగుచున్నాడు. తానెఱుగని పదార్థముకొరకెవడైన ప్రయత్నించునా? భగవంతునకును మానవునకును, సజాతీయధర్మము లేనియెడల మనము వానిని భజింపలేము. భావైక్యత లేనిచోట భజన యెట్లు సాధ్య మగును? ఈశ్వరభజన సాధ్యముకావలెననిన, మానవు డైనను ఈశ్వరుడు కావలెను, ఈశ్వరుడైనను మానవుడు కావలెను. క్రైస్తవసాధనలో ఈశ్వరుని, స్వర్గమునుండి క్రిందికిదింపి మానవునిగజేసి భజనను సంభావ్యము చేసినారు. హిందువులు ఈమనుష్యునే పైకెత్తి బ్రహ్మముతో నేకము

చేసినారు. ఈశ్వరుని క్రిందికి దింపినచో ఈశ్వరత్వము నష్టమగును.

ఈశ్వరునికి మానవత్వము, సత్యమా లేక ఆరోపితమా? ఈశ్వరమానవత్వములు పరస్పర విరుద్ధములైనచో, ఈశ్వరుడు నిజముగ మనుష్యుడు కాలేదు. కొందఱు తత్త్వశాస్త్రజ్ఞులు ఈశ్వరుని మానవత్వమును మాయక్రింద గొట్టివేసిరి. "సంభవామి" యను గీతావాక్యమునకు శంకరులు వ్యాఖ్యానము సేయుచు "ఇవ" యని "మనుష్యునివలె" అని చెప్పి, మనుష్యత్వమును మాయావస్తువుగ సూచించిరి. క్రైస్తవులలో గూడ మాయావాదమున్నది. ప్రాచీన క్రైస్తవులలో గొందఱు క్రైస్తవలీలలను "Apparent" అని నుడివిరి. శంకరుని "ఇవ" శబ్దమునకును, క్రైస్తవుల "అప్పేరెంటు" పదమునకును విశేషవ్యత్యాసము లేదు. కొంద ఱాచార్యులీ స్వవచన విరోధమును ఖండించి "గూఢం పరబ్రహ్మ మనుష్యలింగం" పరబ్రహ్మముయొక్క నిగూఢస్వరూపము నరలింగమనిరి. "ఉత్తమం రహస్యమ్" అనుటచే పరబ్రహ్మము నిత్యసిద్ధమైన నరలింగము గనుకనే, గీత క్షరాక్షరముల నంతర్భుక్తముచేసికొనిన పురుషోత్తమస్వరూపమును నిర్దేశించినది. శ్రీమద్భాగవత మింతటితో నాగలేదు. పురుషోత్తముడు నిఖిలరసామృతమూర్తి యనికూడ నిరూపించినది.

రసవస్తువు ఇంద్రియప్రత్యక్షముగాదు. అంతరంగానుభవైకవేద్యము. ప్రేమనెవరును గంటితో జూడలేదు, చెవులతో వినలేదు, రసనతో రుచిచూడలేదు. కాని ఇంద్రియములకును రసమునకును ఘనిష్ఠసంబంధము గలదు. రూపము నాశ్రయించక, ఇంద్రియప్రేరణములేక ప్రేమకు జన్మలేదు, వికాసము లేదు. ప్రేమ రూపము నాశ్రయింపక ప్రకాశింప

జాలదు. వత్తియందు బుట్టియు వత్తి నతిక్రమించు దీపశిఖ వలె ప్రేమ, ముఖమండలమునందు, కనుదోయియందు, అంగ విలాసమునందు, తనుకాంతియందు పుట్టి వానినెల్ల నతిక్రమించును. మనస్సుయొక్క భావమాత్రములైన కామక్రోధాదులు శరీరమున సకలావయవములందును సాత్త్విక భావచేష్టా విలాసాదులలో విశిష్టరూపమున బ్రకాశించును. ప్రేమోన్మత్తుని రూపమునుజూచి వాని ప్రేమోన్మాదమును గ్రహింపగలుగుదుము. ఎప్పుడు రసము లోపలినుండి అంగప్రత్యంగములయం దుబికి విలసిల్లునో అప్పు డా రూపము రసమూర్తి యగుచున్నది. అట్టి సకలరసమూర్తులును రసోద్దీపకములై భోగ్యము లగుచున్నవి. రసవిలాసము ప్రత్యక్షమైనప్పుడు నాకును నాలోపల రసోదయ మగును. అచేతనముగ నుండిన భావము సచేతనమై మనోవీథుల విహరింపజొచ్చును. హాస్యరసము నాస్వాదించునపుడు అధరములపై హాసము వెలుగొందును. ప్రేమవివశమైనమూర్తిని గాంచినప్పుడు మనయందును ప్రేమోద్దీపనము కల్గును. లోపలి రసమునకును, బయటి రూపమునకును, నిబిడసంబంధము లేనియెడల, మానవుని యందు నిద్రాణములైయున్న రసములు మేల్కొనజాలవు. ప్రతి రసమునకు విశిష్టమగు స్వరూపము కలదు. దాని నాశ్రయించియే ఆ రసము పొంగును. ఆ యాలంబనమే లేని యెడల రసమునకు నుత్పత్తియు భోగ్యత్వము నుండదు. ఎవనియందు సకలరసములు మూర్తిమంతములైయున్నవో, మన హృదయభావము లెవని అన్వేషింపుచున్నవో, ఎవని ఆభాసను బొందినంతమాత్రమున సుప్తరసములు మేల్కొని నృత్యము సేయజూచునో, వానినే నిఖిలరసామృతమూర్తియని చెప్పనగును.

శ్రీ జయదేవకవి శ్రీకృష్ణుని రసవిలాసమును రూప సంపదలతో జిత్రించి ఇంద్రియానుభూతికిని అతీంద్రియమగు రసానుభవమునకునుగల నిగూఢనిబిడసంబంధమును నిరుపమానముగ బ్రదర్శించెను. ఇంద్రియములన్నిటికిని నా యమృతమూర్తికొఱకు నిత్యపిపాస కలదు. కాని ఆ యమృత మూర్తిని ఇంద్రియరాజ్యమున అనుసంధానము సేయలేము. ఆవస్తువు అతీంద్రియరాజ్యమునుండి ఆత్మయొక్క దహరా కాశమునుండి ఇంద్రియసమ్ముఖమున విద్యుల్లతవలె ఒక్క క్షణములో మెఱసిపోవునుగాని, స్థిరసౌదామినియై వెలుంగదు. అందుకనియే చక్షువులు ప్రతిరూపమునందును భ్రమరమువలె వ్రాలుచు, చంచలములై తిరుగుచున్నవి. ప్రీతిజనకమగు ముఖమును తిరిగి తిరిగి చూచుటకు ఇచ్ఛకలుగును. కన్ను, ఆప్రీతి రూపములోనున్నదని భావించి కొంచెము చూచి, కనుగొనలేక ఆయాసపడును. సకలేంద్రియముల యవస్థయు నిట్టిదే ఆ యమృతమూర్తి చిక్కదు. ఇంద్రియములు దానిని పట్టుకొనలేక శ్రాంతిజెందుచున్నవి. ఎట్టిభ్రమ! ప్రాణతుల్యమైన ఆ మోహనవిగ్రహమును, ఆసుందరమధురరూపమును అనుభవముచే దర్శింపనంతనఱకు, గీతగోవిందాదిసంకీర్తనములను పాడినను, వినినను, వట్టి వేడుకయే. కృష్ణకర్ణామృతమును దెఱచి అందు శ్రీకృష్ణుని రూపగుణలీలలను జదివి ఆనందించునపుడు, శ్రీకృష్ణుడు ఈశ్వరుడా మనుష్యుడా యని ప్రశ్నింపకుము. ప్రశ్నించితివా, ఆనందసాగరమంతయు నొక్క నిముసములో ఇనికిపోవును. హృదయముశుష్కించిపోవును. నాప్రాణమర్మమున, ప్రకృతియొక్క హృదయమధ్యమున, తీవ్రముగ బాధించుచున్న పిపాసను తృప్తిపరుపగలవా డెవ్వడు? అతడు నా ప్రాణమర్మపటమున బొడగట్టిన సుందరరూపుడు

కానిచో నా పిపాస తీరుటెట్లు? ఈశ్వరుడు అరూపియా? నేను చూడగోరుచున్నది రూపము. ఈశ్వరుడు అరసుడా? నేను భోగింపగోరుచున్నది రసము. ఈశ్వరుడు అగంధుడా? నేను గంధమును గోరుచున్నాను. ఇంద్రియశాంతికొరకు ఆనందద్వారమును బంధించుటకు నేనొప్పుకొనను. ఆనంద ద్వారమును బంధించితినా, నా మనుష్యత్వమేపోవును. నేను గానిదానిని నే గోరుటెట్లు? ఈశ్వరుని అశబ్దస్పర్శరూప రసగంధునిగ జేసి, ఈ శబ్దస్పర్శరూపరసగంధములను తృప్తి పరుపజాలము. కాక, ఈ గుణములను మనుష్యునిపరము చేసి నే నెట్లు సార్థకము చేసికొనగలను? నాలోని మనుష్యునివదలి వెలుపల నేదో ఉన్నదని అనుకొనుటచే నాకు తృప్తి లేదు. అది నన్ను భ్రమింపజేయుజాలదు. సఖుని కౌగిలించుకొని ప్రాణము తృప్తినొందజూచునుగాని, సఖుడు పూర్ణతృప్తినీయ జాలడు. ఎవడో రహస్యముగ నిద్దరిలోపల వెలుపల నుండి, మా యతృప్తిచే, తనవైపునకు ఆకర్షించుచున్నాడు. "Jove in me nods to the Jove in you" అనినాడు ఎమర్సనుకవి. సఖులు ఎంత సమీపమున నుండినను, అంతదూరమయ్యెదరు. ఎంత తృప్తియుండునో, అంత క్షుధయుండును. మనుష్యుని వదలినను తృప్తిలేదు. కూడుకొనియుండినను తృప్తిలేదు. నా ప్రాణము గోరుచున్నదేమి? ఎవడు ఇంద్రియవర్జితుండయ్యు సర్వేంద్రియగుణాభాససంపన్నుడై యున్నాడో, ఎవని యందు కల్పన వాస్తవమును, వాస్తవము కల్పనయు అగు చున్నదో, ఎవనిని జూచియు జూడలేకపోవుచున్నానో, ఎవ్వని స్పృశించియు స్పృశింపలేకున్నానో, సర్వరసము లందు మునిగియు ఏ రసమునను వాని పూర్ణానుభూతి నంద జాలకున్నానో ఆ సఖుడు, ఆ వల్లభుడు, ఆ రమణుడు నాకు

గావలెను. వాని ప్రీత్యంగసాంగత్యముకొరకు నా ప్రాణము తహతహలాడుచున్నది. నాప్రాణము స్వర్గములోని ఈశ్వరుని గోరుటలేదు. మర్త్యస్వభావముచే, ఉపచయాపచయశీలము గలిగి, రోగశోకజరామృత్యువులచే బీడింపబడు మానవుడును గాదు నాకు గావలసినది. నా ప్రాణము మనుష్యునే గోరుచున్నది. కాని, రోగములేక జరాభారములేక నిత్యానందుడై రసస్వరూపుడై సకలకామములను నివృత్తి చేయగల్గి, దేహేంద్రియ ప్రాణమనోబుద్ధిచిత్తాత్మలచే ననుభావ్యుడై మానవత్వమును సమగ్రమును సంపూర్ణమును సార్థకమును చేయగల నిఖిలరసామృతమూర్తియగు మనుష్యుడు నాకు గావలెను. ఈ మూర్తిని ఈ విగ్రహమును బ్రదర్శింపగల కవి, గాయకుడు, చిత్రకారుడు, శిల్పియు నేరీ? ఎచ్చటను కానరారు. ఆంశిక భావమున నితరు లీ చిగసుందరుని జిత్రించిరి. భాగవతము, గీతగోవిందము, కృష్ణకర్ణామృతము, ఛాయామాత్రముగ సూచించెను. కాని నిశ్శేషముగ వ్యక్తీకరించుట అసాధ్యము. ఎవరును పరమతత్త్వమును విశుద్ధమానవప్రకృతిసంపన్నునిగ వర్ణించుటకు సాహసింపలేదు. వానియందు సఖ్య వాత్సల్య మాధుర్యాది రసప్రబోధమునుమాత్రము దిఙ్మాత్రముగసూచించిరి.

సంసారమున నీ సఖ్యవాత్సల్యాది సంబంధము లున్నను రసానుభవముమాత్రముదుర్లభము. ఈసంబంధములకు రెండు విశేషధర్మములు గలవు. (1) తరళత (2) ఆనందము. తరళత యనగా సర్వత్ర సంచారముచేయునది; అందరిలోను బ్రవేశించునది. ఆనందము సంచరించుచోట సుఖము ఉత్ఫుల్లమగును. సర్వసంచారశీలము, సర్వానందదానము రసముయొక్క ముఖ్యధర్మములు. ఈధర్మము లించుకసంసారమునందు గలవు. సాంసారికసంబంధములు తరళములును, సుఖమయము

లును నగును. నిశ్చయమే. కాని వానికి వికాసము లేదు. ఆ సంబంధములు దేహప్రాణమనఃపర్యంతమైనను బూర్తిగ వ్యాపింపలేకున్నవి. ఇక నతిక్రమింపజాలవని వేఱుగ జెప్ప నేల ? దేహప్రాణమనముల నాక్రమించి, వాని నతిక్రమింపనంతవరకు వానిని రసములని యనుటకు వీలు లేదు. సఖ్యరసమును జూడుడు! సఖ్యసంబంధ మెప్పుడు దేహప్రాణమనముల నావరించి, అతిక్రమింప నారంభించునో, సఖునిజీవన మపుడు సుఖమయమగును. పంచేంద్రియములును సఖునిబొందుటకు వ్యాకులత బొందును. మనస్సు అవిరామముగ సఖునిరూపమును ధ్యానించుచుండును. రెండు దేహములలోను ఒక్కప్రాణమే స్పందించును. సుఖదుఃఖములయందు ఐక్యతఏర్పడును. జాగ్రదవస్థ స్వప్నమువలె గన్పట్టును. దేహము, ప్రాణము, మనస్సు పరస్పర సమగ్రతకొఱకు అనవరతము వేదన నొందుచుండును. దేహమున స్నాయుమండలి ఉత్తేజమునొందును. ప్రాణమున ఆకాంక్ష జ్వలితమై విజృంభించును. మనస్సు భావనలచే నూతనజగత్తులను గల్పించుచుండును. కనువిచ్చినను, మూసినను పరస్పరరూపావలోకనము సిద్ధముగనుండును. శ్రుతిగోచరము కాకపోయినను, శబ్దము వినబడును. బహిరింద్రియ సాక్షాత్కారము లేకున్నను పంచేంద్రియములు సఖులసంగమును బడయజేయును. స్వేదము, కంపము, పులకాశ్రువులు మొదలగు సాత్వికలక్షణములు ప్రకాశించును. అప్పుడు దేహమునకును, ఆత్మకును, ఇంద్రియములకును, అతీంద్రియమునకును గలభేదము నశించిపోవును. శరీరమును, అశరీరము నేకమగును. ఆత్మ దేహధర్మమును, దేహము ఆత్మధర్మమును బొందును. ఆత్మ దేహమునందు వ్యక్తమగును. దేహము ఆత్మయందు లీనమగును. ఈ యపూర్వావస్థ యిట్టిదట్టిదని

వచింపరానిది. ఎవడు సఖ్యరసము నొక్కకణమునైన నాస్వాదించునో వానికిది కల్పనకాదు. శైశవము పోయి యౌవన మంకురించు ప్రదోషకాలమున సఖ్యరసాస్వాదనమన నెట్టిదో యించుక తెలియని హతభాగ్యు డెవడుండును ?

రసమనునది మానసవస్తువా ? కాదు. దైహికమా ? కాదు. అయ్యది మానసవస్తువు కావచ్చును. కాని ఆ మానసము ఇంద్రియవిహీనమైన మానసముకాదు. అయ్యది ఆత్మవస్తువు కావచ్చును. కాని ఆ యాత్మ శరీరాతిరిక్తమైన యాత్మకాదు. అందు శబ్దాశబ్దములు, రూపారూపములు ఒక్క యనుభవమున మిళితము లగుచున్నవి. ఈవస్తువు కేవలము ఆధ్యాత్మిక భావమని జెప్పుట ఎంతయబద్ధమో, రక్తమాంసము యొక్కగాని స్నాయుమండలియొక్కగాని ఉత్తేజనమని జెప్పుటయు నంతే యబద్ధము. రసము సకలశరీరధర్మశూన్యమని గాని, ఇంద్రియసంపర్కవివర్జితమనిగాని చెప్పువారికి రసస్వరూప మెట్టిదో తెలియదు. వారికి రసాస్వాదన భాగ్యము లభించలేదని యర్థము. ఈరసము నింద్రియవికారమని చెప్పువానికి రసమన్న మొదలే అగ్రాహ్యవిషయము. అతీంద్రియము, ఇంద్రియముల నాశ్రయించి తన్ను దాను వికసింప జేసికొనుచున్నది. ఈ వికాసమునందే రసము వ్యక్తమగుచున్నది. రసము ఇంద్రియరాజ్యమున జన్మించి, అతీంద్రియ రాజ్యమున లీలను జూపుచున్నది. ఈ మర్మమును దెలిసికొనగలిగినవారే రసవస్తు వెట్టిదో చెప్పగలరు.

వస్తువుల అనుభవము మొదట ఇంద్రియసహాయముతో ఉత్పన్నమగును. ఈయనుభవము, రసము నొక్కటికాదు. (అను-పశ్చాత్ భవ-జన్మము) ఇంద్రియములవలన గలిగిన సాక్షాత్కారము అనుభవము (Perception). ఈ యనుభ

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)



వము సకలమానవులకే కాక, సమస్తకీటకపశుపక్షిజంతుజాలమునకును సామాన్యము. ఈ యనుభవము రసముకాదు. రసవస్తువు దీనికి భిన్నమైనప్పటికిని దీని నాశ్రయించియే యుండును. ఇంకొకవిధమున నుండుటకు వీలులేదు. రసము అనుభవాధీనము. అనుభవము ఇంద్రియాధీనము. అనుభవవిహీనమైనరసము వస్తుతంత్రవిహీనమైన కల్పనమేకాని, వాస్తవముగాదు. కావున ఇంద్రియసాక్షాత్కారమున నుత్పన్నమైన అనుభవమునందుగాని రసము జన్మింపదు. కాని అనుభవము ఇంద్రియముల నతిక్రమించి నిలువజాలదు. రసమన్ననో, యనుభవమునందు జన్మించినను ఆయనుభవమునేగాక వర్తమానాతీతములైన యనుభవములనుగూడ మేల్కొల్పి వానినెల్ల నతిక్రమించును. చక్షువు తక్కిన యింద్రియముల కార్యమును చేయజాలదు. ఇంద్రియానుభవము రసముగ బరిణమించుటతోడనే రూపసంస్పర్శవలన చక్షువులకేకాక, సకలేంద్రియములకును పిపాసను గల్పించును. చక్షురింద్రియానుభవమునందు కేవలము రూపము, వర్ణము, ఘటన యను జ్ఞానము మాత్రమే యుండును. ఆ యనుభవమెప్పుడు రసముగ బరిణమించునో, యప్పు డారూపము కేవలము చక్షుర్గ్రాహ్యరూపము గాదు. రసావేశమున గోచరమగురూపము బుద్ధిగ్రాహ్యరూపము, ధ్యానగమ్యరూపము, చిన్మయము. ఎవరుచక్షుజన్యమైనఅనుభవమునందు ప్రమోదమునుబొందుచున్నారో, వారియందు రసోదయము కానున్నదని చెప్పవచ్చును. "యతోభావస్తతోరసః". పేరు వినినంతమాత్రముననే సకలేంద్రియము లున్మత్తములైనప్పుడు రసావిర్భావమైనదని తెలిసికొననగును. అప్పుడు ఒక్క యింద్రియమే తక్కిన ఇంద్రియముల పనినిగూడ జేయగలుగును. ఇది ఇంద్రియ

రాజ్యమునుండి యతీంద్రియమునకుబోవు నవస్థాసూచకము. అనుభవము బీజము. రసము వృక్షము. రసమనగా ఇంగ్లీషులో జెప్పబడు "ఫీలింగు" కాదు. దేనిని ఆలంకారికులు "రొమాన్సు" అని అనెదరో అది కొంతవరకు రసస్వరూపమును అంశామాత్రముగ నిర్దేశించును. రసము ఇంద్రియముల బుట్టి, ఇంద్రియముల నతిక్రమించుటయేకాక ఇంద్రియగ్రామమునుగూడ నతీంద్రియమగు రసరాజ్యమునకు గొంపోవును. రసవస్తువు ఆనందసేతువు— ప్రత్యక్షము నప్రత్యక్షమునకును, రూపము నరూపమునకును, ఇంద్రియముల నతీంద్రియమునకును దీసికొనిపోగల ఆనందసేతువు. అప్పుడీ చక్షువులు చర్మచక్షువులు గావు—అవి రసచక్షువులు. అప్పుడీ శ్రోత్రములు శ్రోత్రములుగావు—అవి రసశ్రోత్రములు. "నేత్రస్య నేత్రం, శ్రోత్రస్య శ్రోత్రం, ప్రాణస్య ప్రాణః, మనస్య మనః" నూతననేత్రము, నూతనశ్రోత్రము, నూతన ప్రాణము, నూతనమనస్సు, నూతనబుద్ధియు నుదయించును. అప్పుడే కవి యోగియై శ్రవణదర్శనాదులచే రససిద్ధినొందును. సకల విశ్వము ఒక్కొక్క సంబంధమున ఒక్కొక్క విశ్వరూపముదాల్చి సహస్రశీర్షుని విశ్వలీలను బ్రదర్శించును. అప్పుడు నరరూపము నరప్రకృతియు, ఈశ్వరరూపమునకు ఈశ్వరప్రకృతికిని భిన్నములుగ గన్పట్టవు. పరాపరప్రకృతులు క్షరాక్షరములు పురుషోత్తమునియం దొక్కటేయను ఉత్తమ రహస్యము వెల్లడియగును. శాంతి, దాస్య, వాత్సల్య, మధుర మహాభావములును, శృంగారవీరకరుణాద్భుతరౌద్రభయానక హాస్యబీభత్సాదిరసములును, సృష్టిస్థితిలయాద్యవస్థలును ఆ నరోత్తముని లీలారూపములై భోగ్యవస్తువులగును.

1917

*

రసస్వరూపము

## రూపాంతరము * *

రసము బుద్ధిగోచరమగు బాహ్యవిషయముగాదు. అది యనుభవైకవేద్యమగు ఆంతరంగికవస్తువు. రసానుభవమును రూపద్వారమున బ్రకాశింపజేయు విద్యను శిల్పమనిగాని కళ యనిగాని అందురు. కల్పనయందు ప్రకాశించు సౌందర్యమును సత్యమున బ్రతిష్ఠించుటయే కళలయొక్క ప్రయోజనము. రూప, వర్ణ, గంధ, స్వరములచే మనస్సులో భావములు ప్రతిబింబించునప్పుడు మానవుని ప్రాణనికుంజమున రసస్ఫూర్తి యగును. రూపవిలాసములచే, వర్ణక్రీడలచే, శబ్దచ్ఛందస్సుచే, హృదయవంశీగానము బయల్వెడలునప్పుడు విశ్వమంతయు సుందరరూపముతో విరాజిల్లును. హృదయముయొక్క జడత్వము వీడిపోవును. ప్రకృతివైచిత్ర్యములు మాధుర్యమయము లగును. ఆత్మ ఇందు్రినివగిది సహస్రనేత్రములతో దిలకించును. విశ్వము తన మేలిముసుగును తొలగించుకొని వినిర్మల మందహాసరుచులను నలుగడల బ్రసరింపజేయును. అపుడు గ్రహనక్షత్రములు, ఋతుక్రమము, తరుగుల్మలతాదులు, నదీనదములు, నూతనవిలాససంపదలతో దనరారును. అభ్రభేదియగు హిమవన్నగమును, ఉత్తుంగతరంగితమగు విశాల సాగరమును రూపముయొక్క అనంతమైన అరూపమును వెల్లడిచేయును. మనఃకల్పితములగు రూపారూప, శబ్దాశబ్ద, రసారస, గంధాగంధముల భేదములు మాయమైపోవును. ఆ యుద్దీపనావస్థను వర్ణించుట యెట్లు?

హృదయమణికోటరమున బ్రచ్ఛన్నముగనుండు ఆత్మజ్యోతి బహిర్గతమై ప్రకాశింప నారంభించినయెడల ఆ వెలుగును మఱుగొనర్చుట యసంభవము. ఆత్మ తన వికాసముననే తాను బ్రకాశించును. అందుకనియే కవులు, శిల్పులు, కళానిపుణులు, తమ జీవనాంతరాళమున బ్రజ్వలింపుచుండు దివ్యజ్యోతిని జేతబుచ్చుకొని ప్రతిహృదయద్వారమందున నిలబడి, అందారిపోవుటకుసిద్ధముగనున్న దీపములను జాజ్వల్యమానముగ బ్రకాశింపజేయుటకు బ్రయత్నింతురు. భరతవర్షమున జిరకాలమునుండియు, కవిశేఖరులు, కళావిదులు, శిల్పులు బయల్వెడలి తమతమ రసానుభవములను బ్రకటించు రచనలమూలమున దేశమును బ్రజ్వలింపజేసిరి. భరతవర్షమింకను ఆత్మవికాసము నొందునుగాక! ప్రతి గృహమునందును ఆత్మజ్యోతి ప్రజ్వలించునుగాక! ఆ హృదయవంశీగానమును విచిత్రరీతుల, అనేకగతుల నాలపించెదముగాక! ఆత్మోద్దీపకములగు గానములను, కావ్యములను, శిల్పములను, కళలను బోషించుకొనెదముగాక. అప్పుడు మన యాకర్షణ వలననే ఈ గ్రహతార లన్నియు దిరుగుచున్నట్లు మన కాంతియే సూర్యచంద్రాదులకు తేజమొసగుచున్నట్లు దర్శించెదము. ప్రాణముయొక్క రహోవీధుల విహరించి జీవనముయొక్క ఏకాంతగోష్ఠీమర్మమును దెలిసికొనుచు ముందుకు అడుగిడెదము. ఆత్మచింతామణిని గైకొని, దాని స్వప్రకాశమున జగత్ప్రకాశమును వీక్షించెదము. పాఠక మహాశయులారా! కవులును శిల్పులును బొందిన ఆ రసావేశావస్థ యెట్టిదో తెలిసికొనుటకు మీరు కుతూహలులగుట లేదా? కాని ఆ మధురరసామృతతరంగిణీప్రవాహసరణిని తెలిసికొనుటెట్లు?

సామాన్యజ్ఞానమువలనను, మీమాంసాశాస్త్రము యొక్క తర్కవితర్కములవలనను, ప్రాణముయొక్క ఆంతర వస్తువగు రసము లభ్యముగాదు. మనము ఇంద్రియతరంగ ఫేనములో జిక్కుకొని, ప్రాణముయొక్క ఆ అంత స్తత్త్వ మును దెలిసికొనలేకున్నాము. మన చర్మచక్షువులు చూచు చున్నది రూపమును. ఇది బాహ్యవిషయము. కాని మనయందు స్నేహము, భక్తి, ప్రేమ మేల్కొనినప్పుడు మనకనులు చూచు నది ఆ రూపమునుగాదు. ఆ రూపముయొక్క రూపాంతర మును. "బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్" అని గీత నుడువు చున్నది. "ప్రేమచక్షువునకు గాని నందనందనుడు గోచ రింపడు" అని భక్తశిఖామణియగు మీరాబాయి గానము చేసినది. ఆప్రేమాంజనము మనయొద్ద లేనియెడల ఎన్నియుప న్యాసములను జదివినను, ఎన్ని వాదప్రతివాదములను జరిపి నను, ఎన్ని తర్కవితర్కముల గావించినను, రూపాంతరవిషయ మగ్రాహ్యము. బాహ్యమును వీడుడు. మీ ప్రాణముయొక్క అంతరమున బ్రవేశింపుడు. అచ్చట సింహాసనాసీనయై యున్న దెవరో చూడుడు! ఆ రాజ్యమెంత జాజ్వల్యమానముగ బ్రకా శించుచున్నది! ఆ సింహాసనము సత్యము. దానిపై నధిష్ఠించి నది ప్రేమ. ఎప్పుడు ప్రేమ సత్యప్రతిష్ఠితమగునో అప్పుడే విశ్వము రూపాంతరము నొందును. ఇది కవితయొక్క యుత్కృష్టధర్మము. ఇదియే శిల్పముయొక్క చరమప్రయో జనము. ఇదియే కళలయొక్క పరమసాఫల్యము. మనము పుష్పమును జూచినంతనే యొకరూపముగోచరమగును. కాని యది పుష్పముయొక్క యథార్థరూపమునుగాదు, సంపూర్ణ రూపమునుగాదు. ఆ పుష్ప మీ యొక్కదినమున వికసించి నదా ? అనేకజన్మముల చరిత్ర మా పుష్పమున గర్భితముగ

లేదా? ఎంతకాలమునుండి య్యాపుష్పము తన్నుదానువికసింప జేసికొనుచు వచ్చుచున్నదో! ఆ మహాయత్నమున నెన్ని మారులు జారివడిపోయెనో? తిరిగి ఎన్నిమారులు రేకెత్తెనో? ఆ విషయము లెక్కించ నేరితరము? ఆ ప్రినూనములోని ప్రతివర్ణమునందును, ప్రతిరేఖయందును, ప్రతిరెక్కయందును అనంతకాలము ముద్రితమై ప్రకాశించుట లేదా? అనంతకాలముయొక్క సుఖదుఃఖములు ఆకుసుమసౌరభమున నంకితములై యలరారుచుండుటలేదా? ఆ పుష్పచరిత్రము అనంతకాలముయొక్క విరహవేదనను గానముచేయుట లేదా? పుష్పమన కేవలము చక్షుర్గోచరమగు శుద్ధపుష్పమని తలంపకుడు. అది విశ్వేశ్వరుని ప్రాణకళిక; అయ్యది అనంతుని లీలా రూపము. దానియందు విశ్వరూపము ఉత్తేజితమగుచున్నది. ప్రపంచమంతయు ప్రాణమయము. సమస్తరూపములు చిద్రూపములు. అచేతనములని మనము హేయముగ జూచు జడరూపములను, మనకంటె దక్కువయని నిరసించు నీ తరులతాదులును, నీసమస్తజీవకోటియు, అనంతప్రాణసాగరమున లేచిపడు తరంగములు. పుష్పమనంతము. నీవు అనంతము. సమస్తము ననంతమే. మనకన్నులలో జడత్వముండుటచే ప్రపంచమునకును, పుష్పమునకును జడత్వ మారోపించుచున్నాము. కాని మన యల్పత్వముచే పుష్పధర్మముగాని, పుష్పస్వభావముగాని మారిపోవునా?

మనకన్నులకు గోచరించు పుష్పముయొక్క సామాన్యరూపము తొలగించి, పుష్పమునందు మునింగి తన్మయత్వముతో జూచితిమేని ఆపుష్పము ధ్యానధారణలకు లక్ష్యమగును. అప్పుడు పుష్పమువలన గలిగిన రసానుభవము సాధనకు ఆలంబన మగుటయేకాక మూర్తిమంతమగును. అందు ప్రాణ

సాక్షాత్కారమగును. పుష్పము చిదూప్రమున ననంతమై, అనంతమగు ప్రాణవాహినియందు దివ్యసౌరభముతో వికసించును. అప్పుడు మన ప్రాణమునకును ఆ పుష్పమునకును జరుగు ఆదానప్రదానములనే, రసలీలనే రూపాంతరమందురు.

మనజీవనమునమాత్రి మట్టి రూపాంతరము గలుగుట లేదా? ఒక రమణినిజూచినప్పుడు హృదయమున ప్రేమోన్మేషమగును. కాని ప్రేమోదయమునకు బూర్వము మన కన్నులకు గనుపడినది యథార్థమగు నారీరూపముగాదు. అనురాగావస్థయందా కాంతను జూచినది కేవలచర్మచక్షువులతో గాదు. ప్రాణచక్షువులతో, ప్రేమనయనములతో జూచుచున్నాము. అప్పుడు నారీరూపము రూపాంతర మొందుచున్నది. అటులనే జడమతులు మట్టిబొమ్మలనిచెప్పు మృణ్మయప్రతిమలు భక్తిచక్షువులతో జూచు సాధకులకు చిన్మయమూర్తులై ఆత్మోపలబ్ధిని బొందించును. అనురాగము గాఢమైనప్పుడు, భక్తి గంభీరమైనప్పుడు, ఆమూర్తి మన ధ్యానధారణలకు విషయమగును. ఏ క్షణమున మృణ్మయమూర్తిని చిన్మయరూపముగ జూడగలుగుదుమో ఆక్షణమే మనజీవితమున ఆనందముహూర్తము. అప్పుడే నాప్రాణమును నేననుభవింపగలుగుదును. అప్పుడే ఆత్మసాక్షాత్కారమైనదని తెలిసికొనియెదను. అప్పుడు నేను అనంతప్రేమపథమున అనంతానుసంధానమునకై నడుచుచున్నానని తెలిసికొందును. ప్రథమమున ప్రేమోద్దీపనమునకు గారణమగు విగ్రహము ఉజ్వల దేవతారూపమై, ఎవరి నుద్దేశించి నేను ప్రణమిల్లితినో ఆ మహాసాగరమునకు నా జీవనస్రవంతిని గొంపోవుచున్నదని గ్రహింతును. ప్రేమగాఢమైనప్పుడు, ప్రాణస్రవంతి కూలములనెల్ల నతిక్రమించి పొంగిపొరలి

ప్రవహింపుచుండును. ఆమహాస్రోతమున రూపాంతరమున విలసిల్లు పదార్థము లనంతములు. ఆ యుజ్వలితావస్థయందు అనంతుని చరణనూపురరవములు ప్రాణమధ్యమున బ్రతిధ్వనించును. అహో! ఆదివ్యమంగళవిగ్రహ మెంత సుందరము! "ముఖేందుమండలమరీచీజాలముల్ పర్వ" నా యనంతుడు హృదయమంటపమున నెట్లు నాట్యము సేయుచున్నాడు! ఓ హృదయేశ్వరా! నీనాట్యమునకు విశ్వమంతయు కరతాళధ్వనులు సల్పుచు "ధన్యోస్మి ధన్యోస్మి" యని గానము సేయుచున్నది.

నిఖిల పావనమైన నీకీర్తిఁ బాడుచు,
　　　నీతుమ్మెదలు వెంట నేగుదెంచె
నడవిలో గూఢుండవైన యీశుడవని
　　　మునరి కొల్వఁగ వచ్చె మునిగణంబు
నీలాంబరము తోడి నీవు జీమూతమ
　　　వని నీలకంఠము లాడఁదొడగెఁ
బ్రియముతో గోపికల్ వీక్షించుచుండాన
　　　నిను జూచె నదె హరిణీచయంబు

ఆ॥ నీవు విందవనుచు నిర్మలసూక్తులు
పలుకుచున్న విదట పరభృతములు
నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన
ధన్యులైరిగాదె తలచిచూడ.

ఆ విగ్రహము ప్రేమమాధుర్యమును స్వయముగ నాస్వాదించుచుండ, మన మానందమందిరమున బ్రక్కగా నిలిచి ఆనందవిహ్వాలులమై నిర్నిమేషనయనములతో జూచుచుందుము. అందుకనియే ముప్వురి క్రీడ ఒక్కరి లీలయని

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)



భాగవతోత్తములు చెప్పుదురు. ప్రేమవ్రతోద్యాపనమైనగాని ఈ సందర్శనము లభ్యము కాజాలదు. ఆ యుద్యాపన మెప్పుడగునో చెప్పుట కష్టము. ఒక జన్మముననో, అనేక జన్మములనో ఆ ప్రేమవ్రత ముద్యాపితము గావలయును. అప్పుడు ప్రాణమధ్యమున బాహ్యాంతరముల చిదానందపరిపూర్ణుడు, ఘనరసామృతస్వరూపుడు, భగవంతుడు వెలువడి తన మృదుకరవల్లవముల జాచి, భక్తుల నాలింగనము చేసికొనును. ప్రేమవ్రతోద్యావనమగులోపల గడపవలసిన అవస్థ లనేకములు గలవు. ఆవ్రత్యవస్థయు రూపాంతరమే. ప్రతి రూపాంతరము సత్యమేయైనను ఉద్యాపనానంతరము గల్గునది చరమరూపాంతరము. ఇట్టి రూపాంతరములతోడనే ప్రేమరాజ్యము విరాజిల్లుచున్నది.

ప్రథమమున ప్రేమ స్వరూపము కనులకు బొడగట్టినప్పటినుండియు చరమావస్థవరకును, సకలరూపములకును యథార్థస్వరూపమగు భగవంతుడు ప్రాణమధ్యమున తాండవమాడుచుండును. ఈ తాండవము ననుభవించుటయే ప్రేమ. ఇట్టి ప్రేమానుసంధానమునకు ఆలంబనమగునదియే సత్యము. ప్రాణవల్లభుడు తన ప్రేమరాజ్యమునకు దీసికొనిపోవుటకే మురళిని వలుగతులవాయించుచున్నాడు. ఇంద్రియప్రేరణమునే భగవంతుని ఆహ్వానమని వలుమారు భ్రమపడుచుందుము. కాని, ప్రేమ ఇంద్రియజగత్తునందు ప్రారంభమై, అతీంద్రియ జగత్తునందు వరిపక్వమగును. ఇంద్రియము లెప్పుడును అతీంద్రియుని నిర్దేశింపుచుండును. శబ్దము అశబ్దమును, స్పర్శ అస్పర్శను, రూపము అరూపమును, రస మరసమును, గంధ మగంధమును జూపుచుండును. ఇది ఇంద్రియధర్మము. ఆ యఖండ సత్యరాజ్యమునందు దేనిని విసర్జించుటకును వీలులేదు. ఏయిం

ద్రియమును విసర్జించినను సత్యమునకు వికలత్వము చేకూరును. సమగ్రసత్యము హృదయమున నుద్దీపనమైనప్పుడు, మన సామాన్యేంద్రియములు రూపాంతరమునొందును. ప్రేమ మాత్రము మార్పునందదు. ప్రేమ గాఢమైనకొలదిని, మన చిత్తమునందలి జడత్వము తొలగును. దివ్యదృష్టితో జూచిన నేవస్తువును జడముగాదు. సర్వమును చిన్మయము.

ఇట్టి యుజ్వలావస్థ నొందనివాడు కవిత్వము జెప్ప జాలడు. శిల్పమును రచింపజాలడు. కవితయొక్కయు, శిల్పము యొక్కయు ప్రయోజనము జీవితవిలాసప్రతిపాదనమనియు, ధర్మమునకును వానికిని ఎట్టి సంబంధము లేదనియు జెప్పువారు కొందరు గలరు. ధర్మమన నింగ్లీషులో జెప్పబడు "రిలిజియను'' అని వారిఅభిప్రాయము. మనవారు జీవనమును ఖండ ఖండములుగ విభజించి, అందొక్క ఖండమునకే ధర్మమునంట గట్టరు. ధర్మజీవనమొక యావరణయందు బద్ధమైయుండదు. కళలకు రససాధనయే ఆధారము.'వాక్యం రసాత్మకం కావ్యమ్' సకలరసములకు ఆధారమును ఆకారమును నగు నిఖిలరసామృతమూర్తినివీడి, రససాధన సార్థకతనొందుటకు వీలు లేదు. రససాధన లేనినాడు రససృష్టి ఆత్మవంచనమగును. ఇంద్రియములయందు బంధింపబడియుండుట విలాసధర్మముగాదు. విలాసము తన విషయమును బురస్కరించుకొని తన్మయత్వ మొందును. తన యావేగబలముచే ఇంద్రియగ్రామము నతిక్రమించి అతీంద్రియరాజ్యము జేరును. అప్పుడు రూపమునందరూపమును, శబ్దమందశబ్దమును విలసిల్లును. కేవల మింద్రియరాజ్యమందా బద్ధులగువారు విలాసవివర్తనము ననుసంధానము సేయజాలరు. వారు కాల్పనికజగత్తు నొకదానినిసృష్టించుకొని అందు కళలనుబ్రతిష్ఠింపజూతురు. వారాశ్రయించునది అనుభవ

విషయముగాదు. వారికళలు సత్యప్రతిష్ఠితములుకావు. ఇంద్రి యములు చూచునది వస్తువుల బాహ్యావిషయము. వస్తు స్వరూపమును జూడవలెననిన అతీంద్రియరాజ్యమును మేల్కొల్పక తప్పదు. 

అతీంద్రియమన్న ఇంద్రియములను నిరసించుటకాదు. ఇంద్రియముల నాశ్రయించియే అతీంద్రుని చేరవలెను. పాశ్చాత్యతర్కమును, మన దేశమందు మధ్యయుగమున ప్రబలిన మాయావాదమును, ఇంద్రియములకును అతీంద్రియము నకును విరోధము గల్పించి, ధర్మజీవనమును కృత్రిమముగను, రసవిహీనముగను జేసివేసెను. "దేవుడు ఇంద్రియగోచరుడు కాడు. ప్రపంచము జడము. మానవప్రవృత్తి అపవిత్రము" అని కొన్ని నీతివాక్యములను మనమునం దుంచుకొని, మానవుడు తనచుట్టు నొక గిరి గీసికొని, ఒక అసత్యపీఠమును బ్రతిష్ఠించినంతమాత్రమున నది దేవుడగునా? మానసప్రవృత్తి సత్యముగాదా? ఇంద్రియప్రవృత్తియందు భగవత్సాక్షాత్కారములేదా? "సర్వమ్ ఖల్విదం బ్రహ్మ" అని శ్రుతివాక్యము గానము సేయుటలేదా? ఇంద్రియలోకమును వీడి మానసికకల్పనతో నొక పవిత్రలోకమును సృష్టింప బూనుకొనుట అంతరిక్షమున సౌధమును నిర్మించుటవంటిది. మానసికోపాసనయను పేరుతో మానవులు మిథ్యారాజ్యమును జేరుచున్నారు. చిత్తము జడమైనప్పుడు ప్రపంచమంతయు జడముగనే గన్పట్టును. ఇంద్రియము లపవిత్రములైనపుడు, ఇంద్రియముల కంధత్వమును, బధిరత్వమును సంఘటిల్లును. రూపమునం దరూపమును జూడజాలక రూపమును విడనాడి, కాల్పనిక జగత్తులో సత్యమును ప్రతిష్ఠింప జూచుట ఆత్మవంచనము. ఈశ్వరుడు సర్వగతుడని ఒక చిలుక

పలుకును బలుకుదు రేకాని, వారికి దేవుడు ప్రపంచబాహ్యుడు. వారు ప్రాణకుంజమున మురళీగానమును వినజాలక ఈశ్వరుడు సాకారుడా, లేక నిరాకారుడాయని కొన్ని అల్పయుక్తులను ముఖస్థము జేసికొని, ఆత్మవంచనము గావించుకొనుచున్నారు. అట్టివారికి కవితాగానశిల్పాదికళల రసస్పృష్టి బోధగమ్యమగుట యెట్లు?

భక్తిరసామృతమును గ్రోలిన పరమభాగవతోత్తములు ఎట్లు ప్రాణవల్లభుని గనులారగాంచి ధన్యులైరో మీ శుద్ధాంతఃకరణమున నొక్కమారు యోజించి, రూపాంతరమన్న నెట్టి రసావేశావస్థయో యూహించుకొనుడు.

సనకసనందనాది మునిసత్తము లంచితయోగదృష్టిచే
గనివడి యాత్మలన్ వెదకి పట్ట నగోచరమైనమూర్తి యి
ట్లనవరతంబు మాంసనయనాంచలగోచరుడయ్యె నట్టె! యే
మననగు వీరి పుణ్యమున; కాదట నెట్టి తపంబు సేసిరో!

నిరయస్వర్గము లాత్మఁ గైకొనక తా నిర్వాణమూర్తైన యా
హరి జూడన్ హరితోడఁ బల్కఁ హరిమే నంటన్ హరిం బాడగా
హరితో నేగ సహాసనాస్తరణశయ్యావాసులై యుండగన్
హరిబంధుత్వసఖిత్వముల్ గలుగు భాగ్యంబెట్లు సిద్ధించెనో.

1917

*

# కవిప్రశంస * *

"కవిః కవిత్వా దివి రూపం అసృజత్"

ఎవడు కవితాశక్తిచే స్వర్గమునందలి దివ్యరూపములను వెల్లడించునో వాడు కవి. శిల్పకర్మకూడ నదియే. మన కంటికి అగుపడునది ఇంద్రియగోచరమగు భూలోకము. కవి హృదయమునకు గోచరమగునది ఇంద్రియాతీతమైన దివ్య లోకము.

ఈశ్వరుడు విశ్వమై వెలయుట సృష్టిరహస్యము. ద్రష్ట దృశ్యమై ప్రకాశించుట శిల్పరహస్యము. సృష్టి ఈశ్వరుని మానసమూర్తి. శిల్పము శిల్పియొక్క స్వస్వరూపానుభవప్రక టనము. " హిరణ్యాపేశాశ కవి గంభీర చేతసా " కవి తన గంభీర చేతస్సునందలి బంగారు రూపములను వెలిబుచ్చు నని వేదము చెప్పుచున్నది. ఆ గభీరచేతస్సే స్వర్గము.

ఋషీశ్వరుని చూపులో నామరూపము లన్నియు గరగి పోవును. "సర్వాణి భూతాని ప్రజ్ఞానస్య నామధేయాని" కవి చూపులో నామరూపములు రూపాంతరము నొందును. "ఋతస్య పదం కవయో నిపాన్తి గుహా నామాని దధిరే పరాణి" కవి సత్యముయొక్క పదమును నిలువుచు, గుహ్య ములైన నామరూపముల నుద్ధరించును. కవితాదృష్టికి సర్వ నామధేయములు చిదాప్రిపములు.

కవిజ్ఞానము ప్రత్యక్షము— అపరోక్షము. "కవయః సత్యద్రష్టారః" కవులు కేవలము ద్రష్టలు. కవి తార్కికుని వలె తర్కించడు. అనుమానముచే నూహించడు. ఇంద్రియము లిచ్చు జ్ఞానముతో తృప్తినొందడు. "సూర్యచక్షుః" అనుటచే వాని నేత్రము సూర్యునివలె చాటుచోటుల నన్నిటిని ప్రకాశింపజేయును. మర్మముల నుద్ఘాటించును. నామరూపములయొక్క అభ్యంతర లీలలను వెల్లడించును. "కవయః సూర్యత్వచః" అనుటచే వాని శరీరముసహితము సూర్యమండలమువలె తేజోవంతము. స్వయంప్రకాశమానమగు జ్ఞానమున సుప్రతిష్ఠుడై అతడు సర్వశక్తుడగును.

కవి సర్వస్వతంత్రుడు. లోకుల బాటలు వానిని బంధింపజాలవు; సామాజికనీతినియమములలో నిమిడియుండ నేరడు. "కవిర్విప్రేణ వవృధే" వాని జ్ఞానము ప్రకాశవంతమైన దగుటచే, వాని బుద్ధి అధోలోకములను మించి పెరిగిపోవును. "కవేశ్చిత్ తంతుం మనసా వియన్తః"— వారి మనస్సు ప్రపంచమంతట అల్లుకొనిపోవును. కర్మిష్ఠుల విధినిషేధములతో వాని కవసరము లేదు. సత్యము ఈ ద్వంద్వముల కతీతము. కవి సత్యద్రష్ట యగుటచే నీ భేదములకు గట్టుబడడు. "సూర్య సత్యాసవ సత్యాయ సత్యప్రసవాయ".

కవి కేవలము ద్రష్టయేకాదు, నిర్మాతకూడ—"కవయఃసన్తి వేధసః" కవులు తాముచూచిన సత్యమును లోకమున ప్రతిష్ఠించెదరు. "కవియజ్ఞ వితనోతి పన్థాం" అతడు యజ్ఞమునకు బాటవేయును. లోకులగతి వక్రము. కవిది ఋజుపథము. "కవి ఋతస్యపద్మభిః" "సత్యరథమునకు గట్టిన అశ్వమువంటి వాడు కవి" యని వేదము చెప్పుచున్నది. ఈయశ్వము సరళమైన సూనృతమార్గమున బరుగిడి ఆనందధామము జేర్చును.

"కవిర్హోతాయజతి మన్మసాధనః" కవి హోతవలె సృష్టియజ్ఞ మును క్రమమార్గమున నడిపించును. కవి సవితయై సత్యమును వెల్లడించును. త్వష్టయై నిర్మాణముసేయును. వేధయై ప్రవర్తింపజేయును. 

శిల్పి భావసమాహిత చిత్తుడు. ఆనందభరితుడై వెలుగు యొక్క పుట్టుకయందంతర్భూతుడగును. "అర్కస్య యోనిం అనదం" దివ్యసౌందర్యముతో వెలుగుచు ఆనందరస మును కుమ్మరించును. "శోభతే వృష కవిర్యోనవధిప్రియః" సౌందర్యరసమున ఆవిర్భూతుడగును. "కవిర్హిమధుహస్త్యః" వానిహస్తములనుండి మధువు స్రవించును. కవి వ్రాసినది కవిత్వమగును; గీసినది చిత్రువగును; చెక్కినది విగ్రహ మగును; మీటినది సంగీతమగును. "సర్వేషాం భూతానాం మధుః" సమస్తభూతాంతర్గతమగు మధుస్రవంతి వాని హస్త ద్వారమున వెల్లివిరిసి లోకమును మధుమంతముగ జేయును.

జగత్పరిణామమున చేతనాచేతనములు మనమున మేల్కొని ఆత్మస్వరూపము నన్వేషించుచున్నవి. కవితలో ఆత్మ,మనసు నాశ్రయించి ఇంద్రియసమ్ముఖమున బ్రతిష్ఠించు కొన జూచుచున్నది. అది ఆరోహణము; ఇదిఅవరోహణము, అవతరణము. ఆరోహణము సాధనము; అవతరణము సిద్ధి. మొదటిది సాయుజ్యము; రెండవది సాధర్మ్యము.

శిల్పమున దేవతలు దివ్యశరీరులయ్యు చాక్షుషమూర్తు లయ్యెదరు. కవిబుద్ధి సహస్రాక్షుని చింతామణి పీఠము. వాని క్రియ అగ్నిదేవతకు యజ్ఞవాటిక. వానిప్రకృతి లక్ష్మీదేవికి కమ లాలయము. వాని యిచ్ఛలు అశ్వినీదేవతలకు అశ్వములు. వానిసుఖము దేవతల సోమపానము. వానిహృదయము"వాగ్దే

వతాచరితచిత్రితచిత్తసద్మము." వాని హస్తము సూర్యకరోజ్వలము.

"రసోవై సః" అనునది శిల్పవిద్యామంత్రము. దీనికి అధిష్ఠాత సృష్టికర్తయగు బ్రహ్మ. ఋషి 'సుందరమ్.' సత్యశివములు పార్శ్వమూర్తులు. ఛందస్సు ఇంద్రియసంచలనము. ప్రవృత్తినివృత్తులు పరికరములు. యోగము సాధనము. చతుర్వర్గ ఫలావాప్తి వినియోగము. సమస్తకళలు ఉపచారములు.

కవి బహుదేవతారాధకుడు. ఆతడు నిరాకారములో నిస్తేజుడుకాడు. శూన్యము నుపాసించడు. నానాత్వమును నిరసించడు. ఇంద్రియములను త్యజించడు. సంసారమును బరిహాసింపడు. నిఖిలరసామృతమూర్తి సాకారుడుగదా! వాని దృష్టికి ఏశక్తి దేవతకాదు? ఏవస్తువు విశ్వరూపముకాదు? ఏకర్మ యజ్ఞముకాదు? శిల్పమున నీతి అవినీతి యను భేదములేదు. చేతనము అచేతనము అను పార్థక్యమున కవి గట్టువడడు. "బహ్మజ్ఞానే సముత్పన్నే మేధ్యామేధ్యం నవిద్యతే" జ్ఞాననేత్రమునకు సర్వము సత్యము, శివము, సుందరము. "త్వం సర్వరూపిణీ దేవీ సర్వేషాం జననీపరా" యని కీర్తించుచు సమస్తభూతములను చిద్రూపములుగ భావించి నమస్కరించును. కాలమునుగాంచి "తవరూపం మహాకాలో జగత్సంహార కారకః" అనుచు ప్రణమిల్లును. శిల్పిబుద్ధికి అగ్ని హవ్యకవ్యవహుడు. సూర్యుడు "సుధూమ్రా భోగదా విశ్వాబోధినీ ధారిణీక్షమా". చంద్రుడు ప్రజాబిందువు. మృత్యువును గూడ "మహాప్రేతరాట్టు"గ ధ్యానించి ఆతడు బ్రహ్మానందరసనిమగ్నుడగును. కవి నివసించునది దేవతాలోకము. సమస్తదేవతలు ఇంద్రునివలె శిల్పిని దర్శించెదరు. "మహత్ తద్వః కవయ శ్చారు నామా యద్వాదేవ భవతా విశ్వఇన్ద్రే."

శ్రీ వేమన గ్రంథాలయము
వేలప్రోలు (కృష్ణా)



కవి సమదర్శి. దేనిని భేదబుద్ధితో జూడడు. ఏ యంశమును రుజువుచేయుడు. ఏ మతమును స్థాపింపడు. ఏ ధర్మమును నిషేధించడు. వెలుగునీడలను, సుఖ దుఃఖములను, పుణ్యాపాపములను, నిమ్నోన్నతములను, ఉదయాస్తమయములను, సంపద్విపత్తులను, అపథాపథములను, సకలవ్యాపారములను స్పృశించి, వాని యంతరమున జొచ్చి, మధుపమువలె మధుకోశమును గూడబెట్టును. ఒక్కొక శాస్త్రజ్ఞుడు జగత్తు నొక్కొక దృష్టితో జూచును. ప్రకృతిని బహిర్విషయముగ బరిశోధించి సత్యము నన్వేషించునది ప్రకృతిశాస్త్రము. మానవుల వ్యష్టిసమష్టుల పరస్పరాశ్రయత్వమును బరిశీలించి నిరూపించునది నీతిశాస్త్రము. ప్రాణుల పుష్టిపోషణముల కుపకరించు ద్రవ్యపరిశీలనము అర్థశాస్త్రము. జీవజగత్తుల సత్యాసత్యములను వివేచించునది తత్త్వశాస్త్రము. కవితయన్ననో, ఈ ఖండదృష్టులను, ఈ పాక్షికపరీక్షలను అతిక్రమించి అనేకావస్థాతరంగములతో, అనేకరూపఫేనములతో, అనిలోద్ధూత మహాసాగరమువలె ఘూర్ణిల్లుచుండు సంసారసముద్రమును మథించి, అమృతకలశములను వెలికిదీసి లోకమును అమృతసత్రముగా మార్చును. కవిస్పర్శ పరుసవేదివంటిది. మృత్పిండమును సచేతనముగ జేయగల హస్తము వానిది. అది మూగరాతికి మాటలు నేర్పును. రూపరేఖలను సొంపుతో నింపును. వన్నెలలో భావంపుదళుకులను ప్రకాశింపజేయును. పదములను భావగుళికలనుగ మార్చును. రాగవల్లరులపై స్వర్గధామము నధిరోహించును. కవిత జగద్విలాసవర్ణనము.

1933

*

## చిత్రకళ * *

చిత్రరచనకూడ కావ్యకల్పనవంటిదే. అయ్యది ప్రత్యక్ష దర్శనముచే నుపభోగ్యమైనదేకాని, శాస్త్రకారికలచేతను, తర్కవితర్కములచేతను, నిర్వచింపదగినది కాదు. రససృష్టి యుక్తి కలితమైన విషయము. లక్ష్యములుగ నుండదగిన చిత్తరువులను గన్నులార గాంచినప్పుడే వాని సౌందర్యగరిమయు, రసోజ్జ్వలతయు హృదయంగమ మగును. కాని ప్రాచీన చిత్రవిద్యకు నిదర్శనములుగ జూపగలిగిన చిత్తరువులు నేడు విశేషముగ గనుపడనిమాట నిజము. కాలము సర్వమును భక్షింపగలదు. దేవాలయనిర్మాణమువలె, లోహప్రస్తర మూర్తులవలె నాలేఖ్యములు చిరస్థాయులుగ నుండజాలవు. పాషాణనిర్మితములైన దేవాలయములును, చైత్యములును సర్వగ్రాసియగు కాలమునకు బలియగుచుండ, పటములును రంగులును కాలగతిని జీర్ణములయి భ్రష్టములగుటలో నాశ్చర్యము లేదు. నేటికిని నొకవిధముగ నిల్చియున్న ప్రాచీన చిత్రచిహ్నములలోనికెల్ల, నైజాంరాష్ట్రములోని అజంతా గుహాలయందలి కుడ్యాలంకారములే ముఖ్యముగ బేర్కొనదగియున్నవి. ఇవి సుమారు పదునారువందల సంవత్సరముల క్రిందటివి. ఈ గుహలు బౌద్ధభిక్షువుల నివాసమున కేర్పడిన మఠములు. విదేశశిల్పవిదులు కూడ వీనినిగాంచి కరములు మోడ్చి ప్రణమిల్లుచున్నారు. బైరాగుల మఠములయందే యిట్టి యపూర్వకళావైదగ్ధ్యము వెల్లడియగుచుండ ఆనాటి

రాజప్రాసాదములయందును, సంపన్నగృహస్థుల భవనముల యందును, చిత్రకళ యెట్టి పరాకాష్ఠను జెందియుండునో యూకించుక యూహించవచ్చును. అవియెల్ల కాలగర్భమున లీనమైనవి. ఈ అజంతాగుహ లిరువదినాల్గింటిలోను నలుబదిసంవత్సరములక్రిందటివరకు పదునాలుగుహలయందు చిత్రాంకము లుండెడివి. కాని నైజాముప్రభుత్వమువారు వానిని భద్రపరచకపోగా, నిటీవల నొక మహమ్మదీయోద్యోగి వానిని తన యిష్టమువచ్చినట్లు నాశనముచేసివైచెను. తరువాత "డాక్టరు బర్డు" అను కళాభిమాని కొన్ని ప్రతిమలను త్రవ్వుకొనిపోయి బొంబాయి మ్యూజియములో జేర్చెను. నేడాఱు గుహలయందు మాత్రమే చిత్రాలంకారములుగలవు. నిలచియున్నవియే భరతవర్షపు టపూర్వచిత్రరచనావిన్యాసమును దిగంతములకు వేనోళ్ల జాటుచున్నవి. పూర్వకాలమున నిట్టియలంకారములు ప్రతిదేవాలయముననురాజప్రాసాదముననువిలసిల్లియుండెడివి. మాల్వాలోని బాగుగుహల చిత్రములందును, సైగూరియాలో రెండు స్త్రీ చిత్రములందును ఈయజంతాపద్ధతియే గనుపడుచున్నది. ఇటీవల పుదుకోట సంస్థానములో గూడ నొక గుహయం దిట్టి రచనలు కనుపడినట్లు ప్రకటింపబడినది. బౌద్ధయుగము మొదలుకొని మహమ్మదీయయుగమువఱకు ననగా 900 సంవత్సరముల కాలములో నీ చిత్రధార ఫల్గునీనదివలె నంతరించినట్లు కనుపట్టును. కాని యాకాలములో నీవిద్య పూర్తిగ విస్మరింపబడినదని నమ్ముటకు మనస్సొప్పుకొనదు. ఆకాలములో భాస్కర్యవిద్యావిజృంభణ మెక్కువగ జరిగిన మాట నిజము. కాని చిత్రవిద్య విలుప్తమైనదనుట సాహసము. మన యదృష్టవశమున హిమాలయ ప్రాంతముల యందును,

వాని వెలువలను గొన్ని చిత్రము లిటీవల బయలుపడినవి. స్థపిత భాస్కర్యములతోపాటు చిత్రవిద్యకూడ నీదేశమున నధమము రెండువేలసంవత్సరములైనను నుచ్ఛదశను బొంది యుండెననుటకు నాధారములు కలవు. 

బౌద్ధయుగమునకు బూర్వమున నుండిన చిత్రములు మనకేమియు నేడు గన్పడకున్నను, చిత్రకళ వైదికయుగమునగూడ నుండినట్లు టిబెట్ చరిత్రకారుడగు డాక్టరు తారానాధ్ గారు కొన్నిప్రమాణములను జూపుచున్నారు. శిల్పవిద్యలను గూర్చిన కొన్ని ప్రాచీనగ్రంథము లిటీవల దొరకినవి. ఈగ్రంథములు క్రీస్తునకు బూర్వము మూడుశతాబ్దులకు క్రిందటివై యుండునని పురాతత్వవిదుల యభిప్రాయము. ఆ గ్రంథములయందు చిత్రవిద్యయొక్క ప్రాశస్త్యము, లక్షణములు నుద్ఘోషింపబడినవి.

యథా సుమేరుః ప్రవరో నగానాం
యథాండజానాం గరుడః ప్రధానః
యథా నరాణాం ప్రవరః క్షితీశః
తథా కలానా మిహ చిత్రకల్పః.

పర్వతములయందు మేరువు, అండజములయందు గరుడుడు, నరులయందు రాజు, ఎట్లు సర్వశ్రేష్ఠులుగ నెంచబడుదురో, అట్లే చిత్రవిద్య సమస్తకళలలోనికి శ్రేష్ఠమైనదని కీర్తింపబడినది. ఇందొకింత యతిశయోక్తి యుండినను నీ విద్య పూర్వకాలమున మహోదశ ననుభవించియుండవలెనని యూహించుటలో దోషమేమియులేదు. ఈ విద్య యంతకు బూర్వమే ప్రచురముగ లేకున్నయెడల లక్షణగ్రంథములు బయలుదేరుట యసంభవము. రామాయణభారతేతిహాసముల

యందు గృహములు చిత్రములతో నలంకరింపబడినట్లు వర్ణింపబడియున్నది. ఇటీవలి కాళిదాసభవభూతుల నాటకముల యందే కాక, వెనుకటి భాసాదికవులయొక్క కృతులందు కూడ చిత్రకళ పేర్కొనబడియున్నది. ఈ చిత్రవిద్య మొదట బ్రాహ్మణ్య యుగమునందును, పిమ్మట బౌద్ధయుగమునందును, అనంతరము మొగలులయు, రాజపుత్రులయు కాలమునను, రచనావిన్యాసరీతులలో ననేక దశాంతరములను బొందుచుండినను, భరతవర్షముయొక్క విశిష్టలక్షణమగు నాధ్యాత్మికసంపదను మాత్ర మెప్పుడును విడనాడియుండలేదు.

ఈ కలికాలమున నన్నివిషయములలో వలెనే, చిత్రవిద్యయందు గూడ పాశ్చాత్యపద్ధతులే యాదరణీయము లగుచుండుటచే, స్వదేశహితైషులు చిత్రవిద్యయొక్క పూర్వసంప్రదాయమును రక్షించి పోషించుటకు చిత్రకళా ప్రదర్శనములను, సభలను నిర్వహింపవలసివచ్చినది. స్వగృహములో లేని వస్తువును పరగృహమునుండి యెరువు తెచ్చుకొనుట దోషముకాదు. కాని, మన యిలువేల్పగు కళాలక్ష్మి నుత్తర రామాయణమునందువలె నడవిపాలు సేయుట దుఃఖకరము. ప్రాసాదములు, దేవమందిరములు, గృహములు, వస్త్రములు, భూషణములు, పాత్రలు, గృహోపకరణములు, ఆటవస్తువులు—ఇవియవి యననేల, మన కళాలక్ష్మికరకమలముచే స్పృశింపబడని వస్తువేలేదు. బౌద్ధభిక్షులు మన కళాలక్ష్మిని శిరములపై నుంచుకొని, దేశాంతరములకు ద్వీపాంతరములకు గొనిపోయి కళాసామ్రాజ్యమును విస్తరింపజేసియుండ, మన మా తల్లిని సింహాసనమునుండి తొలగించి, యందు తెల్లదొరసానిని నెలకొల్పి యారాధింప జూచుట పరిహాసాస్పదము ! ఇట్టి ఘోరవిపత్తున దగుల్కొ

శ్రీ వేమన గ్రంథాలయము
వేటపాలెం (కృష్ణా)
103

న్నవారికి లోకములో గౌరవముండదు. పేరు ప్రతిష్ఠ లుండవు. లోకములో నెవరును వీరిపై కనికరమునైన జూప జాలరు. నూరు సంవత్సరముల క్రిందట వచ్చిన పాశ్చాత్య సభ్యతయందు దగుల్కొని, శిల్పకళయందు శిక్షను బొందియో పొందకయో, perspective, light and shade, anatomy, realism అను పది ఇంగ్లీషు మాటలను నేర్చుకొని, మహాపురుషుడగు విశ్వకర్మను బుద్ధివిహీను డనుటకు జంకక, పాశ్చాత్యాకాశమునందలి తళుకుబెళుకులకు లుబ్ధులమై పరుగిడుచు, క్రిందుమీదులు గానక పాశ్చాత్య సముద్ర తరంగములయందు బడి నశించుచున్నాము. ఏది చిరకాలమునుండి మనజీవనపు మూలమూలల గ్రమ్ముకొని మన మనముల హరించి యానందము గొలుపుచుండెనో, దేని రసోజ్జ్వలతచే భారతధర్మము దేశాంతరముల బ్రసరింపగలిగెనో, ఏది భారతీయుల యోగసిద్ధికి నిర్వాణప్రాప్తికి సాధనభూతమయ్యెనో, యట్టి కళాలక్ష్మిని ధ్వంసమొనర్చి, పశ్చిమ సముద్రమునందలి యే తరంగమునో యాశ్రయింపజూచుటకంటె ఘోరవిపత్తేమి కలదు? భారతచిత్రకళయొక్క మర్మమును హృదయంగమము చేసికొన దలచితిమేని, మీమాంసలను తర్కవితర్కములను నొక మూలకు దోసివైచి ఒకమారజంతా గుహాలయందలి యక్షయప్రదీపశ్రేణులను తిలకించెదము రండు. సాయంసమయమున దేవాలయములో శంఖారావఘంటానినాదములు మ్రోగుచుండ, తైలదీపములు తారాగణములవలె వెలుగుచుండ, మంగళహారతుల ప్రకాశమున నాలక్ష్మీదేవి ముఖారవిందమును భక్తిపరులమై గాంచెదము రండు.

1917 *

చిత్రకళ

# శిల్పలక్షణము * *

సకలకళాతత్త్వవిదుడగు శ్రీ శుక్రాచార్యుడు

ధ్యానయోగస్య సంసిద్ధ్యై ప్రతిమాలక్షణం స్మృతమ్
ప్రతిమాకారకో మర్త్యో యథా ధ్యానరతో భవేత్
తథా నాన్యేన మార్గేణ ప్రత్యక్షేణాపి వా ఖలు
దేవానాం ప్రతిబింబాని కుర్యా చ్ఛ్రేయస్కరాణి చ
స్వర్గ్యాణి మానవాదీనా మస్వర్గ్యా ణ్యశుభానిచ
అపి శ్రేయస్కరం నృణాం దేవవిలంబలక్షణమ్
సలక్షణం మర్త్యబింబం నహి శ్రేయస్కరం సదా॥

అని, దేవతల బింబములను చిత్రించుటయే చిత్రవిద్యయొక్క పరమలక్ష్యమని నిర్దేశించుచున్నాడు. సలక్షణముగ వ్రాసిన మర్త్యబింబముకంటె, నవలక్షణముగ చిత్రింపబడినను దేవప్రతిమయే శ్రేయస్కరమని వాని మతము. ఇవి ఋషి వాక్యములు. ఈ శ్లోకములందు శిల్పముయొక్క పరాకాష్ఠ నిరూపింపబడినది.

"All Indian Art is a throwing out of self-vision formed by a going within to find out the secret significance of form and appearance, a discovery of the subject in one's deeper self, the giving of Soul-form to that vision, and, a remoulding of the material and natural shape to express the psychic truth of it with the greatest possible purity and power of outline, and the greatest possible concentrated rythmic unity of significance in all the parts of an indivisible artistic whole."

అరవిందఘోషుగారీ పై వాక్యములో శిల్పరహస్యమును గడు హృద్యముగ వర్ణించిరి. అప్రాకృతము, అతీతము, అనావిష్కృతమునైన సత్యస్వరూపమును యోగసమాధియందుపలబ్ధినొంది, ధ్యానధారణలచే రూపకల్పనగావించి, బాహ్యమున శబ్దముననో, రూపముననో, స్వరముననో ప్రకాశింపజేయుటకే కళావిదులు ప్రయత్నించిరి. ఇందు భారతశిల్పులు చూపిన ధైర్యసాహసములును, ధారణాపటిమయు, రచనాకౌశలమును నద్వితీయములు.

భారతశిల్పమునందు మూడుదశలు కలవు. వీనిలో మొదటిది వైదికశిల్పము. ఈ శిల్పమున నప్రాకృతభావము దేదీప్యమానముగ వెలుగుచుండును. చతుర్ముఖుడు, చతుర్భుజుడు, నరసింహమూర్తి, నటరాజు, బోలానాథుడు మొదలగు దేవతావిగ్రహములయందును, శ్రీరాముని నీలమేఘశ్యామతేజమునందును, మురళీధరుని నవనీరదద్యుతులయందును, లక్ష్మీసరస్వతుల రూపకల్పనయందును నప్రాకృతభావము శతముఖముల గన్పట్టుచుండును. వానియందు నిరతిశయానందప్రవాహము తరంగభంగములతో నృత్యముసేయుచుండును. వానిని స్పృశించుటకుగూడ భయము కలుగును. భారతశిల్పము ధర్మప్రపంచమునకు నొసగిన యీ యాభరణముల యమూల్యత నెవరు మఱవగలరు ? వీనిని బహిష్కృతముచేసిన హిందూధర్మప్రపంచము నిస్తేజమును, నిష్ప్రభమునై శ్మశానవాటికవలె గన్పట్టును. భారతీయుడు రూపసాగరమున మునిగి యమూల్యములైన ముత్యములను, మణులను వెలికి దెచ్చి భారతమాతయొక్క మకుటముపై స్థగితములొనర్చి ధన్యుడయ్యెను. అవిలంఘ్యమైనహిమాలయశిఖరముపై కాతడు యోగవిమానముపై నెగిరి యా ధవళశృంగములందు గౌరీ

శంకరులను బ్రతిష్ఠించెను. వాని సాహసమును నిరోధింపగలి గిన దేదియు నీ భూమండలమున లేదు. స్వరముపైన నధిరో హించి పథాపథములనెల్ల తిరిగి తుదకు స్వర్గకవాటమును సహితము భేదించి, యందనవరతము ప్రతిధ్వనించుచుండు గంధర్వ కిన్నరుల దివ్యగీతములను భూలోకవాసులకు వినిపించెను. శిలల దొలిచి, యందుండి రసస్రోతస్వినుల బ్రవహింపజేసెను. లోహదారువులను భావకణికలుగ మార్చెను. శబ్దములతోడను స్వరములతోడను పుష్పక ములను నిర్మించి, సప్తలోకములను సంచారము చేసివచ్చెను. శిల్పమను చింతామణిపీఠముపై నధిష్ఠించి ఇందునిపగిది సహస్రనేత్రములతో విశ్వమునెల్ల పరికించెను. హిందూ శిల్పముయొక్క ప్రతిథ యప్రతిమానము.

బౌద్ధయుగమున శిల్పదేవత స్వర్గధామమునుండి మానవ జగత్తునకు దిగెను. కాని మానవునకు దాస్యముమాత్రము చేయలేదు. కరుణారససమ్రాట్టగు బుద్ధదేవుని శరణుజొచ్చెనే కాని రాజాధిరాజగు నశోకచక్రవర్తిని సహితము కీగంట నైన జూడలేదు. నిశ్చలమగు బుద్ధదేవుని శాంతమూర్తిని ధ్యానము సేయుచు, నిర్వాణపదవిని వెల్లడించెను. బౌద్ధ శిల్పముయొక్క స్వాతంత్ర్య మప్రతిహతము! దేశము నలు గడలను ధర్మస్తంభములను నాటినను వానిపై నశోకుని శిలా విగ్రహ మొక్కటైనను గనుపడదే! ఏ గుహాయందును వాని చిత్తరువు లేదే! రాజులు శిల్పము నాశ్రయించిరి కాని, శిల్పము రాజుల నాశ్రయించలేదు. వచ్చిపోవు ప్రతి గవర్నరు నకు శిలాప్రతిమలను కంచువిగ్రహములను చిత్రపటములను నెలకొల్పు నాధునికశిల్పముయొక్క దాస్యమును దలచుకొనిన, నేటి యధఃపతనము మనోగతమగును. సింహములను సహి

తము దయారసస్వరూపములుగ మార్చివైచిన బౌద్ధశిల్పము యొక్క విజయ మకుంఠితము. బ్రాహ్మణ్యయుగములో స్వర్గ ధామమునందు నివసించుచుండిన కళలు, బౌద్ధయుగమున ధరా తలమునకు దిగినను, దృష్టిని మాత్రము స్వర్గమువైపునుండి మరల్చలేదు.

అశోకచక్రవర్తిని క్రిగంటనైన జూడనొల్లని శిల్పము మొగలుసామ్రాజ్యమునందు పాదుషాల యంతఃపురముల విహరింపజొచ్చెను. అప్పుడైనను దానిస్వరూపము నష్టము కాలేదు. మొగలుయుగమందు చిత్రింపబడిన పటములు కేవలము పాదుషాలయొక్కగాని, వారి బేగములయొక్కగాని చిత్తరువులు గావు. అవి మొగలుసామ్రాజ్యలక్ష్మియొక్క ధ్యానరూపములై విలసిల్లెను. షాజహానుచక్రవర్తి ప్రభుత్వము నందు శిల్పము సంపూర్ణవిముక్తి నొందెను. మృత్యువుయొక్క మహాస్వప్నము విశుద్ధచంద్రకాంతశిలారూపమున యమునా నదీతరంగనిస్వనములతో శ్రుతిగలుపుకొని

త్వమసి మమ శరణం । త్వమసి మమ జీవనమ్ ।

అను నమరగానమును లోకములకు వినిపించుచున్నది. భారతశిల్పమునందు విషయపరిభేదము చేతను, పద్ధతి వ్యత్యాసము చేతను ననేకశాఖలేర్పడినను నవి యెప్పుడును నప్రాకృతభావమునుమాత్రము వదలక, యూర్ధ్వముఖములై యుండెను. భారతశిల్పముయొక్క యుపాస్యదేవత యంత ర్జ్యోతి. స్మృతికల్పనలు పార్శ్వదేవతలు. ధ్యానధారణలు సాధనములు. రసోజ్జ్వలత సాఫల్యము. భారతకళలన్నియు భావమూలకములైనను, వాని వాని వివిధపరికరములచే, విషయనిర్ణయమునందును, రచనావిన్యాసమునందును గొంత

ప్రభేదముండుట యనివార్యము. శిలాలోహములయందు వెల్లడియగు రసోజ్వలతకును, రేఖా వర్ణికా భంగములందు వ్యక్తమగు రసోజ్వలతకును భేదము కలదు. ఘనిష్ఠములగు శిలలయందు, లోహములయందు నచలత, నిశ్చలత, శాంతము, గాంభీర్యము, అమరత్వము మొదలగు భావము లెక్కువగ నొప్పును. చిత్రపటములలోని రూపరేఖావిన్యాసములందు విలసనము, తరళత, శృంగారము, ఉల్లాసము, క్రీడ, సంచార శీలము, మృదుత్వము మొదలగు భావలతికలు రమణీయము లగును. ఈకారణముచేతనే జనసామాన్యమును చిత్రపటము లాకర్షించినంతగ శిలావిగ్రహములును, లోహప్రతిమలు నాకర్షింపజాలవు. చిత్రవిద్య వర్ణరంజిత మగుటచే నందు రూపసంపద ఎక్కుడుగ నలరారును. కాని భారతచిత్రవిద్య భాస్కర్యము ననుసరించియే యుండెను గాని విషయలంపటత్వమున జిక్కుకొనలేదు. ఇంద్రియానుభూతిద్వారమున నతీంద్రియధామసాక్షాత్కారమే యుభయవిద్యలకు పరమలక్ష్యము.

పాశ్చాత్య శిల్పకారు డింద్రియగోచరమగు వస్తుజగత్తును విడనాడడు. వస్తుజగత్తు నెప్పుడును గంటిముందర "మాడెల్"గ నుంచుకొని దాని ననుకరించుటకే తన కౌశలమునంతయు నుపయోగించును. ఇంద్రియములకును మనస్సునకును సన్నిహిత సంబంధముండుటచే నింద్రియానుభూతి కలిగినప్పుడు భావసంచారముకూడ గలుగుట సహజము. పాశ్చాత్యశిల్పి యీభావప్రపంచమున జిక్కుకొని వస్తుజగత్తును విడనాడుదు నేమో యను భీతితో నెప్పుడును భావమును నిగ్రహించుకొని వస్తువు నంటియుండును. వస్తురూపము నుల్లంఘించకుండుటకై perspective, light and shade, నియమములను గల్పించుకొనెను. గ్రీకు ఆర్టులో గొంత భావప్రవణత

యున్నను, నది వాస్తవమునకు దాస్యము సేయుచు నేయుండెను. వారి idealism మానవుని లోకాతిశాయిరూపము (superman)ను సృష్టించుటయే కాని మానవుని యాత్మస్వరూపమును వెల్లడించుటకాదు. వారి దేవతలు magnified men.

వాస్తవజగత్తులో ననింద్యమైన రూప మసంభవ మగుటచే, కల్పనాశక్తిచే మానవునియొక్క భౌతికవిగ్రహము ననింద్యమైన పరిపూర్ణాంగసౌష్ఠవముతో వారు చిత్రించిరి. ఆప్రతిమలయందు వాస్తవజగత్తుయొక్క పూర్ణవికాసమే కనబడునుగాని, వాస్తవ జగదంతరమందుండు నశబ్దమరూప మవ్యయమునైన తేజమును బ్రతిబింబింపజేయలేదు. క్రైస్తవధర్మప్రాదుర్భావకాలమున రాఫెలువంటి సిద్ధహస్తులు ప్రాణముయొక్క యాంతర్యమును వెల్లడించుటకు బ్రయత్నించిరి. బాలక్రీస్తురూపమునందలి కోమలత్వము, మెడోనాయందలి మాతృస్వరూపము నాదర్శరూపములే కాని వాస్తవికములుకావు. కాని వానిరచనా పద్ధతియందు గూడ వస్త్వనుకరణమే యెక్కువగ గన్పట్టును. భావవిలసనమును స్నాయువులయుత్తేజనమూలమున చిత్రించుటయే కాని, దేహమును భావముచే గప్పివైచి తదనుగుణముగ దానిని మార్చగల సాహసము వారియొద్ద లేదు. వస్తువుయొక్క యాకృతిని మార్చుట వారి దృష్టిలో చిత్రదోషము.

వస్తువుయొక్క యాకృతిని మార్చవలసిన యవసరము గూడ వారికి లేదు. ఎంతవరకును ప్రాణులయొక్క బాహ్యచేష్టలను స్నాయువుల యుత్తేజనద్వారమున ప్రకాశింపజేయు భావోద్దీపనమే గాని ప్రాణముయొక్క బాహ్యక్రీడ నతిక్రమించి దాని మర్మమును భేదించగల విద్యుత్కటాక్షము పాశ్చాత్యశిల్పుల యందు వికసించలేదు. కావుననే వారి చిత్తరువులలో Theatrical poses యెక్కువగ గన్పట్టును.

శ్రీ వేమన గ్రంథాలయము
వేటపాలెం (కృష్ణా)
111

భారతశిల్పి స్వతంత్రుడు. వస్తువుయొక్క యాకృతిని తన యిష్టమువచ్చినట్లు మార్చగలడు. భావము వస్తువునకు దాస్యము చేయుట కెంతమాత్రము నొప్పుకొనడు. వస్తువును భావప్రాబల్యముచే రూపాంతరము నొందించును. అస్థిసంస్థాన విద్యకు (anatomy) కట్టుబడడు. భారతచిత్రకారుడు చిత్రించు నది భావముయొక్క పరిమాణము, భావముయొక్క లావణ్యము, భావముయొక్క సాదృశ్యము. వస్తువు భావము ననుసరించుచుండవలసినదేకాని భావము వస్తువునందుబంధింపబడదు. పాశ్చాత్యశిల్పులు వాస్తవజగత్తు నొక బందిఖానాగా జేసికొని యెంతవరకును దాని యావరణలో దిరుగుటయేకాని దాని ద్వారమును దెరచి, విముక్తులగుటకు జూడరు. భారతశిల్పి యీ వాస్తవజగత్తును "పద్భ్యాం పృథ్వీ" దేవతలకు బాదపీఠముగ జేయగలిగెను. వారిని జగత్తులో బంధించలేదు. కమలములపై లక్ష్మీదేవి నధిష్ఠింపజేసెను. నాగముపై చతుర్భుజుని బరుండబెట్టెను. వృషభముపై శివుని గూర్చుండబెట్టెను. వటపత్రమున నారాయణుని నిలిపెను. హంసపై సరస్వతి నూరేగించెను. విష్ణువును జతుర్భుజుని జేసెను. భూలోకముపై స్వర్గకాంతులను బ్రసరింపజేయుటయే భారతశిల్పలక్షణము.

1926

## కళాసృష్టి * *

వేదమునం దీ గాథ కలదు.

కొండొక కాలమున నొక బ్రాహ్మణుని కుమారుడు చనిపోయెను. తండ్రి దుఃఖార్తుడై యమునియొద్దకు బోయి, తన పుత్రుని తిరిగి యొసంగవలసినదని వేడుకొనెను. కాని యముడు వాని ప్రార్థనము నంగీకరింపలేదు. అంతట బ్రాహ్మణుడు బ్రహ్మయొద్దకు జని తనకుమారుని యమపాశములనుండి విడిపింపుమని యాక్రందనమొనర్చెను. పంచభూతవిలీనమై పోయిన కుమారుని శరీరము తిరిగి యెక్కడనుండివచ్చును? ప్రాతరూపము విలుప్తమైనది. కాని యావృద్ధుని దుఃఖోపశమనార్థము బ్రహ్మ యాకుమారుని రూపాంతరము నొసగెదనని సమాధానము చెప్పెను. అంతట బ్రాహ్మణుడు వివేకము తెచ్చుకొని యందులకు సమ్మతించెను. అప్పుడు బ్రహ్మ వానికి కుంచెను, రంగులను జేయు విధము నుపదేశించెను. ఆ బ్రాహ్మణుడంతట తన హృదంతరమున ముద్రితమైయున్న కుమారుని రూపమును ధ్యానించి, దానిని పటముపై రంగులతో జిత్రించెను. బ్రహ్మ యంతట నా చిత్తరువునకు జీవమును బోసెను. ప్రతిమకు ప్రాణప్రతిష్ఠ కలిగెను.

ఈ గాథ ఐతిహాసికముగాదు. ఇది అర్థవాదమువంటిది. చిత్రకళారహస్యమంతయు నీ కథయందు గర్భితమైయున్నది. ఇందు ముఖ్యముగ రెండంశములు ద్యోతకమగుచున్నవి. చిత్త

రువు బాహ్యవస్తువుయొక్క రూపపటము కాదు; ఫోటోగ్రాఫ్ కాదు; నకలుకాదు; అనుట మొదటి యంశము. చిత్తరువు హృదంతరమున ధ్యానముచే సాక్షాత్కరించు దివ్యరూపము యొక్క ప్రకాశము అనునది రెండవయంశము. పుత్రుడు మరణించెను. ఎంతకాలమునుండియో యింద్రియములకు బరిచితమైన యావస్తు వికకనుపడదయ్యె. దిక్కులు శూన్యము లయ్యెను. సర్వము నంధకారమయమై దుర్భరమయ్యెను. ఇంద్రియములు తిరిగి వానిని బొందుటకు బరితపించుచున్నవి. ఈకన్నులా కోమలగాత్రుని వెదకుచున్నవి. ఆమధురవాణిని గ్రోలుటకై శ్రోత్రపుటములు ఆతురపడుచున్నవి. చల్లని పుత్రాలింగనసౌఖ్యమునకై యీ బాహువులు పరితపించు చున్నవి. వెదకి వెదకి యింద్రియములు విఫలప్రయాసయందు మూసికొనిపోయెను. ఇంద్రియరాజ్య మంతర్ధానమయ్యెను. ఈ వియోగము దుస్సహము. హృదయమున ప్రచండమైన దుఃఖాగ్ని ప్రజ్వలించుచున్నది. దుఃఖజ్వాలలచే నీ యంధ కారము మఱింత దట్టమగుచుండెను. తిమిరములు దట్టమైన కొలదియు నుచ్ఛ్వాసనిశ్వాసము లాగిపోయెను. హృదయ స్పందనముకూడ నిలచిపోయెను. నిబిడాంధకారమున జిత్తము నిస్తరంగమైన మహానిస్తబ్ధతయందు మునిగెను. ఆనిశ్చలసాగ రముపై స్వర్గమునుండికాబోలు మందపవనములు వీవసాగెను. మెల్లగ నొక యుత్తుంగతరంగము తేజోమయమై యుద్భా తము కామొదలిడెను. ఆ తేజము సహస్రదళపద్మాకారమున రూపొంది, దళములు విప్పుకొనసాగెను. అట్లు వికసించిన స్మృతిగర్భమునందొకదివ్యశరీరి శిరమున నమృతకలశమునిడు కొని ప్రత్యక్షమయ్యెను. ఎట్టి దివ్యదర్శనము! కన్నులెప్పుడును నట్టిరూపమును జూచి యెఱుగవు. తను వట్టి శరీరమును

స్పృశించు భాగ్యము పూర్వమెన్నడును గలుగలేదు. కర్ణము లట్టి గానామృతమును గ్రోలియుండలేదు. ఈ రసన యట్టి సుధ నెప్పుడును జవిచూడలేదు. ఏమి యీ స్వర్గసౌరభము! నాసికాపుటములు తనివితీరక యాఘ్రాణించుచున్నవి. హృదయము పల్లవించుచున్నది. ఆ యమృతకలశమునుండి వాత్సల్యసుధ ప్రవహింపసాగెను. అపూర్వానుభవము! బ్రహ్మకృపచే తండ్రికి పుత్రసాక్షాత్కారమయ్యెను. మృత్యుచ్ఛాయలు పటాపంచలయ్యెను. జనకు డానందభరితుడై పుత్రుని యమరరూపమును, దివ్యశరీరమును, స్వర్గజ్యోతిని, ధారణచేసి బ్రహ్మకృపచే సిద్ధించిన కుంచెతోడను, రంగులతోడను దాని ప్రతిబింబమును జిత్రించి కళాస్రష్ట యయ్యెను.

ఇదియే చిత్రకళారహస్యము. ఈచిత్రకారుడు రచించినది తనపుత్రునిభౌతికవిగ్రహముయొక్క ప్రతిరూపము కాదు. భౌతికవిగ్రహము చంచలము, క్షణభంగురము. నిన్నటి రూపము నేడు లేదు. నేటి రూపము రేపుండదు. జనకుడు కోరునది పుత్రుని నిత్యరూపమునుగాని యనిత్యమైన శరీరమును గాదు. పుత్రుని నిత్యరూప మింద్రియరాజ్యమునందు గోచరము కాజాలదు. ఇంద్రియములకు గోచరమగునది యీ నిత్యరూపముయొక్క ఒకదిక్కు, ఒక లేశము, ఒక కిరణప్రసారము మాత్రమే. దాని మరుగున, దాని కతీతమైన పుత్రుని నిత్యరూపము నిండువెలుగుతో విరాజిల్లుచున్నది. ఇంద్రియముల నతిక్రమించిన గాని యీనిత్యరూపము సాక్షాత్కారము కాజాలదు. కావుననే జనకుడు తన దృష్టిని బయటినుండి మరల్చి హృదంతరమునందు బఱపెను. అంతరంగమున రెండు శక్తులు గలవు. ఒకటి స్మృతి. ఇందు పూర్వపరిచయమంతయు వాసనారూపమున నంకితమైయున్నది. పుత్రుని బాల్యలీలలు,

పుత్రుని యౌవనోద్దామముయొక్క యావేగము స్మృతియం దాబద్ధములైయున్నవి. రెండవది కల్పనాశక్తి. ఈశక్తియందు భావికాలపు స్వర్ణస్వప్నములు, నాశాకిరణములును విలసిల్లు చున్నవి. ఎప్పు డింద్రియరాజ్యమును వీడి యంతరంగము నాశ్రయించెనో, యప్పుడు స్మృతిచేతను, కల్పనాశక్తిచేతను తండ్రి, తన పుత్రుని స్వభావమును స్వరూపమును, వాత్సల్య పరిభావమున బ్రత్యక్షము చేసికొనగలిగెను. తండ్రి సృష్టిం చిన యీరూపము ధ్యానధారణలచే ప్రేమచక్షువులకు గోచరమైన, జరామరణములు లేని దివ్యరూపము. బాహ్య మును పరివర్తనశీలము నైన పాంచభౌతికశరీరము గాదు. రసానుభవమును రూపద్వారమున బ్రకాశింపజేయుటయే కళ. కల్పనయందు ప్రకాశించు సౌందర్యమును సత్యముపై బ్రతి ష్ఠించుటయే కళాప్రయోజనము. మన మింద్రియతరంగఫేన ములో జిక్కుకొని ప్రాణముయొక్క రసోన్మేషణము నుపభో గింపలేకున్నాము. ఎప్పుడు బాహ్యమునువీడి భావకైలాస శిఖరము నధిరోహించి మానససరోవరమునందలి సుధారస మును జవిచూచెదమో యప్పుడు మన యింద్రియములకు నూతన దివ్యదృష్టి వికసించును. సకల వస్తువులయొక్క మర్మము వెల్లడియగును.

రసమునకును ఇంద్రియములకును ఘనిష్ఠమైన సంబం ధము గలదు. మనమున రసోదయమైనప్పు డింద్రియములు ప్రఫుల్లములై నూతనలోకమును గాంచగలుగును. ఆపుష్పము నట్టి రసదృష్టితో జూడుము! ఆకుసుమగర్భమువనున్న వసంత లక్ష్మి కుంభములకొలది స్వర్గపరిమళము నెట్లు గుమ్మరింపు చున్నదో! విశ్వమంతయు కుసుమదర్శనముచే ముగ్ధమగు చున్నది! మనకనులు చూచునది పుష్పముయొక్క బాహ్య

రూపము. శిల్పి యీ మాయను దాటి తన్మయత్వములో మునింగి పుష్పముయొక్క విశుద్ధరూపమును గాంచగలుగును. శిల్పియొక్క యంతరంగమునకును, పుష్పముయొక్క యంతరంగమునకును జరగురసలీలయే శిల్పరచనమునకు విషయము. అంతియకాని ఇంద్రియగోచరమగు జడవస్తువుగాదు. ఇట్టి యుజ్జ్వలావస్థను బొందనివారికి దేవతాసాక్షాత్కారము కాజాలదు. దేవత లెక్కడనో లేరు. వారు మనతో సతతము క్రీడించుచున్నారు. గిరులయందు గిరిదేవత, నదీనదములందు నదీదేవత, తరులతాగుల్మములందు వనదేవత, దంపతులయందు రాధాకృష్ణులు, పుత్రునియందు గోపాలబాలుడు—జగత్తునందంతటను దేవతలు నిత్యము విహారము సేయుచున్నారు. ఈ ఇంద్రియరాజ్యము నతిక్రమించుటతోడనే శూన్యమున బడిపోవుదు మని భయపడెదము. ఆకథలోని బ్రాహ్మణుడు తనపుత్రుడు మరణించుటతోడనే యట్టి జడత్వమునకు లోనయ్యెను. కాని ఈశ్వరప్రేరణచే నామాయ తొలగెను. "సర్వేంద్రియ గుణాభాసం, సర్వేంద్రియ వివర్జితమ్" ఈఇంద్రియగ్రామము బయట నున్నది శూన్యము కాదు, అంధకారము కాదు. "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అది నిండువెలుగు. అయ్యది సర్వేంద్రియములయొక్క చరమసిద్ధి; పరమసాఫల్యము. ఇంద్రియరాజ్యమునుండి దేవతారాజ్యమునకును, పృథివినుండి స్వర్గమునకును, మృత్యువునుండి యమృతపదవికిని గొనిపోవుటకు బ్రహ్మనిర్మించినయానందసేతువే యీశిల్పము, యీకళాసృష్టి.

1917

*

ZA'119

# శిల్పప్రయోజనము * *

కళా ప్రయోజనమును నిరూపించుటలో నెన్నియో మతభేదములున్నవి. మానవునకు వ్యవహారజ్ఞానము నొసంగునదియు, కాంతాసమ్మితముగా యుక్తాయుక్తముల నుపదేశించునదియు, కార్యోత్సాహమును బుట్టించునదియు కళయని కొందరి తలంపు. సాంసారిక తాపత్రయమువలన జీవనము దుర్భరమైనప్పుడు, వ్యక్తినిగాని సంఘమునుగాని బంధించివేయు శృంఖలము లతికఠోరములైనప్పుడు, మానవుని మనస్సును పరాధీనతనుండి తప్పించి, యానందధామమునకును, స్వప్నగృహమునకును దీసికొనిపోవు సద్యఃపరనిర్వృతియే కళల ప్రయోజనమని కొందరి యభిప్రాయము. అమంగళమును తొలగించి, మేలును, శుభమును నొనగూర్చుటయే కళల యుద్దేశ్యమని మరికొందరి యాశయము. ఈ మతములందు సత్యము లేకపోలేదు. కాని యివియన్నియు కళల బాహ్య ప్రయోజనములను దెలుపునేకాని వాని యాంతర్యమును దెలుపవు. మనస్సునకు చమత్కారమును, నానందమును గూర్చుటయే కళల ముఖ్యోద్దేశ్యమైనచో, వాని స్వాతంత్ర్యధర్మమే నశించును. కళల ప్రయోజన మింతకంటెను నెక్కువ యున్నతమైనది. నిజము నరసితిమేని మానవహృదయమునుండి బయల్వెడలుటకంటె వాని కన్యసార్థకత లేదు. సత్యము సుందరమైనప్పుడు, భావము పంజరమునుండి ఎగయు విహంగమువలె విముక్తినొంది యనంతపథమును ద్రొక్కును.

మానవప్రకృతి యుజ్జ్వలితమైన వెంటనే ప్రాణము నృత్యము సేయును. ఆత్మయొక్క నిజసౌందర్యము బహిర్గతమగును. భవబంధములనుండి విముక్తినొందు భావము,—ప్రాణవిలసనము మూలమున వ్యక్తమగు నాత్మసౌందర్యము—కళలయందు మూర్తీభవించుచున్నది. కళయన రససృష్టి; కళయన విశ్వాంతరాళమునుండి వెలికివచ్చు నమృతకలశము.

మానవుని సామాన్యజ్ఞానమునకు విశ్వములోనియనంత రహస్యము గోచరముగాదు. ప్రకృతిగతమైన యాత్మకును, మానవాత్మకును ననవరతము జరగుచుండు రమ్యక్రీడ శుద్ధమానవచింతకు గోచరమగు విషయముగాదు. విశ్వశక్తియొక్క మూర్తిస్ఫురణయు, కామాతీతమగు రసమాధుర్యమును, ప్రాకృతేంద్రియములకు లభ్యమగుటలేదు. విశ్వముయొక్క బహిర్ద్వారములు బంధింపబడియుండుటచే విశ్వాంతరమున నిర్మలకాంతితో వెలుంగు నాత్మానందము సామాన్యులకు ప్రాప్యము కాకున్నది. ఈ బహిర్ద్వారములను దెరచి, యందలి యాత్మస్వరూపమును జూపగల తాళపుజెవియే—విశ్వాత్మయొక్క మూర్తిస్ఫురణను చర్మచక్షువులకు గోచరింపజేయు జ్ఞానాంజనమే—యీ కళ.

సృష్టివైచిత్ర్యములను దిలకింపుడు. అందు గన్పడు ప్రతిపత్రము, ప్రతివర్ణము, ప్రతిరూపము, ప్రతిస్వరము నాత్మయొక్క ప్రతిబింబమై గోచరించును. కాని మన కన్నులు జగత్తుయొక్క యంతరాళమున జొరలేకున్నవి. మన దృష్టి భ్రమరముభంగి రూపముల బాహ్యముననే తిరుగాడుచున్నది. కళ విశ్వముయొక్క రూపములయొక్క యాంతర్యమును, వాని వక్షస్థలమునుండి పైకి పెకలించుచు, మనము మాయ యని భ్రమనొందు ప్రపంచముయొక్క యథార్థరూపమును వెల్లడి

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)



సేయును. మన కంటికి నగపడు పదార్థములలో నిగూఢమై యున్న ద్వైతాద్వైతముల యచింత్యరహస్యత్త్వమును మన నేత్రములకు గనుపఱుపగలుగును. శబ్దస్పర్శరూపరసగంధ ములలోని సత్యమును మన ప్రాణపటమున ముద్రితమొనర్చును. కావున ప్రతిరూపమునందును, రసమునందును నున్న లీలను ధ్యానించుటచే గలుగు ననుభూతియే కళావిభూతి యని చెప్ప నగును. అంతియకాని, కళయన కచేరులలో నృత్యము సేయు వేశ్యవంటిది కాదు. ఇంద్రియములకు సుఖమును వినోదమును సమకూర్చు నైంద్రజాలికునివంటిదికాదు. ఎవరు స్వకీయ జీవనమునందలి సత్యమును సాక్షాత్కార మొనర్చుకొనగలరో, యెవరి చిత్తము భగవదాయత్తమై, పరానురక్తిప్రవాహమున నిమగ్నమై యుండునో, యెవరిభావము దేహమనఃప్రాణముల నతిక్రమించి ప్రేమరసమున పారవశ్యమునొందునో వారే కళా విదులు, వారే రసస్రష్టలు, వారే కవులు, శిల్పులు, గాయ కులు, చిత్రలేఖకులు, విగ్రహనిర్మాతలు కాగలరు.

మనస్సెప్పుడును సత్యపదార్థమును సుందరముగ జేయు టకై కోరుచుండును. ప్రాణము వట్టి భావములతో దృప్తి నొందదు. అందువలననే మానవుని ప్రాణము రూపరసము లను భోగింపజూచుచుండును. కాని యిందు దోషముగలదు. ఏలయన, రూపరసములు స్వతంత్రములుకావు. స్వతంత్ర ములు కాని విషయములలో మనస్సు చిక్కుకొన్నప్పుడు భోగ సంబంధమైన దాస్యము వాటిల్లును. కావున ప్రాణముయొక్క స్వభావస్ఫూర్తి కాటంకము గలుగును. అందువలన నాభో గము సౌందర్యదూరీకృతమగును. స్వభావసిద్ధమైనగతియు, స్ఫూర్తియు నున్నప్పుడే యే పదార్థమైనను రమణీయమై, సౌందర్యమయమగును. ఏది రసోద్దీపనమునుగావించునో

యదియే సౌందర్యము. అదియే రసానుభూతి కాలంబనము. రసానుభవములో వస్తునిష్ఠమగు రసాంగములకు సంబంధము గలిగినప్పుడు, మన యందొక్క రూపముద్వారమున, సర్వ రూపముల యాభాసయు నుద్దీపితమగును. అప్పుడది సుందర రూపమును ధరించును.

ఈ విశ్వము జడముగాదు. జడత్వము మన మనస్సునందున్నది. మన మనస్సుయొక్క వ్యభిచారదోషము వలన, రూపమాధుర్యములందుండు దివ్యసుందరుని జడునిగ జేసి, విశ్వము జడమని చెప్పుచున్నాము. ద్రవ్యముల అంగాంగీభావమున నే రూపసృష్టి జరుగుచున్నది. కావున నే ప్రతిరూపము నందును నాత్మయొక్క మధురరస ముప్పొంగుచున్నది. "సర్వేషాం భూతానాం మధుః" ఈమధురరసము నాస్వాదించినప్పుడే రూపములు సౌందర్యమయములగును. ప్రతిమానవునకును రూపములయెడల సహజలాలస గలదు. కారణమేమి? రూపములలోని దివ్యసుందరమూర్తిని జూచుటకై మానవుని ప్రాణము సదా వ్యాకులత నొందుచుండును. ఇంద్రియచాంచల్యమునకు సార్థకత అందే కలదు. తుమ్మెదవలె మన యింద్రియములు రూపమాధుర్యమును జవిచూచుటకై రూపములనెడి పుష్పములపై సతతము వ్రాలుచున్నవి. రూపములలోని మాధుర్యమును గ్రోలలేక యింద్రియము లతిచంచలములగుచున్నవి. భక్తులయు కవులయు కళాస్రష్టలయు ప్రాణములుద్దీపితములైయుండుటచే, వారి యిందిృయములు రూపములోని మాధుర్యమును గ్రోలి, తన్మయత్వము నొందుచున్నవి. రూపములలోని సుందరుని, మాధుర్యమయుని, రసస్వరూపుని వ్యక్తీకరించుటయే కళాసృష్టి. కళావిదుల దృష్టిలో, మనకు జడములవలె గన్పట్టు రూపములు, రూపాంతరమునొందును,

చిన్మయములగును, ప్రాణకణికలగును. ఏ భావములు మానవాంతఃకరణమున నిద్రాణములైయున్నవో, యేరసములు మానవుని ప్రాణరంగమున దృశ్యాదృశ్యముగ ఖేలనంబొనర్చుచున్నవో, యేప్రాణము సంకల్పవికల్పములయందు స్నేహదాస్యవాత్సల్యమాధుర్యాది మహాభావరసములందు, జననమరణములందు, తరంగాయితమై ప్రవహింపుచున్నదో, ఆ భావములు, ఆ రసములు, ఆ సమగ్రజీవనము నిఖిలరసామృతమూర్తి నాశ్రయించి, రూపాంతరము నొందు నవస్థావిశేషమే కళల కాశ్రయము. అందే కళల సృష్టి. రూపములోని సచ్చిదానందస్వరూపము, దేహమనఃప్రాణములతో భోక్తృభోగ్యసంబంధమున జూపు లీలావిలాసమును బ్రకాశింప జేయుటయే కళలయుద్దేశము. ఆ సాధనయే కళలచరిత్ర.

ప్రాకృతసృష్టికంటె కళాసృష్టి యతినికృష్టమైనదని కొందఱు చెప్పుదురు. ఏలయన, ప్రాకృతసృష్టి సజీవము, ప్రాణమయము; మానవసృష్టి ప్రాణవిహీనము, నిర్జీవము, నని వారితలంపు. కళాసృష్టికి దారువు, శిల, పటము, వర్ణము, స్వరము మొదలగునవి యుపాదానములు, నుపకరణములును. ఇవి నిజముగ మృతములును కావు. కేవల మీపదార్థముల వలననే చిత్రకళ సృష్టింపబడుటయు లేదు. ఆత్మానుభూతియే రూపకల్పనకు బ్రాణప్రతిష్ఠను గలిగించుచున్నది. అనుభవము విశ్వగతమగు ననంత ప్రాణసాగరములోని తరంగము. అందువలననే కళ, దారుశిలాలోహముల నతిక్రమించి, సజీవమగుచున్నది. సృష్టియం దేసత్యమును జూచుటకు బ్రయత్నింతుమో, ప్రకృతియం దేసృష్టిని సచేతనమనితలచుచున్నామో, కళయు దానినే యాశ్రయించి నవనవరూపముల జీవనసౌందర్యమును ధరించును. ఇందువలననే, కళాసృష్టి శ్రేష్ఠమగుచున్నది.

1926 *

# నీతివాదము * *

కళావిదుడెవ్వడు నుపదేశికుడు కాడు. ఒక నీతిని బోధించుటకుగాని, యొక ధర్మము నుపదేశించుటకు గాని, తన కళ నెప్పుడును వినియోగింపడు. నీతులు, ధర్మములు దేశకాలములనుబట్టి మారుచుండును. ఒక్కొక కాలమునం దొక్కొక ధర్మము జనుల నాకర్షించును. శిల్పి తదనుగుణముగ తన కళను మార్చుకొని యెరుగడు. దేశకాలముల కతీతమైనది శిల్పము. శిల్పి యీ వ్యావహారికజీవితమునందు సతతము మారుచుండు పుణ్యాపాపములు, సుఖదుఃఖములు, ఉచ్చనీచములు మొదలగు ద్వంద్వములలోని నిత్యసత్యము యొక్క విచిత్రలీలనుదర్శించి పరమానందభరితుడగుచుండును. శిల్పము లోకకల్యాణమునకు సహకారిగా నుండవచ్చును. కాని యంతమాత్రముచేత శిల్పి యా కార్యమునకు బంధింపబడి యుండునని తలంప జనదు. అట్లు బంధింపబడిన యెడల జ్ఞానము కుంఠితమగును. జగత్తునందలి యనంత రహస్యము సీమాబద్ధమై మఱుగువడును. ఈశ్వరుని విచిత్రరససౌందర్య లహరి మానవనేత్రములకు గోచరింపక, దాని యాస్వాదనమే యసంభవమగుట తటస్థించును.

శిల్పము నీతిబద్ధమగునా, కాదా యను చర్చకు గడంగునప్పుడు రస మనంతవిధము లను విషయమును మఱతుము. నీతివాదులబోలి, భగవంతున కొక పరిచ్ఛిన్న రూపము గల్పించి, లోకనీతియను నొక కొలతబద్దతో శిల్పము

యొక్క మూల్యమును, ప్రయోజనమును, నిర్ణయించుటకు గడంగుదుము. సామాజికనీతి, రాజనీతి మొదలగు వ్యావహారిక ధర్మములకుగూడ శిల్పమును దార్వ బ్రయత్నింతుము. మానవుని యాత్మోన్నతి కొఱకు భగవంతుని విశేషరూపములను దేశకాలపాత్రములననుసరించి యారాధించవలసి యుండును. అందుమూలమున సాంఘికరాజకీయ విషయములందు విశ్వాసము గలుగవచ్చును. కాని యా విషయములు శిల్పముయొక్క యాంతర్యమును దెలుపజాలవనుటమాత్రము నిశ్చయము.

శిల్పమునకు మూలాధారము సత్యము. సత్యము మారునదికాదు. అయ్యది నిత్యమై సర్వగతమైనది. బుద్ధికి గోచరమగు సత్యము నిజముగ సత్యముకాదు. ఒకరి బుద్ధికి సత్యముగ దోచిన దింకొకరికి సత్యముగ దోచదు. ఒక కాలమునందు సత్యముగ తలంపబడునది యింకొక కాలమున సత్యముగ దలంపబడదు. మనబుద్ధికి గోచరమగు సత్యము సతతము మారునదే కాని నిర్వికల్పమైన యఖండసత్యముకాదు. అటులనే మనబుద్ధి నిర్ణయించు పుణ్యము, సౌందర్యము, ఆనందము శాశ్వతమైనవికావు. మానవునిబుద్ధి సత్యాసత్యములు, పుణ్యాపాపములు, సుఖదుఃఖములు, సౌందర్యాసౌందర్యములు మొదలగు ద్వంద్వములమధ్య తిరుగుచుండును. కాని సత్యమీ ద్వంద్వముల కతీతమయ్యు నీ ద్వంద్వములందు గూడ నంతర్గతమైయున్నది. ప్రతివస్తువునందు నంతర్గతమైయుండునిత్య సత్యమును, రసపూర్ణతను వెల్లడించుటకే శిల్పి యెప్పుడును చూచుచుండును. నిత్యమగు విశ్వలీల తాత్కాలికులగు నీతివిదులకమంగళకరముగను, పాపభూయిష్ఠముగను దోచవచ్చును. అట్లని యది యీశ్వరలీల కాదని మాత్రము చెప్పకూడదు.

జగత్తులో జరుగుచుండు ప్రతివిషయమును సత్యము నాశ్రయించుకొనియే ప్రకాశించుచున్నది. సత్యమే యావిషయము యొక్క సౌందర్యము. పుణ్యపాపములు, ధర్మాధర్మములు వివేచన చేయుపని శిల్పిదికాదు. ప్రతిపదార్థమునందును దాగి యుండెడియానందఘనస్వరూపమును వెల్లడిపఱచుటయే శిల్పి యొక్క కర్తవ్యము. శిల్పి సాధుపుంగవుల వైరాగ్యమును చిత్రించునటులనే కాముకుల కామోన్మాదమును చిత్రించును. కాముకుల కామోన్మాదమును చిత్రించుటచే చిత్రకారుని గౌరవమున కెంతమాత్రము భంగము వాటిల్లదు. సాధువుల వైరాగ్యమువలెనే, కాముకుల కామోన్మత్తత గూడ సత్యముయొక్క ప్రకాశమే.

ఆధ్యాత్మికభావమునకును, శిల్పమునకును నెట్టి వైరుధ్యమును లేదు. ఆధ్యాత్మికభావమే నిజముగ శిల్పమునకు జీవము. ఆధ్యాత్మికభావము యోగుల యోగమునందును, భోగుల భోగమునందునుగూడ సమానముగనే యుండును. యోగుల యోగిత్వము, భోగుల భోగిత్వము, దేవతల దేవత్వము, పసువుల పసుత్వము యథావిధిగ చిత్రింపగలవాడే కళావిదుడు. ఇందువలన శిల్పి నాధ్యాత్మికవాది యని పిలుచుట కెట్టి సంశయము నుండనవసరములేదు. శిల్పి యనంత దయారస స్వరూపుడగు బుద్ధభగవానుని చిత్రించి ధన్యుడైనట్లే, దశకంఠుని రౌద్రరూపమునుగూడ చిత్రించి, ధన్యుడు కాగలడు. కరుణరసమును చిత్రించిన భవభూతికవియు ప్రధాన రసమగు శృంగారమును చిత్రించిన కాళిదాసును సమానముగ బూజ్యులగుదురు. శాకుంతలాదులను బఠించు పాఠకుల మనములయందు శృంగారరస ముద్దీపితమైనచో నందు కాళిదాసు దోషమేమిగలదు? మానవప్రకృతియందు విరాజిల్లుచున్న

శృంగారరసమును వెల్లడించుటయే కాళిదాసుని యుద్దేశము. కాని యొక్కొకసమయమున బ్రహ్మచారులవంటి సాధకులకు శృంగారవర్ణన మంతరాయము కలిగించవచ్చుననుకారణముచే దాని నసత్యమనిగాని, సౌందర్యవిహీనమనిగాని చెప్పుట కేవలము సాహసము.

నగ్నస్త్రీల చిత్తరువులు నేత్రములకు బాధను గలిగించును. అట్లుండుటకు గారణము కేవలము నీతిజ్ఞానమే కాదు. సౌందర్యబోధ వానిలో నేమాత్రమును లేకపోవుటచే నవి యసహ్యముగ నుండును. సాధారణముగ మనము చూచు బూతుబొమ్మలు సౌందర్య విహీనములైనవి. అవి నిజముగ చిత్తరువులుగావు. అవి ఫొటోగ్రాఫులు. నకళ్ళు స్త్రీలయొక్క బాహ్యరూపమునుమాత్రమే చూపించునుగాని, యంతర్గత సత్యమగు స్త్రీత్వమును వెల్లడింపజాలవు. రసికుని దృష్టికి నగ్నస్త్రీల ఫొటోగ్రాఫు లెంత యసహ్యములో సాధుపుంగవుని ఫొటోగ్రాఫుకూడ నంత యసహ్యముగనే యుండును. ఫొటోగ్రాఫులు స్త్రీల స్త్రీత్వమునుగాని, సాధువుల సాధుత్వమునుగాని చూపింపజాలవు. ఈ కారణముచేతనే రవివర్మ చిత్తరువులు రసవిహీనములై రసజ్ఞున కసహ్యముగ దోచును. నీతివాదుల యశ్లీలజ్ఞానముతో నాలోచించినను, రసజ్ఞుల యతీంద్రియదృష్టితో జూచినను, బాహ్యరూపము వెనుకనుండు గభీరసత్యమును వెల్లడింపజాలని చిత్తరువులు హేయములే. శిల్పశాస్త్రమునం దట్టి చిత్తరువులు దూష్యములుగ నెంచబడును. స్త్రీరూపచిత్రమును జూచునప్పుడు, ఆ రూపమును, శిల్పి వివస్త్రముగ జిత్రించెనా, లేక నవస్త్రముగ జిత్రించెనా యని కా దాలోచింపవలసినది. ఆ రూపమునందు శిల్పి స్త్రీ యొక్క స్త్రీత్వమును జిత్రింపగలిగెనా యను విషయమునే

రసజ్ఞుడాలోచించును. అట్టి చిత్తరువునందలి రూపము నగ్న మైనను, రసజ్ఞుని దృష్టి అందలి స్త్రీత్వముమీదనే నిలచును గాని, చిత్తవికారమును గలిగించు బాహ్యరూపముపై నిలువదు. రసికుడు చిత్తరువునందు నారీప్రకృతియందలి సత్యమును ఋషివలె దర్శించి పరమానందభరితుడగును. నీతికోవిదుడు దృశ్యముల నెంతవఱకు పుణ్యపాపములనెడు వివేచనతో జూచు నభ్యాసమునకు వశుడైయుండుటచే, పుణ్యపాపముల కతీతమైన యీ గూఢరహస్యమును, సహస్రధారలుగ ప్రవహించు రసవాహినియొక్క మూలఝరిని దర్శించి ధన్యుడు కాజాలడు.

శిల్పికి రససిద్ధి కలిగినప్పుడు రూపసృష్టిచేయును. రసావేశావస్థ పుణ్యపాపములకు, విధినిషేధములకు నతీతమైనది. రససిద్ధుని పరిపూర్ణమగు సత్యానుభూతి, యపరిణతావస్థ యందుండు నీతివాదికిగాని, సాధకునకుగాని గోచరింపదు. సాధకునకు గోచరించు సత్యము క్షణికము, ఖండము. అందు సత్యముయొక్క నిత్యరూపము గోచరముకాదు. "రససిద్ధాః కవయః" కవులు ఋషులవలెనే రససిద్ధులు. కవిదృష్టి మర్మభేదివలె, ప్రకృతియందలి చిరంతనసత్యమును వెల్లడిచేయును. రవి గాంచనిచోటు కవి గాంచును. నీతివాది యన్ననో, యిది పుణ్యమా, పాపమా యను కొలతబద్దలతో సర్వమును విచారించుచుండుటచే నీ కొలతల కతీతమైన సౌందర్యమును గాంచజాలడు. ప్రసిద్ధ గ్రీకుశిల్పులు చిత్రించిన నగ్నస్త్రీ ప్రతిమలను జూచినంతనే నీతివాది మనస్సు కలవరపడును. ఆ విగ్రహములయందలరారుచుండు సత్యము, సౌందర్యము వానికి బోధపడదు. ఇంద్రియనిగ్రహమును సాధించుట సమంజసమే. కాని నీతివాది యింద్రియనిగ్రహ మను

పేర, నింద్రియములందలి సత్యమునకే దూరమగును. ఇంద్రి
130 యముల బాహ్యవిక్షేపమునకు భీతిజెంది, యింద్రియముల యందలి సత్యదేవతను విడనాడుట రససిద్ధికే గాక, సత్యానుభూతికి గూడ నంతరాయము గల్గించును.

నీతివాది మార్గమునకును, రసికుని మార్గమునకును భేదముగలదు. నీతివాదిది వ్యతిరేకమార్గము. రసజ్ఞునిది అన్వయపథము. నీతివాది "ఇదికాదు, ఇదికాదు" అనుచు ముందుకు నడచును. రసజ్ఞుడు "ఇదేకాదు, ఇదేకాదు"అనుచు ముందుకు బోవును. సాధకు డతీంద్రియజగత్తును జేరుటకింద్రియలీలలను త్యజింపబ్రయత్నించుచుండును. కళావిదుడింద్రియ విభూతి ద్వారముననే యతీంద్రియజగత్తును జేరును. సాధకు డింద్రియనిగ్రహముకొఱ కాచారములు, విధినిషేధములు మొదలగు నియమములను గల్పించుకొనును. కాని కళావిదు డీ నియమములను గమనింపడు. తాను ముక్తపురుషునివలె సంచరించును. ముక్తభావ మెప్పుడును జాగ్రుతమైన యెడల, నాతడు సిద్ధుడగుటకు సందియము లేదు. సాధకుడు తన సాధనకును, ధర్మప్రవర్తకుడు తన ధర్మశీలమునకును, ననుగుణమైన విషయములను మాత్రము గైకొని, మిగిలిన వానిని వర్జించును. కాని శిల్పి యట్టిధర్మమీమాంసకు గడంగడు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను రసజ్ఞునకు దోషభూయిష్ఠమగు విషయ మేముండును? శిల్పి సర్వవిషయముల యందు నంతర్గతముగ నుండు సౌందర్యమహిమను, సత్యప్రేరణను గాంచి తన్మయుడగుచుండును. సాధకు డాచారనియమములు, దీక్షావ్రతములు, వితర్కవిచారములు మొదలగు వాని సాహాయ్యముతో దనసాధనలను బలపరచుకొనుచు నాత్మోపలబ్ధికి గడంగును. కళావిదుడు సకలరూపముల

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)



నుపాసించుచు గమ్యమును స్వేచ్ఛగ జేరుటకు బూనుకొనును. "నిరంకుశాః కవయః" రససిద్ధులు స్వతంత్రులు. యశోదాదేవిని జిత్రించిన సిద్ధహస్తుడు వారాంగనా చిత్రమునుగూడ జిత్రించుటకు సంశయింపడు. ఆ ద్వివిధచిత్రములయందు ప్రకృతిగతమగు దోష మణుమాత్రమైనను గాన్పింపదు. కళావిదునకు గావలసినది సత్యప్రేరణము, సౌందర్య బోధ. దానికి మించినది మరియొకటి లేదు.

ధర్మమీమాంస కలవాటుపడిన నీతివాదులు సౌందర్య బోధ ననుభవింపజాలరు. తర్కముతోడను, నీతితోడను సమన్వితమైన గాని, వారికే విషయమును గ్రాహ్యము కాదు. ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము వారికి ప్రమాణములు. వారు కళావిదులనుగూడ నీ పాశములచే బంధింప జూచెదరు. విషయభోగములందు జిక్కుకొనిన జనసామాన్యమునకు నీతి మిక్కిలి ప్రయోజనకారి యనుటకు సందియము లేదు. కాని యది మానవుని సూక్ష్మదృష్టిని, అంతఃప్రకృతిని ప్రబోధమొనర్పజాలదు. రసజ్ఞుల దృష్టియే జగదంతర్గతమైన రహస్యమును వెల్లడించగలదు. రససంబంధముచే భగవదుపలబ్ధియైనవాని కాచారనియమములతో బని లేదు. కావుననే శిల్పి యింద్రియలీల యందలి సౌందర్యము ననుభవించి, తన్మూలమున నాధ్యాత్మిక భావమున నోలలాడును.

1926 *

## రాజపుత్ర శిల్పము * *

క్రీస్తుశకము పదుమూడవ శతాబ్ది మొదలుకొని పదునెనిమిదవ శతాబ్దమువఱకు ఉత్తర హిందూస్థానములో, ముఖ్యముగ పంజాబు, రాజపుత్రస్థానము మొదలగు ప్రాంతములలో, ప్రాబల్యమునందిన హిందూశిల్పమునకే రాజపుత్ర శిల్పమనుపేరు కలిగినది. ఈ శతాబ్దిలోనే హిందీ, పంజాబీ, గుజరాతీ, బంగాళీ, మహారాష్ట్రము మొదలగు ప్రాకృతభాషలు కూడ విజృంభించెను. అంతకుబూర్వము, ముఖ్యముగ తొమ్మిదవ శతాబ్దమువఱకు, సంస్కృతమునకే ప్రాముఖ్యముండెడిది. సంస్కృత మా కాలమున మాతృభాష కాదు. రాజసభలందు, పండిత పరిషత్తులందు, భక్తుల గోష్ఠులందు, గురుకులములందు, సంస్కృతమే వ్యవహారింపబడుచుండెడిది. క్రిందితరగతులవారు మాత్రము ప్రాకృతములో మాట్లాడుచుండిరి. కాని బుద్ధునికాలమున, సంస్కృతమునకే ప్రాముఖ్యమున్నను, బౌద్ధమతప్రచారముమాత్రము ప్రాకృతమునందే సాగెడిది. సుమారు పదునొకొండవ శతాబ్ద్యారంభ కాలమున ప్రాకృతమునుండి బయల్వెడలిన దేశభాషలు తలలెత్తి, రాజసభలను, పండితపరిషత్తులను సహితము ఆక్రమింప జొచ్చెను. పదుమూడవ శతాబ్ది వచ్చుసరికి, సంస్కృతము చాలవరకు మూలబడి, దేశభాషలే రాజభాషలయ్యెను. దేశభాషలలో భారతేతిహాసము లనువదింపబడసాగెను. కవులు దేశభాషలలోనే కావ్యములను

వ్రాయ మొదలిడిరి. చైతన్యుడు, నానకు, కబీరు, మీరా బాయి మొదలగు భక్తపుంగవులును దేశభాషలలోనే కీర్తనలను రచించి భక్తిజ్ఞాన వైరాగ్యములను జనసామాన్యములో వెదజల్ల నారంభించిరి. ప్రజలలో నొక యపూర్వమైన యుద్బోధము కలిగెను. రాజకీయపరివర్తనములమూలమున హిందూరాజ్యములు శిథిలములై ఆత్మరక్షణోపాయములలో జిక్కుకొనిపోయినను, సంగీతము, సాహిత్యము, చిత్రలేఖనము, అభినయము మొదలగు విద్యల కుత్తేజనము కలిగెను. అంతకుబూర్వము సంస్కృతభాషా పేటికలయందును, శాస్త్రగ్రంథములందును దాగియుండిన అమూల్యరత్న భాండారములు ప్రజలచే గొల్లకొట్టబడినవి. ప్రాచీన హిందూవిద్యల కొక విధమైన నూతనకళ యుదయించి, హిందూసభ్యతయొక్క అప్రతిహతశక్తి శతముఖముల వ్యక్తమయ్యెను.

హిందూస్థానమున నీ పదుమూడవ శతాబ్దిప్రారంభము నుండియు బయల్వెడలిన మతోద్యమములు, శిల్పప్రయత్నములు, సాంఘిక పరివర్తనములు మొదలగు విషయములను గూర్చిన చరిత్ర సరిగ నింకను బరిశీలింపబడినట్లులేదు. వైష్ణవ మతకర్తలగు రామానుజ, మధ్వ, నింబార్కాది వ్యాఖ్యాతలింకను సంస్కృతమునే ఆశ్రయించుచుండినమాట నిజము. జయదేవుడు అపూర్వమగు తన గీతగోవింద కృతి పదుమూడవ శతాబ్దియందు రచించెను. కాని, వారి యనుయాయులు పదునాల్గు, పదునైదు, పదునారవ శతాబ్దులలో దేశభాషనే ఆశ్రయించి యభివృద్ధిపఱచిరి. రామానందుడు పదునాల్గవ శతాబ్దిలో వెలసెను. వాని శిష్యుడగు కబీరు పదునైదవశతాబ్దియందు దేశమునంతను గదలించి వైచెను. విద్యాపతి, ఉమాపతి, చండీదాసు మొదలగు

వైష్ణవకవులు పదునైదవ శతాబ్దిలోనివారు. శ్రీనాథాజీ మతమును స్థాపించిన వల్లభుడు 1479 లో జన్మించెను. మల్లిక్ మహమ్మదు ప్రణీతమగు 'పద్మావతి' 1540 లో బూర్తి చేయబడెను. గౌరాంగప్రభువగు చైతన్యుడు 1485-1533 కాలపువాడు. తులసీదాసుని కాలము 1532-1623. లాక్షణికులగు కేశవదాసు, బేహారిలాలు ప్రభృతులు 16 వ శతాబ్దియందు విలసిల్లిరి. ఈ సందర్భములనుబట్టి, ఉత్తర హిందూస్థానమున దేశభాషలు 14, 15, 16 వ శతాబ్దులలో నుచ్చదశ నందెనని తెలియనగును.

రాజపుత్రశిల్పము కూడ నీశతాబ్దులలోనే యెక్కువ వ్యాప్తినొందెను. 17, 18 శతాబ్దులలోగూడ గొంతవ్యాప్తి గలిగినను, దీనికొక స్థిరపద్ధతి యీ శతాబ్దులలోనే సిద్ధించె ననుట నిశ్చయము. దేశభాషలు ప్రాంతీయభాషలగుటచే, సంస్కృతముకంటె నీదేశభాషలు ఆయా ప్రాంతీయుల వ్యక్తి విశేషముల నెక్కువగ నభివ్యక్తముసేయుట కవకాశము కలి గెను. అట్లే రాజపుత్రశిల్పమును రాజస్థానము, పంజాబు, హిమాలయప్రాంతము మొదలగు స్థానములందలి ప్రత్యేక లక్షణముల నెక్కువగ ప్రకటింపగలిగెనని రాజపుత్ర చిత్రరచ నలతో పరిచయముగలవారికి దెలియని విషయముకాదు. ఈ శిల్పము రాజపుత్రస్థానముబయటకూడ వ్యాపించినను రాజ పుత్రసంస్థానాధీశుల పోషణమున నిది యెక్కువగ వర్ధిల్లుట చేతను, వీని చిహ్నములింకను జయపూరు, చిత్తూరు, ఉదయ పూరు మొదలగు పర్వతదుర్గములందే యెక్కువగ గాన్పిం చుటచేతను, ఈ శిల్పమును రాజపుత్రశిల్పమని యిటీవలి చిత్రకారులు వర్ణించుటకు గారణమయ్యెను.

రాజపుత్రశిల్పములు ముఖ్యముగ కుడ్యాలంకారములుగ విలసిల్లుచుండెను. ఉదయపూరు, బికనీరు రాజమందిరముల లోనిగోడలమీద నివియింకనుగానవచ్చుచున్నవి. జయపూరు, అమృతసరము, హోషియార్పూరు మొదలగు పట్టణములలో, ప్రాచీనమందిరముల యంతర్భాగములందేకాక, బయటకూడ నెక్కువగ గాన్పించును. కాగితములపై చిత్రింపబడిన రచనలు స్వల్పాకృతులు కలిగియుండినను, గోడచిత్తరువులుమాత్రము మనుష్యుని ఆకృతినిగూడ మించి, ఒక గోడనుండి యింకొక గోడకు తీగెలుసాగినట్లు అల్లుకొనియుండును. గుజరాతుప్రాంతములలో, గుడ్డలపై చిత్తరువుల నద్దుట కలదు. ఒక్కొక్క తానుపై గజములకొలది పొడవున, శ్రీకృష్ణలీలలు, రామాయణకథలు, కురుక్షేత్రయుద్ధము మొదలగు రసవంతములైన గాథలు వివిధవర్ణముల అద్దకముచే చిత్రింపబడుచుండెను. పాశ్చాత్యసంపర్కము వచ్చినపిమ్మట నీ చిత్రకళ యుత్పన్నమయ్యెనేకాని, రామాయణభారతకాలములనాటినుండి 18 వ శతాబ్దివఱకు నీ చిత్రవిద్య స్వీయస్వరూపలక్షణములను గోలుపోక, అనేకములైన క్రొత్తక్రొత్త పుంతలను ద్రొక్కుచు జాతీయజీవనము నాశ్రయించుకొని యుండెడిదని సంస్కృత కావ్యములందేకాక, దేశభాషాగ్రంథములందుకూడ వర్ణింపబడిన చిత్రశాలలనుబట్టి తెలియగలదు.

మహమ్మదీయులు రాజ్యము చేయుచుండిన కాలములో సహితము ఈ హిందూశిల్పమునకు వన్నె తగ్గలేదు. మొగలు పాదుషాలయాదరణమువలన, "మొగలుశిల్పము" అను క్రొత్త సంప్రదాయము బయల్వెడలినమాట నిజము. పర్షియానుండి కొందరు శిల్పులు, చిత్రవిద్యావిశారదులు, మొగలుదర్బారుల నాశ్రయించి, పర్షియను సంప్రదాయానుగుణముగ, చిత్తరు

వులను రచించుచుండిరి. మొగలుశిల్పమునకును, రాజపుత్ర శిల్పమునకును భేదము కలదు. మొగలుశిల్పము కేవలము మొగలుచక్రవర్తులనే ఆశ్రయించుకొనియుండెను. ఆ చక్రవర్తుల వినోదమునకొఱకు చిత్రరువుల సంపుటములు స్వాల్పాకృతులలో, 'ఆల్బము' గ్రంథములవగిది, తయారుచేయుచుండిరి. చక్రవర్తుల యొక్కయు, రాణులయొక్కయు లేఖలకు అంచులుదీర్చి చిత్రశోభితముగ జేయుచుండిరి. ఈ చిత్రరువులన్నియు గ్రంథపుటలలో నిముడదగినంతస్వల్పములే కాని పెద్దవి కావు. ఇందు వర్ణింపబడిన విషయములు గూడ మతసంబంధమైనవి కావు. మహమ్మదీయులు విగ్రహభంజకులు. దేవునకు మానవాకృతిని ఆరోపించరు. వారి మతప్రవక్తయగు మహమ్మదునకు గూడ రూపపటము గల్పించుట కొప్పుకొనరు. చెట్లు, పూలు, పిట్టలు, మద్యపాత్రము మొదలగు రమ్యరూపములనుమాత్రము జిత్రించి యానందించెదరు. ఇటీవల, చక్రవర్తులయొక్కయు, బేగములయొక్కయు ఆలేఖ్యములను వ్రాయుచుండిరిగాని, వానిలో దైవభావము నేమాత్రమును సూచించుట కొప్పుకొనకుండిరి. మొగలుసామ్రాజ్య వైభవద్యోతకములైన భావములను మాత్రము ప్రకాశింపజేయుచుండిరి. ఈ మొగలుచిత్రరువులన్నియు పర్షియనుశిల్పులే రచించియుండ లేరు. మొగలుచక్రవర్తుల యాదరణమునకు పాత్రులైన కొందఱు హిందూశిల్పులును మొగలు చిత్రరువులను రచింప నారంభించిరి. ఎంత వలదన్నను, హిందూశిల్పుల తూలికాప్రభావముచే, మొగలుశిల్పమునందుకూడ నిటీవల రాజపుత్రశిల్పపుకళలు దిగుట సంభవించెను. ఇప్పుడు మ్యూజియములలో భద్రపరచబడుచుండు మొగలుచిత్రరువులు చాలవఱకు హిందూశిల్పరచనలే యనుట నిశ్చయము. తమ

రచనలక్రింద చిత్రకారులు తమ సంతకములను జేయు క్రొత్త యాచారము ప్రారంభమయ్యెను. ఈ మొగలుశిల్పము అక్బరు (1556—1606) తో ప్రారంభమై ఔరంగజేబు (1706) తో నంతమొందెను.

రాజపుత్రశిల్పము కేవలము రాజులపోషణచేతనే వర్ధిల్లలేదు. జనసామాన్యముకూడ అభిమానింపజొచ్చినది. ఈశిల్పమున వర్ణింపబడిన విషయములే ఈవ్యాప్తికిగారణము. రాజపుత్రశిల్పము మానవహృదయాంతర్గతమైన రసస్రోతమును బయట కుబికించెను. గోపగోపీజనుల విహారకేళులందు ప్రేమమాధుర్యరసములు చిప్పిలెను. శ్రీకృష్ణుని మురళీగానమున చరాచరము లన్నియు నేకరసమున గరగిపోయెను. ఆత్మ పంచేంద్రియములద్వారమున తన సౌందర్యప్రభావమును వెల్లడించెను. నాయికానాయకుల భావోన్మత్తత చిత్రవిచిత్రరీతుల వర్ణింపబడెను. రాజపుత్రశిల్పమున జిత్రింపబడినది కేవలము శ్రీకృష్ణలీలలే కాదు. శైవశాక్తపురాణములందలి విషయములుగూడ జిత్రితములయ్యెను. పార్వతీపరమేశ్వరుల రూపము లతిదివ్యభావమున జూపబడెను. రాధాకృష్ణులు బృందావనములో విహరించిన రీతిని, శివుడును పార్వతియు హిమాలయసానువులందలి దేవదారువనములమధ్య బ్రణయలీలలను బ్రదర్శించిరి. శివుడు శ్మశానవాటికయందు నృత్యము సల్పుచుండును. పార్వతి వివిధకల్పములందలి బ్రహ్మల శిరములను పూలమాలగగూర్చి శివుని కంఠసీమ నలంకరించును. దుర్గ వ్యాఘ్రవాహనముపైన మహిషాసురునిమీదికి దాడివెడలును. ప్రమథగణము వివిధాయుధములతో సైనికులవలె వెంబడించును. రాజరాజేశ్వరి, త్రిభువనమాత, నవరత్నఖచితసింహాసనముపైనధిష్ఠించియుండ, మహేశ్వరుడామెముందుతన్మయుడై

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)



నృత్యముసల్పుచుండును. చుట్టునుఆవరించియుండు ధవళశృంగములపైనుండి దేవతలు మూగుచుందురు. సరస్వతి వీణెవాయించుచుండును. ఇంద్రుడు మురళి నూదుచుండును. బ్రహ్మ తాళము వేయుచుండును. లక్ష్మి రాగము నాలాపింపదొడగును. విష్ణువు మృదంగము వాయించుచుండును. గంధర్వ యక్ష కిన్నర ఉరగ సిద్ధ సాధ్య విద్యాధర అప్సరోబృందములు చుట్టును బరివేష్టించి నిర్నిమేషనయనములతో దిలకించుచుండును. ఆ హిమాలయప్రాంగణమున, ఆ సంధ్యారాగమున, రాజరాజేశ్వరీసమ్ముఖమున జరుగు శివనాట్యము జగన్మోహనము! రుద్రాణి కాళీదేవియొక్క తామసిక రూపము. చతుర్భుజములు, త్రినేత్రములు కలిగి, జరాభారముచే కృశించి, అస్థిపంజరమువలె భయంకరాకృతిని దాల్చియుండును. నదీతటమున నీమె ఇనుపపాత్రమున వంటచేయుచుండును. చక్రవర్తియొక్క కిరీటము, భుజకీర్తులు, దుస్తులు, ఖడ్గము మట్టిలో గలిసిపోవుచుండును. వాని కళేబరము పాత్రలో తుకతుక నుడుకుచుండును. రుద్రాణి భక్షించినంత భక్షించి శేషించినదానిని పాత్రతో బయట కడిగిపోయుచుండును. ఆవల మహేశ్వరుడు లింగాకారమున నక్షయభావమున నిమగ్నుడైయుండును. పైన చంద్రరేఖ తన చల్లని అమృతకిరణములను వర్షించుచుండును. ఏమీ యీదృశ్యము! సృష్టిసంహారములు కల్పకల్పములనుండియు నిర్వాధమున జరగిపోవుచున్నవి. రాజమకుటములు గూడ నీ సంహారక్రీడకు ఆహుతికాక తప్పదు. రాజపుత్రశిల్పమున నీ సృష్టిరహస్యము అద్భుతరూపమున చిత్రింపబడెను.

ఈరాజపుత్రచిత్తరువులలో స్త్రీసౌందర్యము పరాకాష్ఠ చెందెను. అందు స్వర్గమర్త్యలావణ్యములు ఏకరూపము

దాల్చెను. ఆ కమలాక్షుల, ఆ పీనపయోధరల, ఆ బింబాధరల, ఆ మందగమనల లీలావిలాసములు నూత్ననూత్న కాంతులతో విరజిమ్మబడెను. రాధ శ్రీకృష్ణుని సందేశమును దూతముఖమున వినును. ఆమె యమునాతీరమందలి లతాకుంజమునకు జనును కాని, శ్రీకృష్ణుడచట లేడు. ఇంకను రాలేదు. రాధ విటపశాఖను బట్టుకొని ఉత్కంఠయై నిరీక్షించుచుండును.

అయ్యది చిత్తరువు కాదు—కావ్యము; కావ్యము కాదు—రాగఘని. రాధ ఆత్మయంతయు ఆచూపులలో నున్ముఖమయ్యెను. అంధకారమును జీల్చుకొనుచు సహస్రయోజనముల వేగముతో బరుగిడు సూర్యకిరణమువలె, నిశ్శబ్దసాగరమును ఒక్క ముహూర్తములో పొంగునట్లుచేయు రాగిణివలె, నాచూపు రోదోంతరాళమునంతను జుట్టుకొనివచ్చును. శ్రీకృష్ణుడు పద్మాసనముపై నృత్యముసేయుచు మురళి ఊదుచుండును. గోపబాలురు నిశ్చేష్టులై, శ్రీకృష్ణుని ముఖమండలమును వీక్షించుచుందురు. ఆవులు చెవులు నిక్కించి, మేపు లుడిగి, కృష్ణునిమోల్ల నిలువబడును. కాసారమునందలి స్వర్ణకమలములు వికసించి సౌరభము వెదజల్లుచుండును. పైనుండి లతాప్రతానములు పుష్పవర్షమునుగురియుచుండును. గోధూళివేళ, గోపబాలురు గోవులను దోలుకొని తిరిగి బృందావనమునకు వచ్చుచుండిరి. శ్రీకృష్ణుడు వారిమధ్య మేఘశ్యామద్యుతితో బ్రకాశించుచు మురళివాయించుచుండెను. త్రోవనుబోవుచుండిన ఆవులట్లే నిలచిపోయినవి. యమునాతీరమునుండి జలకలశములను గొని తెచ్చుచుండిన గొల్లభామలు, వికసిత వదనారవిందములతో బ్రక్కనుండి చూచుచుండిరి. సౌధగవాక్షముల నుండి పౌరరమణులు తమ హస్తకమలములతో "అదుగో చిన్నికృష్ణు"డని చూపుచు ముగ్ధలగుచుండిరి. నందుడు గృహా

ద్వారముకడ నిలువబడి తిలకించుచుండెను. యశోదా బలరాములు గృహాభ్యంతరమునుండి వెలుపలికి వచ్చుచుండిరి. ఆ చిత్రకారుల తూలికలలో నే ప్రభావముండెనో! ఆ రేఖల ఒయ్యారము, ఆ వన్నెల భావంపు తళుకులు, ఆ బింబముల సొంపులు, ఆ భంగిమముల హావభావ లీలావిలాసములు వర్ణనాతీతములు. ఒక్కొకపటము ఒక్కొక కావ్యమై విలసిల్లెను. ఒక్క కృష్ణుని దివ్యచరిత్రమునే కాదు, రామాయణకథను వన్నెచిన్నెలతో వర్ణించిరి. శ్రీరామచంద్రుడు తన శిరమును సీతాదేవి యంకమున బెట్టుకొని పరుండియుండును. లక్ష్మణుడు శ్రీరాముని మృదుపాదకమలమున గుచ్చుకొనిన ముల్లును తీయుచుండును. ఏమి మార్దవము!— ఏమి సౌకుమార్యము! ఆ బింబములు భావంపుగళికలే కాని రంగులబొమ్మలు కావు. మహాభారతేతిహాసమంతయు ఆ చిత్రకారులచే తిరిగి విచిత్రరూపమున వ్యాఖ్యానము చేయబడినది. ద్రౌపదీ వస్త్రాపహరణము, భీష్మాచార్యుని అంపశయ్య మొదలగు పటము లానాటి భారతవీరుల విగ్రహములను గన్నులకు గట్టినట్లు చేయును.

ఇట్లే, కబీరుదాసుని భజనలు, శిక్కువీరుల దర్బారులు సొంపు లొలుకునట్లు వర్ణింపబడినవి. ఇట్లెన్నివందల చిత్రకారులు పారంపర్యముగ శిల్పవృత్తి నవలంబించి దేవాలయములను, మందిరములను, రాచనగరులను, సంపన్నగృహస్థుల సౌధములను తమ చిత్రరచనలచే నలంకరించి చరితార్థులగుచుండిరో తెలియదు. కాలము సర్వగ్రాసి. ఎన్ని చిత్తరువులో కాలగర్భమున బడిపోయినవి. శత్రువులు దాడివెడలి వచ్చి రాజపుత్రనగరములను ధ్వంసము చేసినప్పుడు, దేవాలయములను కొల్లగొట్టినప్పుడు ఈ చిత్రము లెన్నియో నాశ

నష్టమై యుండును. శేషించినవానిలో, ఎన్నో- విజాతీయుల హస్తగతములై, జర్మనీ, అమెరికా, ఇంగ్లాండు మొదలగు దేశములలోని మ్యూజియములలో గుప్తముచేయబడినవి. దేశములో మిగిలిపోయినవానినైనను భద్రపరచి ఆనందించు అభిమానము మృగ్యము. ఆ చిత్తరువులను జూచి ఆనందించు కన్నే పోయినది. పాశ్చాత్యవ్యామోహముచే నేత్రములకు మబ్బుక్రమ్మినది. నేటి నవనాగరికులకు సౌందర్యము వికారముగను, వికారము సౌందర్యముగను గన్పట్టుచున్నది. ఈ మబ్బులు వీడి సౌందర్యరసజ్ఞత తిరిగి యుదయించుట కింకను ఎంతకాలము పట్టునో తెలియదు.

1933

*

## విగ్రహ నిర్మాణ విద్య * *

విగ్రహనిర్మాణవిద్యకు స్థపితమని పేరు. ఈ విద్య ఈ దేశమున నెప్పుడు ప్రారంభమయ్యెనో సరిగ నిర్ణయించుట కష్టము. వేదములలో దేవతారూపములు వర్ణింపబడినవి. దివ్యుల వాహనములుగూడ పేర్కొనబడినవి. సూర్యాగ్నులకు అశ్వములు వాహనములు. ఇంద్రుద్రులకు వృషభము వాహనము. ప్రజాపతి నానాజంతురూపముల నవతరించినట్లు వాక్రువ్వబడెను. భౌతికరూపము లెన్నియో దేవతల కాయుధములుగను అలంకారములుగను సూచింపబడెను. చక్రము విష్ణువునకు ఆయుధము. ఆ చక్రమే క్రమముగ పరిపాలనాధర్మమునకు చిహ్నమయ్యెను. పృథ్వీచక్రశాసకుడు చక్రవర్తిపదలాంఛితుడు. చక్ర మిటీవల బౌద్ధమతమున ధర్మచక్రముగ బరిణమించెను. దేవతలు దివ్యశరీరులగుటచే, వారి శిరములు ప్రకాశముతో వెలుగుచుండినట్లు వర్ణించిరి. ప్రభామండలము శీర్షచక్రము మొదలగు వర్ణనలెన్నియో కలవు. దేవతల పీఠములు పైనను క్రిందను వెడల్పుగనుండి, మధ్యను స్త్రీకటిప్రదేశమువలె సన్నగనుండవలెనని సూచించిరి. ఇంద్రునివజ్రాయుధమునకు దివ్యరూపమును గల్పించిరి. అధర్వణవేదములో, చైత్యవృక్షములనుగూర్చి వర్ణింపబడెను. వృక్షదేవతలు మంగళరూపములతో నారాధింపబడుచుండెను. క్రమక్రమముగ నీ దేవతలకు మర్త్యరూపములు గల్పింపబడెను. బ్రాహ్మణములలోను సూత్రములందును విగ్రహ

ములు పేర్కొనబడినవి. అనార్యులలో—ఆర్యులు అనార్యులు అను విభాగము సరియైనదైనయెడల—లింగము సృష్టికారణ రూపముగ నారాధింపబడుచుండెను. జనసామాన్యము యక్షులు, నాగులు, భూదేవి మొదలగు దేవతారూపముల నుపాసించుచుండిరి. శల్వసూత్రములలో అగ్నివేదికలను గూర్చియు,యజ్ఞవాటికలనుగూర్చియు లక్షణములు వివరముగ సూత్రీకరింపబడియుండెను. రానురాను పురాణేతిహాసముల యందు, మనుస్మృతియందు గృహ్యసూత్రములందును దేవతా విగ్రహములు విస్పష్టముగ నభివర్ణింపబడినవి. క్రీస్తునకు మూడునాలుగు శతాబ్దులపూర్వపుగ్రంథములలో, దైవతము, ప్రతిమ, ప్రతికృతి, మూర్తి, దేవతామూర్తి మొదలగు శబ్దములు విగ్రహములకు పర్యాయపదములుగ వ్యవహరింప బడుచుండెను. విగ్రహములను జేయువారు దేవలకులను పేరుతో బిలువబడుచుండిరి. హరివంశములో నాకాలమున శిలావిగ్రహములు చెక్కబడుచుండినట్లు ఉదాహరణములు గలవు. పాణినికి వ్యాఖ్యవ్రాసిన పతంజలి శివ, స్కంధ, విశాఖాది విగ్రహములు విక్రయింపబడుచుండినట్లు సూచించి యుండెను. గృహ్యసూత్రములలో దేవతల యూరేగింపులను గూర్చి వ్రాయబడెను. ఆశ్వలాయనసూత్రములందు నాకబలి విధానము వర్ణింపబడెను. గృహ్యపరిశిష్టమున, నాగమును కొయ్యతోగాని రేగడతోగాని చేసి ఒక సంవత్సరము పూజ చేయవలెనని చెప్పబడెను. కుశానగుప్తుల కాలములో నాగ ములు శిలలో జెక్కబడుచుండిన సంగతి చరిత్రప్రసిద్ధము.

పంజాబులోని హరప్పయందును, సింధుప్రాంతము నందలి మహేంజదారునందును బయటపడిన పురాతనచిహ్న ములలో, సున్నముతో జేయబడిన విగ్రహములు కలవు.

పొడుగుగడ్డముగల పురుషవిగ్రహములు సున్నపురాతితో జేయబడియుండినట్లు ప్రకటింపబడినది. ఇది క్రీస్తుకంటె వేయి సంవత్సరములు బూర్వపు కథమైయుండవలెను. రథములను, లోహపాత్రలను, బంగారునగలను కళానైపుణ్యముతో జేయుచుండిన ప్రాచీనార్యులు విగ్రహములను నిర్మింపగలుగుటలో నాశ్చర్యములేదు. గౌతముని కాలములోనే బుద్ధుని దారువిగ్రహములుచేయబడుచుండినట్లు ఇటీవలిచరిత్రకారులు వ్రాయుచున్నారు. ఖారవేలచక్రవర్తియొక్క హాతీగుంఫా శాసనమున కేతు అను వీరుని దారువిగ్రహమును గూర్చిన గాథ కలదు. పద్మము అనాదినుండియు బ్రహ్మకు చిహ్నముగ నిరూపించుచుండిరి. మౌర్యుల కాలములో, పద్మపీఠములు సర్వత్ర కనుపడుచుండెను. సాంచీలో మాయాదేవీ లక్ష్మీవిగ్రహములకు పద్మము ఆసనముగ జిత్రింపబడియుండెను. పిమ్మట చాల దేవతలకు పద్మాసనము సామాన్యమయ్యెను. హిందువులు, బౌద్ధులు, జైనులు, కొన్ని సామాన్యచిహ్నముల నుపయోగించుచుండినను, వారి వారి ప్రత్యేక విశ్వాసములనుబట్టి, వేరువేరు భావములతో వానిని వాడుచుండిరి. నాణెములమీద జంతువులు, వృక్షములు, దేవతలు, పతాకలు మొదలగు వివిధచిహ్నములను జిత్రించుచుండిరి. నాణెములపై ముద్రింపబడుచుండిన చిహ్నములనుబట్టి యవి ఏయేప్రాంతములలో, ఏయే రాజ్యములలో చలామణి యగుచుండెనో తెలిసికొనవలెనని, వణిక్కు లుద్బోధింపబడుచుండిరి. కుశానులకాలమునకు బూర్వము నందిపాద, త్రిరత్న, త్రిశూల, స్వస్తిక, నాగ, మత్స్య, గజ, అశ్వ, చంద్ర, మయూర, శృంగ, సరోవర, పద్మ, మకర—ఇత్యాది చిహ్నములు ముద్రించుచుండిరి. దీనినిబట్టి శిల్పులు లోహ

ములమీద విగ్రహములను జెక్కగలిగిన ప్రజ్ఞాతిశయమును



గడించియుండిరనుట స్పష్టము.

బౌద్ధయుగమున నీ విద్య క్రమక్రమముగ వికసించి ప్రౌఢదశ నొందగలిగెను. శిల్పసూత్రములు, ధ్యానమంత్రములు, లక్షణగ్రంథములు క్రమముగ బయల్వెడలెను. లోహవిగ్రహములను పోతపోయుపద్ధతి ఎప్పుడు ప్రారంభమయ్యెనో చెప్పుట కష్టసాధ్యమైనను, క్రీస్తుతరువాత నాలుగైదుశతాబ్దుల నాటికే లోహవిగ్రహములు పోతపోయబడుచుండినట్లు దృష్టాంతములు గలవు. "శైలజాత్ లోహజం శ్రేష్ఠం" అని శిల్పగ్రంథములందు బ్రశంసించుటనుబట్టికూడ, హేమాద్రికాలమున కింక బూర్వమే ఈ స్థపితవిద్య దేశములో వ్యాపించియుండవలెనని చెప్పకతప్పదు. పల్లవుల రాజధానియగు కాంచీపురమున కోటకు కంచుతో పోతపోయబడిన ద్వార ముండినట్లు చెప్పబడినది. కృష్ణాజిల్లాలో, గుప్తులకాలమునాటి, అనగా 5 వ శతాబ్దినాటి బుద్ధుని కంచువిగ్రహ మొకటి దొరకెను. 7 వ శతాబ్దిలోనే పల్లవుల శిల్పకళానైపుణ్యము విజృంభింపదొడగెను. మహాబలిపురమున శిలారథము శిలాగజము మొదలగు చెక్కడపుపనులు నాడే ప్రారంభమయ్యెను. చోళవంశపు రాజులు రాతిచెక్కడపు పనులతోపాటు లోహవిగ్రహములను జేయుపద్ధతులనుగూడ బ్రోత్సహించుచుండిరనుట నిశ్చయము. దేవాలయములలోని గర్భాలయములందు ప్రతిష్ఠింపబడు విగ్రహములు సర్వసామాన్యముగ రాతివైనను ఉత్సవవిగ్రహములు, భోగమూర్తులుమాత్రము లోహప్రతిమలుగ నుండెడివి. చోళులకాలములో "మూర్తిదానము" రాజులకు విధిగ మహాదానములలో శాసింపబడెను. మొదటి రాజరాజుకాలమున (క్రీ। శ॥ 985—1018) తంజా

వూరునందలి బృహదీశ్వరుని ఆలయమున చెక్కబడిన శాసనమునందు రాగి విగ్రహములను గూర్చిన ప్రసక్తి గలదు. ఈ రాజరాజేశ్వరుడు బృహదీశ్వరుని ఆలయమునకు జాల గ్రామములను విగ్రహములను దానముచేయుటచే, నాతనికి "శివపాదశేఖర" అను బిరుదము కూడ నొసగబడెను. ఉత్తర హిందూస్థానములోకంటె, దక్షిణ దేశములో లోహ విగ్రహములను జేయు నైపుణ్యము బహుప్రాచీన మగుటయే కాక, అయ్యది పరాకాష్ఠనుగూడ జెందెనని చరిత్ర పరిశీలనమున దెలియగలదు. లోహ విగ్రహములతోపాటు, కంచు దీపపు సెమ్మె లతిరమ్యముగ జేయబడుచుండెడివి. దక్షిణ దేశపు ఆలయములలో రాజులు, వర్తకులు దానము చేసిన ప్రాచీన లోహ దీపస్తంభములు నేటికిని గానవచ్చుచున్నవి. దక్షిణదేశమున విష్ణువిగ్రహములుగూడ జాల నుండినను శైవ విగ్రహముల కళానైపుణ్యము వానిలో జూపట్టుటలేదు. శైవ విగ్రహములలో, నటరాజ విగ్రహము జగద్విఖ్యాతమైనది. విలియం రోథెన్‌స్టీను పండితుడు నటరాజును గూర్చి వ్రాయుచు నిట్లు నుడివెను:—

"No Chinese artist had reached greater perfection of poise and form than the Nataraja bronzes or the ecstatic figures of Sundaramurthi Swamy achieve."

సుప్రసిద్ధ శిలావిగ్రహ నిర్మాతయగు అగస్టీ రోడిన్ ఆచార్యు డిట్లు ప్రశంసించినాడు:—

"The Indian Nataraja can well contest for superiority in gracefulness with the gesture of the Venus de Medicis which defends its charms by the arms while Siva does the same by an ingenious gesture."

విగ్రహ నిర్మాణ విద్య

పూర్వకాలమున గొన్ని కుటుంబములవారీ విగ్రహ నిర్మాణవిద్యను వంశపరంపరానుగతముగ నభ్యసించి ఆచార్యత్వము వహించుచుండిరి. ఈ సిద్ధహస్తుల దివ్యచాతుర్యము లక్ష్యముగనెంచి ఎన్నియో లక్షణగ్రంథములు వహితము బయల్వెడలెను. దేవతల విగ్రహములు దశతాళ ప్రమాణము గలవిగ నుండవలెననియు, దేవీ విగ్రహములు వానికంటె చిన్నవిగ, అష్టతాళప్రమాణముగలవిగ నుండవలెననియు శాసించిరి. "అష్టతాళా భవేద్దేవీ" అనగా దేవియొక్క శీర్షమునకు విగ్రహము ఎనిమిదిరెట్లు అధికపరిమాణముగలదిగ నుండవలెనని విధించుచుండిరి. బాలావిగ్రహములు "పంచతాళస్మృతా బాలా" యనికూడ నిరూపించిరి. సామాన్యముగ నీ విగ్రహములు పంచలోహములలో—అనగా రాగి, ఇత్తడి, వెండి, బంగారము, తగరములలో—చేయబడవలెనని విధింపబడినను దక్షిణదేశమందు సర్వసామాన్యముగ రాగితోనే జేయబడుచుండెను. విగ్రహములను బోతపోయుటకుముందు మూసల నెట్లు కట్టవలెనో ఆ విధానమంతయు లక్షణగ్రంథములందు స్పష్టీకరింపబడినది. "లోహజం సకలంయత్తు మధూచ్ఛిష్టేన నిర్మితం" మైనముతో ముందు విగ్రహమును నిర్మించవలెను. మకుటములు, కేయూరములు, వలయములు, హారములు, కటిబంధములు, ఊరుబంధములు, నూపురములు మొదలగు అలంకారములన్నియు సన్నని పోగరలతో నామైనపువిగ్రహములపై బహుసుకుమారముగ జెక్కవలెను. పిమ్మటమెత్తని బంకమట్టితో నా విగ్రహముపై పూతపూసి మట్టి విడిపోకుండునట్లు ఇనుపతీగెల యల్లికతో జుట్టవలెను. తరువాత అగ్నిని చూపినయెడల, మైనమంతయు గరగి, సన్నరంధ్రములగుండ బయటకు వచ్చివేయును. అంతటితో మూస

యేర్పడును. లోహమును గరగించి, వడపోసి, ఆ మూసలో పోసినచో విగ్రహమేర్పడును. ఆ విగ్రహమును నునుపుచేయుటకును, అలంకారముల దీప్తిని మెరుగుచేయుటకును ఎంత కాలమో పట్టును. శిల్పగ్రంథములు గుల్లవిగ్రహములను నిషేధించినవి. దక్షిణదేశమునందు కానవగు విగ్రహములన్నియు సర్వసాధారణముగ గట్టివి. ఈ విగ్రహములు ధ్యానమంత్రముల ప్రతికృతులుగ నుండును. రసానుగుణములైన భంగములతోను, ముద్రలతోను ఒప్పియుండును. ఆ ముద్రలు దివ్యక్రియలు కాని, మానవభావప్రదేశసూచకములైన హస్తవిన్యాసములు కావు. ఈ సామాన్యపు హస్తవిన్యాసములు కంపెనీ నాటకములకును, సినిమా ప్రదర్శనములకును బరిపాటి యగునే కాని రసాత్మకమైన శిల్పవిద్య కనుగుణములైనవి కావు. వానియందు రసమొప్పదు. విగ్రహములందలి ముద్రలందుకనియే "దివ్యక్రియ"లై యుండవలెనని విధింపబడినది. భరతమునిప్రణీతమైన నాట్యశాస్త్రపరిచయ ముండినగాని యీ దేవతావిగ్రహముల సమభంగ, అభంగ, త్రిభంగ, అతిభంగాది భంగిమములు, కటకా, సూచీ, లోల, అర్ధచంద్ర, వరద, అభయాది హస్తములు, అర్ధనిమీలిత, నిమీలిత, ఉన్మీలితాది దృగ్భేదములు మొదలగు విశేషములు బోధపడవు.

1933

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)
151

## శిల్పులు—కర్మకారులు * *

మానవప్రతిభాప్రసూతమగు అలౌకికసృష్టివిలాసమే శిల్పము. "శిల్పం కౌశలం శీలస్సమాధా" అన్నారు శాబ్దికులు. చిత్తవృత్తుల యేకాగ్రతవలన సమాధి కలుగుచున్నది. సమాధిలభ్యమైన దర్శనముచే కౌశలము సిద్ధించుచున్నది. కౌశలఫలమే శిల్పము. "యోగః కర్మసు కౌశలం" అని గీతాకారుడు కూడ సూచించియున్నాడు. శిల్పమనిన సృష్టికాని అనుకరణముగాదు.

శిల్పమునకు సౌందర్యరససృష్టియే ప్రధానలక్ష్యము. జగన్మోహనుని అనంత సౌందర్యలీలలు మానవుని బయటను, అంతరంగమునను చిత్రవిచిత్రగతుల బ్రదర్శింపబడుచున్నవి. కాని యివి కేవలము చర్మచక్షువులకు అంతగ గోచరింపవు. శిల్పి తన ప్రేమనయనములతో వానిని వీక్షించి ఆత్మరసానురూపఖేలనమున వెల్లడించి చరితార్థుడగుచున్నాడు. వాని రచనలు భక్తిమహిమాన్వితములగుటచే, భావోద్దీపికములై సర్వజనపూజ్యములగుచున్నవి.

శిల్పులు కవితుల్యులు—మంత్రద్రష్టలని కూడ జెప్పవచ్చును. కౌతూహలముతప్ప వీరి రచనలకు వేఱుద్దేశము ఉండదు. వారి చిత్తసాగరము భావపూర్ణిమచే వెల్లివిరిసి నాట్యమాడును. ఇంతకంటె శిల్పమునకు వేఱులక్ష్యము లేదు. శిల్పులయందలి సౌందర్యరసానుభూతిని బట్టియు, రచనావిన్యాసమును బట్టియు, శిల్పమునందు ఉత్కర్షాపకర్షలు తార

తీమ్యము లేర్పడినమాట నిజము. దేశకాలపాత్రముల ననుసరించి శిల్పప్రతిభ పలువిధములుగ బ్రకాశించినది. అందువలన శిల్పమున కనేక నామాంతరము లేర్పడినవి. కాని మూలము నందు మాత్రము ఆనందరసానుభూతియే శిల్పవస్తువు.

ఇటీవల శిల్పమును సంకుచితార్థమున వ్యవహరింప మొదలిడిరి. శుక్రనీతిసారమునందు ప్రతిమాప్రాసాదాది నిర్మాణకౌశలమే శిల్పమని నిర్దేశింపబడినది. రానురాను వాస్తుశాస్త్రమే శిల్పముగ నెంచబడుచుండెను. కాని శిల్పమున కీయర్థమే రూఢమైనదని చెప్పుటకు వీలులేదు. శిల్పములే కళలని కొందరు విచక్షణులు, అవి వేఱువేఱని కొందరు విచక్షణులును నిర్ణయించినట్లు కన్పట్టుచున్నది. " శిల్పం కలాదికం కర్మ " అన్నది అమరకోశము. దీనినిబట్టి శిల్పమునకు కళకు అభేదమేర్పడుచున్నది. హేమచంద్రుడు కూడ నీఅమరసింహునితో నేకీభవించినాడు.

కాని మరికొందరు శాబ్దికులు కౌశలవికాసము కళయనియు, సౌందర్యవికాసము శిల్పమనియు నిరూపించిరి. భరతశాస్త్రమునందు "నసాకలా నచ్ఛిల్పం యన్నాట్యే న ప్రకాశితం" నాట్యశాస్త్రమునందు బ్రకాశింపని కళగాని, శిల్పముగాని లేదు. అందుచేత రెంటికిని భేదము గమనింపబడుచున్నది. శుక్రనీతిసారము విద్యలనుగూర్చి వ్రాయుచు విద్యలు ముప్పదిరెండనియు, కళలు అరువదినాలుగనియు చెప్పి వాగ్వ్యాపార సాధ్యమగునవి విద్యలనియు, మూఢులుకూడ జేయదగినవి కళలనియు నిర్వచించినది.

శ్లో. యద్యత్ స్యా ద్వాచికం సమ్యక్ కర్మ విద్యాభిసంజ్ఞితం
శక్తమూకోపి యత్ కర్మ కలాసంజ్ఞాస్తు తత్ స్మృతమ్.

కాని ఇట్టివిభాగ మితరగ్రంథములయందు కానరాదు. వామనకృతమగు కావ్యాలంకార సూత్రవృత్తియందు వాగ్వ్యాపారమైన సంగీతమును కళయని పేర్కొనుటచే, శుక్రనీతిసారమునకును దీనికిని మతభేదము గన్పట్టుచున్నది. వాత్స్యాయనుడు కామసూత్రములందు "లోకజ్ఞతాం గమయతీతి కళా"యని వ్యుత్పత్తిని నిర్దేశించి, లోకజ్ఞతనుజేకూర్చునట్టి చతుష్షష్టికళలలో గీతము, వాద్యము, నృత్యము, ఆలేఖ్యము, తక్షకము, కావ్యక్రియ మొదలగు విద్యలనన్నిటిని కళల క్రింద జేర్చినాడు. "ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కళాసు చ" అను అగ్నిపురాణవచనము కళావిజ్ఞానమునకు గూడ కావ్యసంసేవనమువలన గలిగెడి ఫలమును సూచించుటచే, కళకు శిల్పార్థ మారోపింపబడుచున్నది. ఈ సందర్భములనుబట్టి, శిల్పము, విద్య, కళ యను పదములు తుదకు పర్యాయపదములైనట్లు తోచుచున్నది.

ఈ విభాగ మెట్టిదైనను,శిల్పమునకును కర్మవిద్యకును భేద మనాదినుండియు గమనింపబడుచుండినదనుట నిస్సంశయము. విష్ణుసంహితయందు శిల్పులకును కర్మకారులకును భేదము నిర్దేశింపబడినది. స్వతంత్రముగ రూపకల్పనలను జేయగల ప్రతిభాశాలురు శిల్పులనియు, వారి రూపకల్పనల ననుకరించు సిద్ధహస్తులు కర్మకారులనియు నా సంహితయొక్క నిరూపణము. శిల్పమును కులవృత్తిగ జేసికొని పణ్యద్రవ్యములను నిర్మించు శ్రమజీవులు (Craftsmen, artisans) కర్మకారులనియు,కౌతూహలముకొఱకు స్వతంత్రముగ సృష్టిచేయు ప్రతిభాశాలురు (artists) శిల్పులనియు దీనినిబట్టి తేటపడుచున్నది. శిల్పులు కర్మకారులకు గురువులు. వారిరచనలు వీరికి లక్ష్యములు. వాని ప్రచారమే వీరి కర్మకలాపము.

కర్మకారులే లేనియెడల శిల్పులరచనలు దేశమునందు వ్యాప్తి పొందెడివికావు. నటరాజవిగ్రహమునుగాని, చంద్రశేఖరుని విగ్రహమునుగాని ఆదిని సృష్టిచేసిన ప్రతిభాశాలురెవరో తెలియదు. కాని ఆ విగ్రహములను ధ్యానశ్లోకముల సాహాయ్యముచేతను, తాళమానములచేతను గ్రామములలోని కర్మకారులు పోతపోసియో, చెక్కియో, ప్రత్యాలయమున బ్రతిష్ఠింపగలిగిరి. కర్మకారులైనను కేవలము బాహ్యవస్తువునుజూచి నకలుచేయువారుకారు. ధ్యానశ్లోకములే వీరి రచనలకు ఆధారములు. ఆధ్యానశ్లోకములనుబఠించుటచేతచిత్తమునందు తేజరిల్లు మానసమూర్తిని రాతిలోనో, దారువునందో, పటముమీదనో రూపొందించగల ప్రజ్ఞావంతుడే కర్మకారుడు. అసలు ప్రప్రథమమున నీమూర్తికల్పనలనుజేసిన మహనీయులకు ధ్యానశ్లోకముల సాహాయ్యముగూడ లేదు. వారు సర్వస్వతంత్రులు. కర్మకారులకు భిక్ష పెట్టగలిగిన ప్రతిభాశాలురు. అట్టి ద్రష్టలు సర్వకాలముల బ్రభవించరు. వారి రచనలు అపూర్వములు. కర్మకారులు వీనిని లక్ష్యముగ జేసికొని విగ్రహనిర్మాతలయ్యెదరు. గ్రామములలోని స్వర్ణరజతకారులు, దేవాలయనిర్మాతలు, తక్షకులు, భరతశాస్త్రవేత్తలు నిజముగ మొదటిశ్రేణికి జెందిన శిల్పులుకారు. వీరు శిల్పరత్నములను గాపాడు రెండవశ్రేణికి జెందిన కర్మకారులక్రిందనే పరిగణింపదగుదురు.

ఈ కర్మకారులకును, ఫ్యాక్టరీలలో యంత్రములయందు పనిచేయువారికిని హస్తిమశకాంతరముగలదు. యంత్రములలో బనిచేయువారిలో కళానైపుణ్యముగాని సౌందర్యబోధగాని యుండదు. యంత్రములను త్రిప్పనేర్పరితనము తప్ప వేరుకౌశలముండదు. కర్మకారులకు శిల్పులే

గురువులగుటచే, వారియందు ధారణాశక్తియు, హస్తకౌశల 
మును సమానముగ బెంపొందును. కర్మకారుల హస్తములు సజీవములు. వారుపయోగించు పనిముట్లు వారి స్వాధీనములు. యంత్రములలో బనిచేయు మెకేనిక్కులు యంత్రములకు దాసులు. వారికి ధ్యానధారణములతో బనిలేదు. రసానుభూతి అంతకంటెను గూడదు. వారి కర్మ కది ప్రతిబంధకము గూడ నగును.

చేతిపనులలోనున్న ప్రతిభ యంత్రనిర్మితవస్తువులలో నుండదు. చేతివ్రాతకును, అచ్చుకూర్పుకును ఎంతభేదము గలదో, చేతిపనులకును యంత్రపరిశ్రమలకును అంతవ్యత్యాసము కలదు. వ్రాయునగాని కలము హస్తస్పర్శచే సజీవమై, వాని ప్రకృతి యంతయు వ్రాతయందు ప్రతిబింబించును. అచ్చు అక్షరములకును అచ్చుకూర్చువానికిని ఎట్టి సజీవసంబంధమును లేదు. వ్యక్తిగతమైన విలాసమేమియు అచ్చుకూర్పునందు వ్యక్తముకాదు. కర్మకారుడు యజమాని, వాని పరికరములు వానికి విధేయులైన నౌకరులు. యంత్రము ప్రభువు, యంత్రములో బనిచేయువారు కేవలము యంత్రమునకు దాసులు. యంత్రము తిరిగినట్లు అతడు తిరగవలసినదేకాని, చేతి పనిముట్టువలె, యంత్రము వాని చిత్తవృత్తి ననుసరించదు. యంత్రనిర్మితవస్తువు కేవలము కృతకము. చేతిపని స్వభావసిద్ధము.

యంత్రనిర్మితవస్తువు లే దేశములో తయారైనను మాదిరి ఒకటే. వానియందు ఆయా దేశముల స్వభావము ప్రతిబింబించదు. ప్రజల యభిరుచుల నాకర్షించినగాని, తమ సరకులు విడుదలకావను ఆర్థికసూత్రమును ఉత్పత్తిచేయువారు గమనించి, ఆయా దేశముల రచనాభేదములను

వైఖరులను యంత్రములచే ననుకరించి వాని సహజవిలాసము లను నాశనము చేయుటకూడ సంభవించుచున్నది. జపాను జర్మనీలనుండి దిగుమతియగు ఆటబొమ్మలే యిందుకు నిదర్శనములు. ఆ దేశములలో వీనినుత్పత్తిచేయువారు హిందువుల యభిరుచులను గనుపెట్టి మన హిందూవిగ్రహములవంటిదిరి రబ్బరు సెల్యూలాయిడు బొమ్మలను యంత్రములలో తయారు చేసి, ఓడలకొలది మన దేశమునకు దిగుమతిచేయుచున్నారు. వానిలో మన దేవతారూపములందలి దివ్యత్వముగాని, సౌందర్యముగాని ఎంతమాత్రము గోచరించదు. మన బాలబాలికలకు అట్టి బొమ్మ లాటవస్తువులగుటచే, బాల్యమునుండియు దేశీయుల యభిరుచులు మంటగలియుటకు గారణమగుచున్నది. మన కర్మకారులు సహితము దిగుమతియగు వస్తువుల డిజైన్ల ననుకరించి, మన కళాసంప్రదాయమును నాశన మొనర్చుచున్నారు. ఇదంతయు కళావిధ్వంసమునకు గారణము.

మన చేతిపనులు నానాటికి నాశనమగుటకు కేవలము యంత్రపుపోటీయొక్కటే కారణముకాదు. యంత్రిసంపర్కముచే మన చూపులు, రుచులుకూడ చెడినవి. యంత్రనిర్మిత వస్తువులు చౌకయను కారణముచేతనేకాక, ఎక్కువ అందముగనుండునను భ్రమతో వానిని గొనుట సంభవించుచున్నది. ఇప్పుడు కుటీరపరిశ్రమలను బునరుద్ధరించుటకు దేశములో సంకల్పముదయించుట శుభసూచకము. కాని ఈయుద్యమము జయప్రదము కావలెనన్న, మన యభిరుచులు తిరిగి మారవలెను. చేతిపనులలోనుండు సహజసౌందర్యమును, దేశీయ సంప్రదాయమును జూచి హర్షించగల రసజ్ఞత మన కలవడవలెను. మన కర్మకారులు కేవలము పురాతనపు తీరులనే అవలంబించుటవలన ప్రయోజనము లేదు. కాలమానము

ననుసరించి, దేశసంప్రదాయానుగుణ్యముగ క్రొత్తడిజైన్లను, క్రొత్తవిలాసములను గూర్పవలసియున్నది. కాని ఈ పని కేవలము కర్మకారులు చేయగలదికాదు. స్వతంత్రశిల్పులీ పనికి బూనవలెను. ప్రతిభాశాలురైన కళావిచక్షణులు నవ్య సృష్టిని గావించి, కర్మకారులను క్రొత్తత్రోవలలోనికి నడువ వలసిన బాధ్యత కలదు. దేశములోని కళాసంపద కర్మకారుల మీదనే ఆధారపడియుండును. కర్మకారులను సరియైన మార్గములందు బెట్టగలిగినది కళాకోవిదులు. గ్రామోద్ధార కులు కళలకును కుటీరపరిశ్రమలకును గల సంబంధమును గమనించినగాని కృశించిన మన చేతిపనులు తిరిగి ప్రాణము పోసికొని నూతనచైతన్యముతో విలసిల్లనేరవు.

చేతిపనులనే నిజమైన స్వదేశపరిశ్రమలనుగ నెంచ వలయునని గాంధీమహాత్ముడు నిర్దేశించినాడు. కాని ఈ నిర్వ చనమంతటితో బూర్తికానేరదు. చేతిపనులలో నేడు విజా తీయసాంకర్యము చాల గోచరించుచున్నది. మన నవీనుల యభిరుచి ననుసరించి, మనకర్మకారులు స్వసంప్రదాయము లను విడనాడి యురపియను వస్తువుల లక్ష్యములుగ నెంచు చున్నారు. బట్టల అద్దకములలో, తివాసీలరంగులలో, గృహ పాత్రల ఆకృతులలో, చెక్కడపుపనులలో, గృహనిర్మాణ ములో పాశ్చాత్యానుకరణ మెక్కువగ ప్రబలుచున్నది. ఈ యనుకరణమైనను పాశ్చాత్యుల ప్రశస్తశిల్పవైఖరుల నాశ్ర యించియుండిన గొంతవఱ కాదరణీయముగావచ్చును. కాని పాశ్చాత్యకళాకోవిదులు విసర్జించినవానినిగాంచి, జనసామా న్యముకొఱకు మిల్లులలోతయారగు బజారుసరుకులనుజూచి, మన నవీననాగరికులు ముగ్ధులగుచుండుటచే, మనకళాసంప్ర దాయమేగాక, సహజమైన రసజ్ఞతకూడ నశించుచున్నది.మన

యభినవశిల్పులు తిరిగి మన కర్మకారులకు గురువులు, మార్గదర్శకులు అయినగాని, మన చేతిపనులు మరల చిత్తాకర్షకములు కాజాలవు. గ్రామపునర్నిర్మాణమునకు బూనుకొను వారు స్వదేశవస్తు ప్రదర్శనముల నేర్పాటు చేయునప్పుడు, ఏవి కళాశోభితములో, ఏవి కావో మన శిల్పాచార్యులచే నిర్ణయింపజేసి వా రామోదించిన చేతిపనులనే ప్రదర్శనములయం దుంచు నియమమును గమనింప వలసియుండును.

1934 *

## నృత్య కళ * *

మన పూర్వులు నిరూపించిన చతుష్షష్టి కళలలో నృత్య విద్యకు ప్రధానస్థాన మీయబడినది. పాశ్చాత్య దేశములందు కూడ లలితకళలలో నృత్యమునకు ముఖ్యస్థానము గలదు. నృత్యము సభ్యజాతులలోనేకాక, అసభ్యజాతులందుకూడ స్వభావసిద్ధమైన సౌందర్యముతో విరాజిల్లుచున్నది. నృత్యము నభ్యసించని ఆరణ్యకజాతి లేదనియే చెప్పవచ్చును.

మన దేశమునందు నేటికిని ఆరణ్యకజాతులు చాల కలవు. మనసభ్యత యురపియనుసభ్యత వంటిది కాదు. యురపు ఖండమున మహాప్రళయతుల్యమైన నాగరకతవలన, అసభ్య జాతులెన్నియో నామరూపములు లేక నశించినవి. కాని మనదేశములో నట్లుకాదు. మనదేశమునం దిప్పటికిని పర్వ తారణ్యప్రాంతముల నివసించు జాతు లనేకము కలవు. వేల కొలది సంవత్సరములనుండి హిందూసభ్యత దివ్యతేజముతో వెలుంగుచున్నను, ఆ యరణ్యాజాతులవా రింకను హిందూ నాగరకతకు వశులుకాక, తమ సహజరూపమును గాపాడు కొనుచు వచ్చుచున్నారు. ఆంధ్రదేశమున కోయలు, చెం చులు, ఎరుకలు, ఏనాదులు మొదలగు అనాగరకజాతులు కలవు. ఇతర ప్రాంతములలో తోడాలు, భిల్లులు, ఖాండ్లు మొదలగువారు కలరు. న్యూజిలెండు, ఆస్ట్రేలియా, అండ మాను మొదలగు ద్వీపములలో నారణ్యకజాతివా రింకను ఉన్నారు. వీరెల్లరు నృత్యపరాయణులు. వీరియందు నృత్యము

పర్వదినములయం దెల్ల పలువిధములుగ జరుగుచుండును. బాలబాలికలే కాక, యువతీయువకులు, వృద్ధులుకూడ గలసి నృత్య మొనర్చుచుందురు.

వీరి నృత్యవిన్యాసములం దొకవిధమైన సరళత వెల్లడి యగుచుండును. కొందరు గీతవాద్యములనుజేర్చి నర్తించె దరు. కొందరు చప్పట్లు చరచుచు నాడెదరు. పరస్పరము చేతులుపట్టుకొని మండలాకారముగను, అర్ధమండలాకారము గను, గొంచెముసేపు వడిగను, గొంతకాలము అలసముగను, చిత్రవిచిత్రగతుల, వివిధభంగిమములతో నృత్య మొనర్తురు. ఈ నృత్యమునం దొకనూరు భూమి కంపించును. ఇంకొక మారు భూమి జనము నీనుచున్నట్లుండును. ఆ గతులశోభ వర్ణనాతీతము. ఆ యంగభంగిమముల కోమలత అతిమనో హరము. వాని జూచినప్పుడు తుచ్ఛపుతలంపులుకాని, నీచము లైన మనోవికారములుగాని కలుగుట కెట్టి యవకాశము నుండదు. ఆ నృత్యము సహజోల్లాసముయొక్క విలాసము. ప్రకృతిలో చరాచరజగత్తునందు స్వభావసిద్ధముగ జరుగు క్రీడ వంటిదది. కేవల సంతోషసమయములయందే కాక, దుఃఖసమయములయందుకూడ వారు నృత్యము సల్పుచుం దురు. శవము చుట్టును జేయు నృత్యము ప్రళయతాండవ మును బోలియుండును. జుట్టును విరియబోసికొని, చేతుల నాడించుచు, ఒడలుమరచి చిందులు త్రొక్కునప్పుడు, కేవ లము కాళికాదేవి ప్రత్యక్షమైనట్లుండును.

నృత్యము,మానవుని జన్మతో నేపుట్టినదని చెప్పవచ్చును. ప్రాగైతిహాసిక కాలమునుండియు నీవిద్య సార్వజనీనమై యుం డినట్లు గన్పట్టుచున్నది. లేగలలో ప్రాణము ఉబుకుచున్నదా యనునట్లు అవి వేయు గంతులు, విహంగములు ప్రణయ

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)



కాలమున రెక్కలు విప్పుకొని కులుకుచు వేయు అడుగులు— మానవునిదృష్టి నాకర్షించి, నృత్యకళగ నావిర్భవించుటలో నాశ్చర్యములేదు. ప్రాచీనకాలమున మనదేశమునందలి నృత్య విద్యాప్రాచుర్యతకు తల్లక్షణగ్రంథములే సాక్షులు. మన కావ్య ములందుగూడ దీని కనేక నిదర్శనములు కలవు. మహాభారత కాలమున సంఘమునందు సర్వోన్నతస్థానము వహించిన రాజ బంధువులు— స్త్రీలును, బురుషులును—నృత్యగీతాభినయముల యందు ప్రవీణులై యుండిరను విషయము విరాట్పర్వమునందు గానవచ్చును. అజ్ఞాతవాసమునందుండిన అర్జునుడు ఉత్తరకు నృత్యగీతాదులను నేర్పు నుపాధ్యాయుడగుట ఎల్లరు నెఱిగి నదియే. పలుకారణములచే నీవిద్య యిటీవల నంతరించినను, నృత్యపిపాసాతృప్తికై వేశ్యాసంఘము నేర్పాటుచేసి, వారికి దేవాలయములందుకూడ స్థానమొసగిరి. ఈ విద్య యట్లు కులటల పాలబడుటచే, శిష్టులకు బరిగ్రహణీయము కాకుండ పోయినది.

మానవునకు కళానుశీలనమువలననే సౌందర్యాను రక్తియు రసపిపాసయు తృప్తిచెందుచుండును. రసస్ఫూర్తికొఱకే కళ లేర్పడిన సంగతి విచక్షణులకు దెలియనిదికాదు. బాలు డత్యంత నృత్యప్రియుడు. వాని సహజోల్లాసమును నిరోధించ కుండ నుండినయెడల, నృత్యకళ సంఘమునందంతటను ఆవ హించి, అభివృద్ధిపొందక తప్పదు. స్పందనము జీవనమునకు బ్రధానలక్షణము. ప్రాచీనులు గ్రహనక్షత్రముల గానమును వినగల్గుచుండిరి. కనుకనే వేదములు ఛందోబద్ధములయ్యెను. గీత నృత్యములకు అవినాభావసంబంధముగలదు. ఒకదానిని విడిచి రెండవది యభివృద్ధిపొంద నేరదు. తాళము, మానము, లయ, గతియుక్తములు. గతి, స్పందనము నృత్యమునబయల్వెడ

టును. అందుకనియే శాస్త్రకారులు నాట్యక్రమము నిట్లు సూచించిరి :—

శ్లో. కంఠే నాలంబయేద్గీతం హస్తే నార్థం ప్రదర్శయేత్
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళ మాచరేత్.

రసభావ పరిజ్ఞానవిషయమున నృత్యమే ముఖ్యమని మన కళాకోవిదులు ప్రప్రథమముననే కనుగొనిరి. హృదయ సాగరము భావతరంగిత మైనప్పుడు దేహమునందలి స్నాయువుల కుత్తేజనముగలిగి అంగప్రత్యంగములకు సంచలనాదులు కలిగితీరును. ఆ సంచలనాదులను లయాన్విత మొనర్చుటయే నృత్యము. కావ్యములయందలి ఛందస్సు, సంగీతమునందలి తాళమానములు, చిత్తరువు లందలి రేఖావిన్యాసములు, నృత్యవిశేషములేయని తెలిసికొనదగును. ఆనందముయొక్క ఖేలనమే నృత్యమని సూచించుటకు ఒక కవి భోజనప్రియులైన బ్రాహ్మణులగూర్చి యిట్లు వర్ణించియున్నాడు :-

నృత్యంతి భోజనే విప్రా మయూరా మేఘదర్శనే

శరీరతత్వవిదు లీ నృత్యకళకంటె సర్వోత్తమమైన వ్యాయామము మరియొకటి లేదని సూచించుచున్నారు. నృత్యమువలన దేహమునందలి అంగోపాంగముల కెల్ల వ్యాయామము కలిగి, దేహపటుత్వము అభివృద్ధియగుననుటకు సందియములేదు. అయ్యది మానసోల్లాసమునకుకూడ సాధనభూతమగుటచే, దేహసౌందర్యమును, ముఖకాంతియుగూడ వికసించుట కవకాశముగలదు. ఈ కారణముచే నిప్పుడు యూరపు అమెరికా ఖండములలో ప్రైమరీస్కూళ్లయందు బాలబాలికలకు నృత్యశిక్ష నొసగుచున్నారు. ఒక సుప్రసిద్ధనర్తకి యిట్లు నుడువుచున్నది :— "కాలమును సుఖసంతోషము

లతో గడుపవలెననిన, నృత్యమొనర్పుము. శరీరారోగ్యమును సంపాదించుకొనవలెననిన, నృత్యముచేయుము. నృత్యము సమస్తరోగములకు దివ్యౌషధము. విషాదము నడంచి, సంతసమును గలిగించుటకు, సౌందర్యశోభను వృద్ధిపరచుటకు నాట్యకళవంటి సంజీవని మరియొకటిలేదు. నృత్యాభ్యాసము వలన, అప్సరసలను ధిక్కరించు సౌందర్యమును, యోగుల ననుగమించు చిత్తస్వాస్థ్యమును లభించును. ఆనంద మెచ్చట నుండునో, అచ్చట నృత్యముండును. హృత్పిండముయొక్క నర్తనమే జీవవిలసనము. ఈ నర్తన మాగినంతనే జీవితము ముగియును."

నృత్యానుశీలనములేని జాతి మృతప్రాయము. మన దేశములో ప్రస్తుతము తమస్సు రాజ్యముచేయుచున్నది. ఈ తమోరాజ్యమే శాంతమని భ్రమించుచున్నాము. శ్మశానవాటికయందు ప్రబలుశాంతమిది. శవమునందు జూపట్టు నిస్తబ్ధత యిది. ఇందువలననే భారతీయులు నృత్యకళను మరచిరి. మనజీవితము కేవలము ఆనందశూన్యమైనది. నృత్యమనుటతోడనే పరిహాసముచేయు దురవస్థకూడ దాపరించినది. ఒక కాలమున నృత్యకళ ఆంధ్రుల భాగ్యమనుటకు నేటికిని దేవాలయములయందలి చెక్కడపుబనులలో నృత్యవిలాసములెన్నియో సాక్షీభూతములై యున్నవి. నృత్యమయములై తనరారు మన వీధినాటకములిప్పుడు నవనాగరకులకు బరిహాసపాత్రములై పోయినవి. ఆంధ్రజాతియందు స్తబ్ధమైయున్న ఆ యమృతవాహిని సంగీతసాహిత్యములయందు, శిల్పనృత్యములయందు వెల్లివిరిసి, దేశము మరల భాగ్యభోగములతో విలసిల్లుగాక !

1934

## రూపకల్పన * *

బ్రహ్మసాధనప్రపంచము అతివిశాలమును గభీరమునై అధికార తారతమ్యమును బట్టి వివిధమార్గములు గలిగి ఒక మహా విశ్వవిద్యాలయమువలె గన్పట్టును. ధర్మసమన్వయమువలెనే సాధనసమన్వయముకూడ నప్పుడప్పుడు కల్గుచువచ్చెను. మొత్తముమీద నీవివిధసాధనములు జ్ఞానభక్తికర్మమార్గములుగ విభజింపబడెను. తిరిగి ప్రతిమార్గమునందును అనేక సోపానములు కనుపెట్టబడెను. జ్ఞానమార్గమున సాధనచతుష్టయము, ధ్యానధారణ యోగసమాధులు మొదలగు సోపానము లెన్నియో పేర్కొనబడినవి. ఒక్క యోగమార్గమున అనేకసాధనములు కలవు. భక్తిమార్గమున దాస్య సఖ్య వాత్సల్య మాధుర్య మహాభావములును, ఉద్బోధన స్తోత్ర వందన ప్రార్థన అనుతాప మంగళాదిభజనలును, 24 రసములును, అసంఖ్యాకములగు ప్రవత్తులును, తరంగమాలికలుగ విస్తరిల్లి అదియొక యనంతసాగరమువలె జూపట్టును. ఇక కర్మమార్గము, ఆశ్రమచతుష్టయముతో పంచమహాయజ్ఞములతో అంతములేని వ్రతములతో విధినిషేధములతో యజ్ఞయాగములతో జపతపములతోగూడి ఒకమహారణ్యమువలె గన్పట్టును. ఒక్క తాంత్రికుల యుపాసనావిధానమునందు 116 విభాగములు సూచింపబడినవి. వీనినన్నిటిని గూర్చి తెలిసికొనగోరువారి సంఖ్య కడుస్వల్పము. వానిని స్వానుభవమున తెలిసికొని పరిశీలించువారిసంఖ్య అంతకంటెను

స్వల్పము. ఇవి గ్రంథపఠనమువలన గాని తర్కసాహాయ్యము
168 వలన గాని అలవడు విద్యలు కావు. సిద్ధులగువారియొద్ద
శుశ్రూష చేయువారికే యివి లభ్యమగును.

వేదాంతులు ఉపాసనలను మూడు విధములుగ విభజించిరి. ప్రతీకోపాసన, సంపదకోపాసన, స్వరూపోపాసన యనునవి మూడుతరగతులు. అనధికారులు చేయునది ప్రతీకోపాసన. దీనినే అధ్యాసజనితోపాసనయందురు. "అన్యత్ర దృష్టః పరత్రావభాసః." ఒకవస్తువుయొక్క గుణమును మఱి యొకవస్తువునకు ఆరోపించుటయే అధ్యాస. రజ్జువును సర్పముగ భావించుట అధ్యాసము. శ్రోత్రజ్ఞానముచే అనగా వినికిడివలన కలిగిన జ్ఞానమును ఘటపటముల కారోపించి పూజ చేయుట ప్రతీకోపాసన. పూర్వుల యనుభవములను అనుశీలనము చేయుటే దీని యుద్దేశము. ఇందు అపరోక్షానుభూతి యెంతమాత్రము లేదు. సంపదకోపాసన నిమ్నాధికారులకొఱకు ఉద్దేశింపబడినది. నిమ్నాధికారి అనధికారికంటె నెక్కువ చిత్తసంస్కారము కలిగియుండును. స్వల్పవస్తువు మూలమున పెద్దవస్తువును ధ్యానముచేయుట నిమ్నాధికారి మార్గము. రెండువస్తువులకు గల సామాన్య ధర్మములు కనుపెట్టి, నిమ్నాధికారి చిన్నదానినుండి పెద్దదానిని, పరోక్షము నుండి అపరోక్షమును చేరగలుగును. బాలుడు నారింజ పండునుజూచి భూగోళముయొక్క ఆకారము నెట్లు తెలిసికొనునో, అట్లే సంపదకోపాసకుడు సూర్యుని స్వప్రకాశత్వమును జగత్ప్రకాశకత్వమును మనోగతముచేసికొని, బ్రహ్మము యొక్క స్వప్రకాశత్వమును జగత్ప్రకాశకత్వమును ధ్యానించును. బ్రహ్మము చిద్వస్తువు, నిరాకారస్వరూపము, అవాఙ్మానసగోచరము. ధర్మమార్గమునందలి ప్రథమావస్థయందు

దృశ్యమానపదార్థములగు బ్రహ్మాండములను జూచి బ్రహ్మము ధ్యానింపగలుగుదుము. సూర్యోపాసననుండి ప్రాణోపాసనకును, ప్రాణోపాసననుండి మనోపాసనకును, మనోపాసననుండిఅవతారోపాసనకును, క్రమక్రమముగ కక్ష్యాంతరములను దాటుచు నిమ్నాధికారి తుదకు అధికారి కాగలడు. సంపదకము గూడ నుపమానమువంటిదగుటచే దీనియందును ప్రత్యక్షానుభవములేదు. ఈ రెండు తరగతులును కేవలము సాంకేతికములు. వ్యవహారమునందివి విశుద్ధములుగ నుండజాలవు. ప్రచలితధర్మములందు ప్రతీకోపాసనయు సంపదకోపాసనయు పరస్పరపరిమాణగతప్రభేదములతో వర్థిల్లుచుండును. స్వరూపోపాసన ఉత్తమాధికారులకే సాధ్యము. ఆత్మయందు పరమాత్మోపలబ్ధిని పొందుటయే దీని యుద్దేశము. ధ్యానధారణములవలన బ్రహ్మైక్యత నొందుటయే దీనిసిద్ధి. చిత్తనివృత్తియుండినగాని స్వరూపోపాసన సాధ్యము కాదు. చంచలచిత్తమున చిద్వస్తువు ప్రకాశింపదు. ఏకనిష్ఠతో నిజస్వరూపము నుపాసించునప్పుడే సాక్షాత్కారము లభించును. స్తోత్రములచే చిత్తశుద్ధిని గావించుకొని యోగాభ్యాసమున సమాధ్యవస్థను పొందవలెను. ప్రతీకోపాసనయందు ఆత్మానాత్మవిచక్షణ లేదు. సంపదకోపాసనయందు సమాధ్యవస్థలేదు. ఒక స్వరూపోపాసకులకే బ్రహ్మసాక్షాత్కారము సాధ్యము.

బ్రహ్మోపాసన సాధనవిషయము. వివిధసాధనములయందలి సత్యాసత్యములు స్వానుభవమునలననే తెలియునగును. ధర్మతత్త్వము సాక్షాదనుభూతిగ్రాహ్యము. ఏతత్త్వమును తర్కమువలన పూర్ణముగ సిద్ధాంతీకరించుటకు వీలులేదు. తర్కము శ్రద్ధావంతుని శ్రద్ధను దృఢపఱుపవచ్చును. కాని, శ్రద్ధ లేనివారికి అనుకూలవిశ్వాసమును పుట్టింపజాలదు.

సమగ్రజ్ఞానము మానవుని స్వానుభూతిపై ప్రతిష్ఠింపబడి యున్నను, మనస్సుచే పురికొల్పబడు తర్కము, మీమాంస, విచారణ, అనుభవమును బయటనుండిమాత్రమే విమర్శింపగలుగును. కార్యమును జూచి కారణమును గ్రహించినపుడు బుద్ధికి కనబడునది కారణముయొక్క నిజస్వరూపము కాదు. మీమాంస కార్యము వెనుకనుండు కర్తయొక్క రూపమును ప్రతిష్ఠింపగలుగును; ఆ రూపము కేవలము సత్తామాత్ర జ్ఞేయము. అనగా, ఉన్నది అని మాత్రమే చెప్పవచ్చును గాని ఆ వస్తుస్వరూపముయొక్క వివరణ మెట్టిదయినదియు చెప్పుటకు శక్యము కాదు.

"యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి।
యత్ప్రయంత్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ"

అని యుపనిషత్తులు బ్రహ్మతత్త్వమును నిరూపించుచున్నవి. కాని, ఈ వాక్యము బ్రహ్మముయొక్క బహిఃప్రకాశమునుమాత్రమే వర్ణించుచున్నది. బ్రహ్మమును దూరమునుండి చూపుచున్నది కాని, దాని స్వరూపమును లోపలనుండి వెల్లడించుటలేదు. బ్రహ్మపదార్థమును మనము తెలిసికొనుచున్నది తర్క-సంబంధమైన "అనుమానము"వలననే గాని, అనుభవమువలన కాదు. సూర్యుని తేజస్సును మాత్రము చూడగల్గియు తదీయ స్వరూపమును చూడలేనట్లు మనస్సువలన బ్రహ్మముయొక్క బాహ్యరూపప్రకృతులను కొంతవఱకు తెలిసికొనుచున్నామే కాని, బ్రహ్మదర్శనలాభమును బ్రహ్మస్పర్శసౌఖ్యమును అనుభవింపజాలము. దర్శనలాభమును పొందనియెడల బ్రహ్మసాక్షాత్కారము పూర్తి కానేరదు. మనస్సునకు వస్తుతత్త్వము అజ్ఞాతమును అజ్ఞేయమునుగూడ నగుచున్నది. బ్రహ్మాండముయొక్క కార్య

కారణసంబంధము విచారించి, జగద్రూపమునకు వెనుక కారణరూపము కలదని ప్రతిపాదించుచున్నాము. ఆ కారణ తత్త్వమునే యుపనిషత్తులు బ్రహ్మతత్త్వమని చెప్పుచున్నవి. ఆ తత్త్వము నిర్గుణము, నిరాకారము. కార్యకారణసంబంధ విచారణ మనోధర్మము. మనస్సునకు భేదవిచారణయందు సామర్థ్యము కలదు. అభేదప్రతిపాదనము మనస్సుయొక్క యధికారమునకు అందని పని. మనస్సెప్పుడును, "అవును, కాదు" అను నీ రెండు సంజ్ఞలయందే సంచరించుచుండును. కార్యమునకు కారణము గలదు. కార్యము కారణముకంటె భిన్నమైనది, స్వతంత్రమైనది. కార్యము దృశ్యము, కారణము అదృశ్యము; కార్యము ఇంద్రియప్రత్యక్షము, కారణము అనుమానప్రతిష్ఠితము; కార్యము సాకారము సవిశేషము, కారణము నిరాకారము నిర్విశేషము అనుచర్చను చేయగలిగినది మనస్సు. తర్కము మనల నీ సిద్ధాంతమువఱకే తీసికొని పోగలదు. "నేతి నేతి" అనియే మనస్సు చెప్పగలుగును గాని, ఆ పదార్థముయొక్క స్వరూపమెట్టిది యను ప్రశ్నకు ప్రత్యుత్తర మీయజాలదు. నిరాకారవాదము మానవుని మనోమయకోశమునకు మాత్రమే సంబంధించి యుండును. మానవుడీ కోశమును దాటలేనంతవఱకు నిరాకారనిర్గుణవాదమును అతిక్రమింపజాలడు. ఈ వాదము మనస్సునే బ్రహ్మమని తెలిసికొనుచున్నది. "మనోబ్రహ్మేతి వ్యజానాత్" అనగా, నీ బ్రహ్మము మనోమయబ్రహ్మము. ఇది తత్త్వముయొక్క ఒకదిక్కును ఒక యంశమును మాత్రమే వెల్లడింపగలుగును.

బ్రహ్మవాదు లీ యంశమును దాటి బ్రహ్మపదార్థముయొక్క మఱియొక దిక్కునుగూడ ప్రదర్శించిరి. సృష్టిస్థితి

లయములయందు బ్రహ్మమును మనము కారణరూపముగ చూచుచున్నాము. దానినే మన జీవనాంతరాళమున వివిధావస్థలందును అశేషపరివర్తనములందును సాక్షిచైతన్య రూపమున చూచుచున్నాము. పరిణామము జగత్తుయొక్క నిత్యధర్మము. జగత్తు ఎల్లప్పుడు తిరుగుచు, చంచలమై, విరామము నెప్పు డెఱుంగక ప్రవహించుచున్నది. ఇంద్రియములన్నియు నిరంతరము విషయప్రవాహమున తగుల్కొని కంపించుచున్నవి. దృశ్యవస్తువుల ఛాయలు చక్షువులపై ఒకదాని తరువాత నొకటి పడుచున్నవి, తొలగిపోవుచున్నవి. శ్రోత్రములందు భిన్నభిన్న ధ్వనులు ఒకదానితరువాత నొకటి శబ్దించుచు తిరిగి ఆకాశమున నంతరించుచున్నవి. ఇదేవిధముగ సకలేంద్రియములమీదను ఆయా ఇంద్రియములకు సంబంధించిన విషయసముదాయము నదీతరంగములవలె లేచిపడుచు వెంటనే తొలగిపోవుచున్నది. ఈ ఖండఖండములయిన దృశ్యములును ధ్వనులును రసగంధములును మన యింద్రియముల ద్వారమున జ్ఞానోదయమును గలుగజేయుచున్నవి. ఈవిషయస్పర్శ అతిచంచలము. ఇది యెప్పుడును గలుగుచుండును, పోవుచుండును. పూర్వమేది కలిగెనో, దానితరువాత నేది వచ్చెనో,ఆసంబంధము మనసులో నిలువనియెడల, పూర్వము గలిగినదాని యనుభూతితోడ, ఉత్తరక్షణమున గలుగు జ్ఞానమును సమసింపజేయుటకు వీలులేదు. శబ్ద స్పర్శ రూప రస గంధాదులగు విషయానుభవములు ఆసంబంధము లేనియెడల పూర్ణమైన విషయజ్ఞానమును కలుగజేయజాలవు. ఏతత్త్వము చంచలమగు విషయస్పర్శలవలనగలుగు క్షణికానుభవములను మనస్సులో సూత్రమునమణులవలె జాగ్రత్తపరచివిషయజ్ఞానమును సంభవింపజేయునో, దానినే సాక్షిచైతన్యమందురు.

ఇదియే సూత్రాత్మ, లేక సర్వగతమగు పరమాత్మ. శుద్ధసత్త్వమాత్రజ్ఞేయమగు బ్రహ్మతత్త్వము సర్వాతీతమే కాక, సర్వగతమగుపరమాత్మస్వరూపమనికూడ తెలిసికొనగల్గుచున్నాము. కాని, పరబ్రహ్మతత్త్వముసర్వాతీతమనినను, సర్వగతమనినను, దాని పూర్ణస్వరూపము వ్యక్తమగుట లేదు. సృష్టికార్యముల వలన పరబ్రహ్మస్వరూపమును, విషయస్పర్శముల క్షణికానుభూతివలన సాక్షిచైతన్యమగు పరమాత్మస్వరూపమును తెలిసికొనుచున్నాము. మనస్సువలన పరబ్రహ్మముయొక్క కారణరూపము నెట్లు తెలిసికొనగలుగుచున్నామో, అట్లే విజ్ఞానము వలన సర్వాంతర్యామి యగు పరమాత్మస్వరూపమును తెలిసికొనగలుగుచున్నాము. కాని, పరమతత్త్వముయొక్క ఈ రెండు దిక్కులను అనుమానప్రమాణమువలననే తెలిసికొనగలుగుచున్నాము గాని, అపరోక్షానుభూతివలన సాక్షాత్కారము చేసికొనుట లేదు.

ఈసాక్షాదనుభూతి గలుగుటమెట్లు? అనుమానప్రమాణమువలన ఇది సాధ్యముకాదని తేటపడినది. ఇందువలననే, భక్తులు, భగవాను డెవనిపై కృపనుచూపునో, అట్టివాడేబహుపుణ్యఫలమువలన సద్గురుచరణాశ్రితుడై ప్రత్యక్షానుభవము పొందగలుగునని చెప్పుచున్నారు. కాని, లోకహితార్థము బ్రహ్మవిదులు అనేకోపాసనలను కల్పించిరి. ఒక సూర్యకిరణముచే అనంతకోటిస్ఫటికము లొక్కమారుగ ప్రకాశించు విధమున, ఎవనియంశాన్స్పర్శచేసమస్తస్థావరజంగమములును ప్రకాశించుచున్నవో, ఎవడు ధర్మజిజ్ఞాసయొక్క చరమయుక్తియు ప్రపంచవాసనల పరమనివృత్తియునై బ్రహ్మాండము నంతను ఓతప్రోతభావమున నిండియున్నాడో, ఎవనిలీలావిలాసమందు నిఖిలజగత్తు చకితమై పులకితమై విస్మితమై సుమధురక్షీర

ఖండన్యాయమున కరగిపోవుచున్నదో, అట్టిభగవానుని అట్టి పరమసుందరుని అట్టి నిఖిలరసామృతమూని అట్టి సచ్చిదానందవిగ్రహమును, స్వజీవనమున, స్వానుభూతియందు దర్శించి స్పర్శించి ఆస్వాదించి అమృతపదవి నందిన సిద్ధులయొక్క చింతనల, భజనల, యోగముల, సమాధుల, రూపకల్పనల రహస్యమును తెలిసికొనిన గాని బ్రహ్మసాక్షాత్కారమార్గమున ప్రవేశించుటకే వీలులేదు.

"చిన్మయస్యాఽద్వితీయస్య నిష్కలస్యాఽశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అని కులార్ణవతంత్రమున నొక సిద్ధపురుషుడు నుడివెను. మరియొక స్థలమున నొకయోగి

"సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా"

అని వాకుృచ్చియున్నాడు. రూపకల్పన చేయునది సిద్ధులు. ఉపనిషత్కాలమున ప్రబలిన తత్త్వాలోచనలతో వారు తృప్తినొందక, రసాత్మక మగు భక్తిమార్గము నున్నత పదవికి తెచ్చిరి. ఈ సందర్భమున ఆర్యుల యోగసాధన మెట్లు క్రమక్రమముగ వృద్ధిపొందినదియు తెలిసికొనుట యుక్తము.

వైదికకాలమున ఆర్యులు ఇంద్రవరుణాది దేవతలను అతి మనోహరముగ వర్ణించిరి. ఈ దేవతలు చాక్షుషమూర్తులు కారు. వీరు రూపులా? అరూపులా? అను విచారము అనాదిని లేదు. ఈమూర్తులు రూపములును కావు, అరూపములును కావు. రూపమును అరూపమును విడదీయు భేదబుద్ధి మానవుని శైశవావస్థయందుండదు. అందుకనియే ఆర్యులు మొదట

చూచిన దేవతలు రూపములని గాని అరూపములనిగాని చెప్పుటకు వీలులేదు. ప్రదోషకాలమున చీకటియు వెలుతురును కలసియుండునట్లు రూపమును అరూపమును గలసియుండెను. కాని, వరుణేంద్రాదిమూర్తులు ఆర్యుల మనమునందు క్రమముగ అతీంద్రియదృష్టిని ఉద్బోధించుచునే యుండెను. ఇంద్రియము లెప్పుడును అతీంద్రియునివంకకు తిరుగుచుండును. ఇది సృష్టిలోనిరహస్యము. మానవుడు శైశవావస్థను దాటినకొలది భేదబుద్ధి ప్రబలును, వివేకము హెచ్చును, నిత్యానిత్యవస్తువిచక్షణ తీక్ష్ణమగును, ఆత్మానాత్మజ్ఞానము వికసించును. ఆర్యులు దేవతలను చూచి చూచి, వర్ణించి వర్ణించి, అరూపమును నిరాకారమును సత్తామాత్రజ్ఞేయమును నగు అప్రత్యక్షవస్తువును పొందిరి. దీనిని "నేతి నేతి" వాక్యములతో నిరూపించుచు అజ్ఞాతమును అజ్ఞేయమును నగు మహాశూన్యసాగరమున బడిరి. సాకారనిరాకారభేదము లేని యవస్థనుండి విడివడి నిరాకారతత్త్వమును జెందిరి. ఆ నిరాకారమును పట్టుకొనలేక, సత్తు అని గాని అసత్తు అని గాని ప్రతిపాదించుటకు సాహసింపరైరి. అది మహాంధకారము. అది ప్రాణమునకు తృప్తినీయలేదు. బ్రహ్మసూత్రముల గల్పించిన వ్యాసభగవానుని చిత్తము వ్యాకులత చెందెను. అప్పుడు మహాశూన్యసింధువు మథింపబడెను. అంతట సకల రూపముల సారమగు లక్ష్మీదేవియు, సకలరసముల నిదానమగు అమృతమును ప్రత్యక్షమయ్యెను. వ్యతిరేకపథమున బడిన ఆర్యులు తిరిగి అన్వయమార్గమున జేరిరి. శూన్యము పరిపూర్ణతను చెందెను. సాకారము నిరాకారమును, నిరాకారము సాకారమును గప్పివేసెను. శబ్దమం దశబ్దమును, రసమునందరసమును, స్పర్శయం దస్పర్శయు వేణునాదముతో

ప్రబోధించుచు భక్తవత్సలుడు ప్రత్యక్షమయ్యెను. ప్రతి ప్రాణియందును యమునానది తరంగితమై పొంగుచున్నది. ప్రతి హృదయనికుంజమునను వేణుగానము ప్రతిధ్వనించు చున్నది. జగత్తు క్షీరఖండమువలె మధురరసమున గరగు చున్నది. జ్ఞానము భక్తిగ వికసింప నారంభించెను. భక్తి మహాభావమున లీనమయ్యెను. నిరాకారము సర్వాకార ముగ విరాజిల్లెను. భగవంతుడు అరూపుడు కాదు, బహు రూపి. అప్పుడు చక్షువులు విశుద్ధములై ఇంద్రియములందు అతీంద్రియరూపములను చూడగల్గెను. సర్వరూపములు, స్థావరజంగములగు సకలజీవులు, రసమూర్తులై భగవల్లీల యందు నృత్యము సలుపుచుండెను. ఉపనిషత్కాలమున కూడ నొకవిధమగు భక్తి కలదు కాని, ఆ భక్తికిని భాగవత కాలమునందలి భక్తికిని భేదము కలదు.

"ఈశావాస్య మిదగుం సర్వమ్ । యత్కించ జగత్యాం జగత్."

ఈశ్వరద్వారమున చంచలమగు విషయరాజ్యము నాచ్ఛాదన మొనర్చి ఈశ్వరునితో కామ్యవస్తువులను భోగించుచుండుము.

సత్యజ్ఞానానంతబ్రహ్మమును అంతరమను ఆకాశమున తెలిసికొని,ఆబ్రహ్మముతో గూడ సమస్తములగు కామ్య వస్తువులనుపభోగింపుము.అందు శుద్ధనిర్మలజ్ఞానముభక్తిసిక్తమైనను అయ్యది తన్మయత్వమును పొందించుటలేదు. ఆ యనంతమైన సౌందర్యము ఈ జగత్తులో ప్రతిఫలించి జగత్తు సౌందర్యమయమైనను, ఆ పరమసుందరుని స్పృశించుటకు అవకాశము చిక్కలేదు. కామ్యవస్తువులు మధురమైనవేకాని, ఆ మాధుర్యము ఆస్వాదింపబడలేదు. అంతరమున బ్రహ్మము ననుభవించినను వానిని చక్షువులతో చూచుట సంభవింపలేదు.

శ్రీ వేమన గ్రంథాలయము
వేలప్రోలు (కృష్ణా)



చక్షువుల గభీరపిపాస తృప్తినొందు టెట్లు? నేత్రములు "అలఖ్ నిరంజను" ని చూచుటకు భూనభోంతరాళమున వెదకు చున్నవి. ఆ ముఖమండలము ఆ సౌందర్యమూర్తి బయలు పడినగాని హృదయమునకు శాంతి లేదు.

ఇంద్రియ చాంచల్యమునకు కారణమేమి? ఇంద్రియములు వేనిని కోరుచున్నవో వానిని పొందకపోవుటవలన, యోగి కనులను తెఱవడు. కనులను తెఱచినతోడనే, ధ్యానావస్థయందు హృదయమందిరమున చూచిన యనంతమూర్తిని తాను ఎపుడు చూడలేకపోయెనో అప్పుడే యోగి తిరిగి కనులను మూసికొనును. ఎంతవఱకు ధ్యానమూర్తి బాహ్యమున కనబడదో, అంతవఱకును యోగి అస్థిరుడగుచునే యుండును. విషయితో విషయమును, రసముతో నింద్రియమును, మనుష్యత్వముతో మనుష్యుని అనుసంధానముచేసి, విషయ రాజ్యమున రసమూర్తిని ప్రతిష్ఠించినగాని, యోగియొక్క అస్థిరత పోనేరదు. "ఈశావాస్యమిదగుం సర్వం'' ఈశ్వరుని ద్వారమున సకలమును ఆచ్ఛాదనము చేయుమని ఉపనిషత్తులు చెప్పు భక్తిమార్గమునందీ స్థిరత లేదు. సకలకామములను బ్రహ్మతో భోగింపుడని ఉపనిషత్తులు బోధించుచున్నవి. బ్రహ్మమునే సకలభోగములతో ననుభవింపుమని భాగవతము ప్రబోధించుచున్నది. పూర్వకాలములో అరూపద్వారమున రూపమును భోగించుట. ఇప్పు డన్ననో రూపముద్వారమున అరూపమును ప్రత్యక్షము చేసికొనుట. పూర్వము అశబ్దమున శబ్దము వినుట, అరసమున రసము నాస్వాదించుట, అగంధమున గంధము నాఘ్రాణించుట. ఇప్పుడది యంతయు నతిక్రమింపబడినది. శబ్దద్వారమున అశబ్దమును, రసద్వారమున అరసమును, గంధద్వారమున అగంధమును, స్పర్శద్వార

మున అస్పర్శమును ప్రబోధించి, హృదయమర్మమునకు లాగి
178 కొనుము. భక్తవత్సలుడు భక్తుల ఆర్తప్రార్థనలను విని ఎట్టి రసజగత్తున బడవేసెను? వేదకాలమున రూపారూపములకు గల యైక్యత అల్పజ్ఞానముపై నాధారపడియుండెను. అప్పుడు వివేకములేదు. ఆత్మానాత్మ విచక్షణలేదు. అప్పటి జ్ఞానము ప్రదీపమునందలి వెలుతురువలెనుండెను. ఈ కలయిక అట్టిది కాదు. ఇక్కడ జ్ఞానము పరిపూర్ణమైనది. ఇక్కడ అనాత్మ యందు ఆత్మభ్రమలేదు. ఈ యైక్యత, ఈ యభేదజ్ఞానము అవిద్యచే కల్పితమైనవికావు. ఇది రససృష్టి. ఈమహాసాధనము నందు, రససృష్టియందు, యోగి రూపకల్పనలను జేయును.

"సాధకానాం హితార్థాయ। బ్రహ్మణో రూపకల్పనా."

రూపకల్పన సాధకులకు సహాయభూతమగును. కల్పన చేయునది సాధకులుకారు, సిద్ధులు. వారు తమ ప్రసన్న చిత్తమున దేని సాక్షాత్కారమునుపొందిరో, ఏరసము నాస్వాదించిరో, దానిని మొదట ప్రతిమల రూపమున ప్రకాశింప జేసిరి. సమాధిలో కలిగిన ఆత్మోపలబ్ధితో వారు తృప్తిపొందరు. ఏలయన, సమాధి నిత్యావస్థకాదు. సమాధి విడిపోయినప్పుడు సమాధిలో ప్రత్యక్షమైన ఇష్టదేవతను తిరిగిచూచుటకు ఇచ్ఛ కలుగును. జాగ్రదవస్థయందు ఆ స్వరూపమును ఇంద్రియ సమక్షమున నుంచుకొనుటకు యోగీంద్రులు రూపకల్పన చేయుదురు. వారు రూపకల్పన చేయునది తమ కొఱకే గాని ఇతరులకొఱకు కాదు. ఇంద్రియసంయమముచే చిత్తనిరోధముచే సమాధినిపొంది ఏ యుపాస్యదేవతా సాక్షాత్కారము పొందునో, దానిని తిరిగి బైటను ప్రవృత్తి యందు శబ్ద స్పర్శ రూప రస గంధములయందు ఉపభోగించుటకు యోగి యుత్కంఠ దగును. భక్తుడు తన రస

మూర్తిని తన యిష్టదేవతను తన హృదయేశుని తన యాత్మ మందిరమునందే కాక, జీవనమునందును సంసారమునందును సమాజమునందును వాఙ్మయమునందును శిల్పమునందును కళలయందును గానమునందును కావ్యములందును ప్రతిష్ఠించినగాని వాని యానందము పూర్తి కాదు. అప్పుడుకాని, వాని సాధన సిద్ధింపదు. ఇది ప్రేమయొక్క సహజలక్షణము. ప్రథమమున ప్రేమ బహుగూఢముగ సంచరింప నారంభించును. ఎప్పుడు ప్రేమ యుదయమగునో, అప్పుడు లజ్జయు భయమును నంకురించును. ప్రియురాలు మొదట తన ప్రేమను బహిరంగపఱచుటకు ఇష్టపడదు. ఇతరుల దృష్టి దానిపై బడుట కెంతమాత్రమును సహింపదు. సకలబాహ్య సంబంధములును దానికి అంతరాయము లని భావించును. తన మనోనాధుని హృదయమునందలి నిగూఢప్రదేశమునందుంచుకొని ఆనందించుచుండును ; ఉద్రేకమును పొందుచుండును ; సంకల్పసోపానముల నెక్కుచు ప్రియుని సంగమమున రాగనిమగ్న యగును. కాని, ప్రేమ వికసించినకొలది లజ్జ తొలగిపోవును. ఇక ఏకాంతభావము తృప్తి నియ్యజాలదు. ప్రియు నలంకరించి వానిని దూరమునుండి చూడగోరును. తన ప్రియుని ఇతరులకు జూపి వారిచూపుతో తనచూపును కలిపి, ఆనందము పొందుటకు ఆతురపడుచుండును. తాను జనసంఘమున లీనమై ప్రియుని కీర్తించును. తన శిశువును ఇతరు లెత్తి ముద్దాడినగాని తల్లి కానందములేదు. ఇది ప్రేమతత్త్వము.

అంతరంగికమైనదానిని జగత్తునందు ప్రకాశింపజేయుటకు ఏ వ్యాకులత భక్తున కుండునో, ఆ వ్యాకులతయే కవికి కూడ గలదు. కవి రూపరసములద్వారమున తాను

పొందిన దివ్యానుభవములను ప్రకటించుటకు అస్థిరుడగును. తన హృదయమున పొంగి తరంగితమై ప్రవహించు భావలహరిని శబ్దమున ఛందస్సున సంతమున ప్రపంచమునకు వినిపించినగాని కవికి తృప్తి లేదు. కవియొక్క ఆవేదన, భక్తునియొక్క వ్యాకులత, ప్రియురాలి విరహము—ఇవి యన్నియు రసజగత్తునందు రూపకల్పనలను పురికొల్పుచుండును. ఇయ్యది ప్రసూతివేదన వంటిది. ఇది సృష్టికి మూలము. ప్రియుడు కవి భక్తుడు—ఈ మువ్వురును తమ రసజగత్తును బయట ప్రతిష్ఠించుటకు ప్రయత్నింతురు. కాని, ఆ ప్రయత్నము సఫలము కానేరదు. అది వ్యర్థప్రయాస. రసజగత్తు బహిర్వస్తువు కాదు, అది అతీంద్రియము. దాని లావణ్యము రూపలావణ్యము కాదు, అది భావలావణ్యము. దాని సౌందర్యము భౌతికము కాదు, అది రససౌందర్యము, అనంగము, అరూపము, అనూహ్యమును. ఆ సౌందర్యమును ఆ మాధుర్యమును ప్రకటించుట యెట్లు? ఏ "కెమెరా" యు దాని రూపపటము నెత్తలేదు. ఏప్రియుడును తన నాయికను చిత్రించి తృప్తిపొందలేడు. ఏ కవియు రసానుభవమును వెలిపుచ్చగలభాషను ఛందస్సును కనుగొని శాంతచిత్తుడు కాలేడు. ఏ భక్తుడును తన ప్రాణపటమున జూచిన ఇష్టదేవతామూర్తిని ప్రతిబింబింపగల రూపమును ఈ జగత్తులో కనుగొని సంతోషస్వాంతుడు కాలేడు. ఇంద్రియాతీతమైన ప్రేమమాధుర్యమును రససౌందర్యమును భావలావణ్యమును ప్రకటింపగల భాష లేదు, ఛందస్సు లేదు, శిల్పము లేదు. ప్రకటింపుమని ఆవేదన యొకమూల ప్రేరేపించుచుండును. ప్రయత్నము వ్యర్థమైనందునకు ఒక మూల యసంతృప్తి

కలుగుచుండును. రసరాజ్యమున, ఆవేదనయు అసంతృప్తియు పొందుచుండుటయే ప్రయోజనము, ఫలము.

రసమునకు సంసారమే ఆశ్రయము. సంసారము రసముల లీలాభూమి. రసము సంసారమున బుట్టి సంసారము నతిక్రమించును. మహాసాగరమున తరంగములు దిగంతము వ్యాపించి క్రమముగ అనంతమగు నీలాంబరమున లీనమగు విధముననే, రసముకూడ వ్యక్తియందు బుట్టి సమాజమునకును, సమాజమునుండి విశ్వమునకును వ్యాపించి, తుదకు నిర్విశేషమున గలసిపోవును. మొదట నొక యల్పమగు శిశువుమూలమున గలిగిన వాత్సల్యరసము సకలసంతానము నిండి, విశ్వవ్యాప్తివఱకును ప్రవహించును. మొదట వాత్సల్యము దేని నాశ్రయించి పుట్టెనో అది విశిష్టవస్తువు. దాని సంగమస్థానము నిర్విశేషము. "ఇది నా తల్లి. అందఱి తల్లి కాదు. నా తల్లిని అమ్మా యని అన్యులు పిలుచుట కధికారములేదు. ఇది నాసొత్తు. అమ్మ అందఱిదికాదు, నాది." కాని, క్రమముగ నాది యనునది పోయి, నా తల్లిని ఇతరులుకూడ అమ్మా యని పిలుచుటకై నా మనము వ్యాకులత నొందును. అమ్మయని పిలుచుట కొక కంఠము చాలదు. కోటికంఠములతో అమ్మా యని పిలువవలెను. త్రింశత్కోటికంఠకలకలనినాదమున "వందేమాతరం" మంత్రము ప్రతిధ్వనింపవలెను. నా తల్లి యెవరు? త్రిపురసుందరి, త్రిభువనమోహిని. నా తల్లి నాయందు ఏ ప్రేమను మేల్కొల్పెనో ఆ ప్రేమయే జగజ్జనని రూపమున వెలసినది, వికసించినది. ఈ మాతృమూర్తి నాదే కాదు, అందఱిది, సకలవిశ్వసంతానముది, సకలసృష్టిది. వేయేల? సకలసృష్టియు నా తల్లిదే. ఈ మాతృమూర్తి

మూర్తి లేని అమూర్తి కాదు. ఇది సాకారమును కాదు, నిరా

కారమును కాదు. మాతృమూర్తి యనగా, ప్రపంచములోని తల్లు లందఱి కూడిక కాదు. ఆ మూర్తి ప్రతి తల్లియందు నున్నది, అందఱిని అతిక్రమించియు నున్నది. ఎప్పుడు విశిష్టమగు మూర్తి అమూర్తిని స్ఫురింపజేయదో, ఆ మూర్తి ఆ రూపము ఆ విగ్రహము అలీకకల్పన, అర్థవిహీనమగు కల్పన. అది కేవలము జడపిండము.

ఏ మూర్తి యమృతప్రేరణము సేయగలుగునో, అది సమముగ సాకారమును నిరాకారమును నగుచున్నది. ప్రకటితమైనది సాకారము. ప్రకటితము కానిది నిరాకారము. ప్రకటితమైనదానిని వదలివేసి అప్రకటితమైనదానిని అనుసంధానము చేయుటయెట్లు? రూపము వినా స్వరూపమును తెలిసికొనుటయెట్లు? సాకారమూలమునగాక నిరాకారమున భావన చేయుట యననేమి? మనఋషులు సాకార నిరాకారములను ఛాయాతపములుగ వర్ణించియున్నారు. వ్యష్టిజనని మూర్తి. సమష్టిజనని అమూర్తి. వ్యష్టిసంతానము సాకారము, సమష్టిసంతానము నిరాకారము. వ్యష్టినాయకుడు రూపము. విశ్వనాయకుడు అరూపము. ఒకదానిని విడచి మరియొకటియుండదు. రూపమునందు స్వరూపము, గతియందు శక్తి, ఆవిర్భావమునందు భావము, శబ్దమున అశబ్దము, స్పర్శయందు అస్పర్శ, గంధమునందు అగంధము, ఛాయాతపములవలె అవినాభావమున నున్నవి. ఈ విశ్వతత్వము అంకగణితమార్గమున గ్రాహ్యము కాదు. ఇది జీవనతత్త్వము. జీవము అంగముల కూడిక కాదు. జీవము ప్రత్యంగమున నున్నది. జీవము ప్రత్యంగమున వ్యాపించి పూర్ణత నొందును. ప్రత్యంగము జీవమును ప్రేరేపించుచు సార్థకత నొందును.

జీవము పరిపూర్ణత నొందుటకు అంగములను సృష్టించును. అంగము లన్నియు ఆనందమయ జీవమును ప్రకాశింపజేయును. అటులే జగజ్జనని తన పరిపూర్ణతకై తల్లులను సృష్టించు చున్నది. ప్రతి తల్లియు రూపములేని జగజ్జననిని ప్రకాశింప జేసి సార్థకత చెందుచున్నది. అంగాంగిసంబంధమున సాకారమును నిరాకారమును, సాలంబమును నిరాలంబమును అన్యోన్యముగ భేదాభేదముల నొందుచున్నవి. నీతి, ధర్మము, దర్శనము, శిల్పము, సాహిత్యము ఈ నియమము ననుసరిం చియే రూపమున స్వరూపమును, భేదమున అభేదమును, విశిష్ట మున నిర్విశిష్టమును వెదకుచు కనుగొనుచు పూర్ణత్వము నొందుచుండును.

ఈ దృష్టితో జూచితిమేని, హిందూదేవతావిగ్రహ ములు సమాధిలబ్ధమైన ఇష్టదేవతామూర్తులని మన మంగీక రింపక తప్పదు. విశ్వబ్రహ్మ, అర్ధనారీశ్వరుడు, మహిషాసుర మర్దని, యుగళమూర్తి, నటరాజవిగ్రహము, దుర్గ, భవాని, కాళి, జగద్ధాత్రి, సరస్వతి, లక్ష్మి, దక్షిణామూర్తి మొదలగు ప్రతిమలు సర్వాంతర్యామియగు నిఖిలరసామృతమూర్తియొక్క భావాంగఘటనలని తెలిసికొనగల్గుదుము. ప్రస్తుతము విగ్రహా రాధకులు ఈ మూర్తులను ఇట్టి దృష్టితో జూచుచుండిరా లేదా యనునది ప్రస్తుతవిషయము కాదు. ఈ విగ్రహములను సృష్టిం చినవారు సాధారణమానవులు కారు వారు బ్రహ్మసాక్షా త్కారమును పొందిన సిద్ధపురుషులు. వారి సమాధికి భంగము కలిగినప్పుడు ఉద్భవించిన ఆవేదనలో తమ ఉపాస్యదేవతలను మంత్రరూపమున గీర్తించిరి. వాని ననుసరించి శిల్పులు దారు లోహశిలా విగ్రహములను చేసిరి. చిత్రకారుడు తనచిత్రరువును లిఖించుటకు పూర్వము పటముపై ముందుగ సఫేదు రంగును

పూయును. అటుపిమ్మట తన కుంచెను వివిధములగు రంగులలో ముంచి చిత్తరువులను పూర్తిచేయును. అటులే సాధకుని చిత్తముపై బ్రహ్మభావ ముదయింపవలెను. "ఈశావాస్య మిదగుం సర్వం" ప్రపంచమంతయు ఒక్క బ్రహ్మభావమున కనబడవలెను. మనకు కనబడు వస్తుతంత్రము స్థావరజంగమములేమైనను, అవి యన్నియు బ్రహ్మముయొక్క మూర్తులై ప్రకాశించును. కాని, ఇది సాధకునకు ప్రారంభదశ. భక్తి యింకను గంభీరము కాలేదు. నేత్రములనుండి అస్రువులు రాలనారంభించెను.

దృష్టి విడివడినది. కాని, సృష్టి ఆరంభము కాలేదు. సమాధి యందు తాననుభవించిన భావోన్మాదము జాగ్రదవస్థయందు కూడ కొంతవఱకైనను నిలిచినగాని, సృష్టియారంభముకాదు. "ఈశావాస్య మిదగుం సర్వం" అను వాక్యమునందు బ్రహ్మ భావము కలదుగాని, భావాంగసృష్టి ప్రారంభము కాలేదు.

భావాంగము కేవలము అనుభవముకాదు. అది కల్పన. అనుభవము ప్రగాఢమైనప్పుడు కల్పనతో జేరి భావమునకు అంగములను సృష్టించును. ధ్యానములో మాతృత్వము అనుభవమైనది. ధ్యానము భంగమైనప్పుడు ఇంద్రియములు మేల్కొని నప్పుడు ఈ భావము రక్షింపబడదు. ఇంద్రియములు భేద బుద్ధిని కలిగించును. ప్రాణ మప్పుడు వ్యాకులత పొందును. అప్పుడు కల్పన సృష్టిచేయ నారంభించును. ఈ కల్పనలు మాతృప్రతిమను ఘటించును. ఇది పరులకొఱకు కాదు.

ప్రాణతృప్తికొఱకు గాఢానుభవము అతీంద్రియతత్త్వమును ఇంద్రియసమ్ముఖమున ప్రతిష్ఠించును. అందుకనియే ఋషులు మంత్రద్రష్ట లగుచున్నారు. నిరాకారవాదులుకూడ నీ మార్గమున నడచి మానసమూర్తులను గల్పించి "ఓమ్ పితానోసి" అని బ్రహ్మమునకు ప్రణామము చేసి విశ్వపితయను మానసిక

కల్పనను చేసినారు. విగ్రహములను విడనాడిన మానసికో పాసకులు సయితము సున్నితములైన మానసికకల్పనలకు లోనగుచునే యున్నారు. వారు చేయునది నిరాకారోపాసన కాదు. ఎప్పుడు ఈశ్వరుని చరాచరాత్మకమైన జగత్తు ద్వారమున కీర్తించుచున్నారో, ఎప్పుడు వానిని "తండ్రి, తల్లీ" యని సంబోధించుచున్నారో, అప్పుడు మానసిక కల్పన తప్పదు. ఎప్పుడు పుత్రుడు "అమ్మా" యని తల్లిదగ్గఱకు పరుగిడుచున్నాడో, అప్పుడు పుత్రుడు మాతృప్రతిమను సృష్టించుచున్నాడు.

ఇది నిమ్నాధికారుల సంపదకోపాసనము కాదు. ఇది బ్రహ్మజ్ఞానసాధనయు గాదు. బ్రహ్మజ్ఞానమునందు బ్రహ్మప్రకాశముమాత్రమే సాక్షాత్కారమగును. స్థావరజంగమములన్నియు నిష్టదేవతయొక్క ఏకరూపమును దాల్చును. ఇందు విగ్రహసృష్టి లేదు. సర్వము సమానమైనప్పుడు, జగత్తంతయు ఒక్క బ్రహ్మరూపమైనప్పుడు, రససృష్టి యెక్కడ? అందుకనియే, భక్తులీ యవస్థను దాటవలెనని చెప్పుచున్నారు. బ్రహ్మప్రకాశముకంటె బ్రహ్మవిలాసము మహత్తరమైనది. ప్రకాశమునందు ఒకటేరూపము, కావున నిరాకారము. విలాసమునందు సర్వరూపము. కావున అనంతకోటి విగ్రహములు, నామములు, అవతారములు, లీలలు. ప్రకాశమున శాంతభావముతో ముగింపు. విలాసమున శాంతము ప్రథమసోపానము. ఆ రసపిపాసకు తనివియుండదు. ఆరసక్రీడయందు ఎప్పటికప్పుడు నూత్ననూత్న రాగములు, నూత్ననూత్న నృత్యములు, నూత్ననూత్న వేషములు, నూత్ననూత్న విలాసములు. అది యొక మహాయాత్ర- క్షేత్రమునుండి క్షేత్రమునకు, ఆలయమునుండి ఆలయమునకు, విగ్రహమునుండి విగ్రహమునకు, సహస్ర

నామసంకీర్తనములో ప్రణామము లొనర్చుచు, ఆత్మ రస యాత్రికై బయల్వెడలును. భగవంతుడేమిచేయగలడు? ఎంత కను భక్తునకు తృప్తి లేదు. రసపానము చేసినకొలది రసపిపాస హెచ్చును. భగవంతుడు భక్తుని తృప్తిపఱుపక యెట్లుండ గలడు ? వాని తృప్తినిమిత్తము ఈశ్వరు డెప్పటి కప్పుడు నూతనరూపములను దాల్చును. భక్తుడా రూపములను విగ్రహములుగ నొనర్చి, క్రొత్తరూపములకై నిరీక్షించుచుండును. ఆ రసపిపాసకు విరామములేదు. ఆ విగ్రహసృష్టికిని తెంపు లేదు. ఇది యేకేశ్వరోపాసన కాదా ? కాకపోనిమ్ము! భగ వంతుని వర్ణించుటకు నాకు ఒక్క నామముచాలదు. వానిని సందర్శించుటకు ఒక్కరూపము చాలదు. వాని సందర్శ నానందమున నోలలాడినకొలది, నూతనరూపరచనలు వాని యంతట అవియే యుద్భవించుచుండును. భావము భావాంగ ఘటనా మూలమున పరిపూర్ణత నొందుచుండును. భావాంగ ఘటన రూపరచనల ద్వారమున విస్తీర్ణమగుచుండును. ఏవి భావాంగఘటనలు కావో, అవి విగ్రహములు కావు. విగ్రహ ములందలి శిలాజ్ఞానము వస్తుతంత్రము. అది ప్రయోజనకారి కాదు. వానిచే ప్రబోధింపబడు దేవతాబుద్ధియే బ్రహ్మో పాసనకు సహాయకారియగును. అందుకనియే విగ్రహ ములు అనధికారులకు ప్రయోజనకరములుకావు. వారిక అందు శిలాజ్ఞానముతప్ప మఱొకటి యుండదు. "సాధ కానాం హితార్థాయ" సాధకులు అనధికారులు కారు. ప్రవర్తకులు అనధికారులు. సాధ్యము తెలిసినవారే సాధ కులు. ఒక్కమారైనను తమ జీవితమునందు బ్రహ్మజ్ఞాన లేశమును పొందినవారే సాధకులగుదురు. ఈశ్వరసహవా సమును నిత్యానుభూతిగ జేసికొన యత్నించువారే సాధకులు.

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు (కృష్ణా)

అట్టివారియందు విగ్రహములు రసోద్దీపనముగావించి, వానిని ఈశ్వర సన్నిధికి జేర్చును. వారికి ప్రాణప్రతిష్ఠ చేయబడిన ప్రతి విగ్రహమును ధ్యేయము. 

గురువులకొద్ద మంత్రోపదేశము నొందినగాని యోగాభ్యాసము సాధ్యముకాదు. ప్రతి మంత్రమున కొక యధిష్ఠాన దేవతయుండును. విగ్రహము లీ యధిష్ఠాన దేవతలయొక్క ప్రతిమలు. కావున మంత్రోపాసన లేనిది విగ్రహారాధనము సఫలము కానేరదు. విగ్రహ ముపాస్యమగుటకు ముందు దానికి ప్రాణప్రతిష్ఠ కావలెను. ప్రాణప్రతిష్ఠ యనగా ఆ విగ్రహమునకు చెందిన మంత్రముయొక్క బీజాక్షరముగల యంత్రముపై దానిని స్థాపించుట.

"సర్వదేవమయీం దేవీం సర్వమంత్రమయీం వరాం
ఆత్మానం చింతయే ద్దేవీం పరమానందరూపిణీం."

ఇట్లు ధ్యానము చేయునప్పుడు దారుశిలాలోహ విగ్రహములయందు వస్తుజ్ఞానము నశించి, దేవతాబుద్ధియే యుదయించును. దేవతాబుద్ధి యుదయించినతోడనే సాధకుని అతీంద్రియదృష్టి వికసించి, ఈశ్వరగుణానుభవము కలుగును. కావున విగ్రహముల మర్మములను తెలిసికొనగోరువారు ముందర గురువులయొద్ద మంత్రోపదేశమును పొందవలెను. విగ్రహముల మర్మములను వెల్లడించుట యనగా, రసస్వరూపమును ప్రకటించుట. ఆ కార్యము చింతనల, భజనల, యోగముల మూలమున అనుభవించి ఆనందింపవలసినదే కాని, దానిని లిపిబద్ధ మెవరుచేయగలరు? కవులు చేయగలరు. ఋషులు చేయగలరు. సిద్ధులు చేయగలరు.

1916

రూపకల్పన

# ఆత్మవితరణము * *

"నరకళేబరములమీదుగ సాగు నీ ధర్మరథమార్గము రక్తపంకిలముగదా !"

ఈ చిన్న వాక్యమునందు టెన్నిసన్ మహాకవి మానవచరిత్రయొక్క గభీరరహస్యమును ఇమిడ్చియున్నాడు. మానవాభ్యుదయరహస్యమే కాదు, అఖిలసృష్టిమర్మము నిం దిమిడియున్నది. రుధిరప్రవాహమన నరహత్యకాదు. జనసంహారము కాదు. హింసకాదు. మఱియేమన, సత్యముకొఱకు మృత్యువును సహితము ఎదుర్కొనగల వజ్రసంకల్పము, హృదయశోణితమునుగూడ దానముచేయగల ఆత్మవితరణము, సర్వస్వమును విసర్జింపగల కార్యదీక్ష. దీనినే ఆర్యులు తపస్సను శబ్దముతో నిర్వచించిరి. తపస్సునకు సృష్టిమర్మమంతయు బ్రత్యక్షమగును. అఖండుడును, పూర్ణుడును, ఆనందమయుడును నగు నీశ్వరుడు ఖండఖండములుగ జీలి, ఈ యఖిల బ్రహ్మాండమును సృష్టించెను. "స తప స్తప్త్వా సర్వమిద మసృజత్." ఎప్పుడు కారణవారిధియందు "తపః" అను జాగరణమంత్రము శబ్దించెనో అప్పుడా ప్రళయాంధకారమును జీల్చుకొనుచు, సూర్యోదయమున వికసించు అరవిందమువలె, లీలయను సహస్రదళకమలము వికసింపదొడంగెను. ఆత్మవితరణమే సకలసృష్టికి బ్రభవకారణమగుటచే, చేతనాచేతనములు, సకలజంతుసంతానము, నిఖిలజగత్తు, తపఃప్రభావముచే ఆచ్ఛాదితమైయున్నది. కన్య యౌవనలావణ్యమును గోల్పో

యినగాని సంతానవతి యగుటలేదు. తల్లి తన ప్రాణము
190 నుండియే శిశువునకు ప్రాణ మొసగుచున్నది. పుష్పవికా
సము కొఱకు వృక్ష మెంత ఆత్మదానము చేయుటలేదు?
పుష్పములు వృక్షబీజములను తమ గర్భమున దాచియుంచి
కొని, పరిపక్వసమయమున దామే నాశన మొందుచున్నవి.
తిలలు గానుగలో నలిగినగాని తమయందు గర్భితమైయున్న
తైలామృతమును వెలిపుచ్చవు. ఈ యాత్మదాన మసదృశము!
కఠినపర్వతకందరముల బంధింపబడి, అనేకశిలాప్రహారణముల
కోర్చి తుదకు బయల్పడి, పొంగి, ప్రవహించి, ధరణిని సస్య
శాలినిగ జేయు నా నిర్ఝరధారలయొక్క తపోమహిమమును
గనుము. ఈ ఆత్మదానమహిమను వర్ణింప నేరితరము! వా
గ్జాలముచే దాని నొకింత వర్ణింపనగును. బుద్ధి వైభవముచే
గొంత గ్రహింపనగును. స్వానుభవమునకు మఱికొంత వేద్య
మగును. అంతియేకాని దాని పూర్ణభావము మాత్రము
అగ్రాహ్యము.

చీనాంబరధారిణియై, మణిభూషణాలంకృతయై, రాజసౌధముల బెరుగుచున్న హైమవతి షోడశవర్ష ప్రాయమున కాషాయ వల్కములను ధరించి, రుద్రాక్షమాలికను జేబూని, పంచాగ్నిమధ్యమున తపస్సుచేయుచుండెను. ఈ తపఃక్లేశము వలన శుష్కించిన బాహులతలనుండి జపమాలిక మాటిమాటికి క్రిందబడిపోవుచుండెను. శీతకాలమున, గంగాజలములు నిల్చి చలింపక ఈశ్వరధ్యానమునందు ఘనీభవించురీతిని, పార్వతియొక్క కామనలన్నియు నిశ్చలతజెంది, మహేశుని ధ్యానమునందు లయమయ్యెను. ఏమి ఆ తపఃప్రభావము! తపఃక్లేశమునందు శాంతమును, సాధనానుష్ఠానమునందు ఆనందమును బొందుచున్న ఆతపస్విని నేగదా ప్రతి ఆర్యకన్యయు

నుపాసించి ధన్యయగుచుండును! ఆత్మసమర్పణ మననేమో యింకను విప్పిచెప్పవలయునా? ఏగురుని విగ్రహమును హృదయస్థము జేసికొని అతిఘోరతపఃక్లేశముచే ధనుర్విద్యాసిద్ధిని బొందెనో, ఆగురువు ప్రత్యక్షమై, ధనుర్ధారణకు ప్రధానావలంబనమగు దక్షిణహస్తముయొక్క అంగుష్ఠమును ఖండించి గురుదక్షిణగ సమర్పింపుమని ఆజ్ఞాపించినప్పుడు తపస్వియగు ఏకలవ్యుడు, ప్రసన్నవదనముతో గుర్వర్థముగ తన యంగుష్ఠమును ఖండించుకొని ధన్యుడయ్యెను.

తపఃక్లేశమువలననే ఆత్మ విముక్తినొంది, అమృతరసపానమును జేయగల్గును. తపస్సుయొక్క ఆరంభమునందు నవసానమునందుగూడ ఆనందమే సముద్రఘోషణమువలె సతతము ప్రతిధ్వనించుచుండును. బ్రహ్మమానసపుత్రియగు శారదయొక్క వీణనుండి ప్రవహింపుచున్న రాగమే ప్రళయకాలమున రుద్రుని పినాకగర్జనమునందును మ్రోగుచుండును. ఏతపఃప్రభావమువలన దేశకాలాతీతమైన పరబ్రహ్మము, సృష్టియందు దేశకాలపరిచ్ఛేద్యమయ్యెనో, ఆతపఃప్రభావమువలననే దేశకాలబాధితమైన భూతకోటి తిరిగి ఆ యఖండపరిపూర్ణానంతపదవిని జేరగల్గుచున్నది. తపస్సుచేతనే ఈశ్వరునకు బంధనము గల్గుచున్నది. తపస్సుచేతనే మానవునకు తిరిగి మోక్షము సిద్ధించుచున్నది.

ఈ బంధము లనిత్యములు, నశ్వరములు. ఆత్మ యెప్పుడును వీనినతిక్రమించుటకే ప్రయత్నించుచుండును. ఈప్రయత్నమే తపస్సు. ఆత్మవితరణము, త్యాగశక్తియు నన లాభనష్టపరిగణనములుకావు. ఎంతయిచ్చినను తఱుగని ఆత్మదానమెక్కడ! ఆయవ్యయగణనమెక్కడ! అఖండానంద పరిపూర్ణుడగు భగవంతునిపూర్ణత్వము ఆత్మవితరణమువలన తఱుగుట

లేదుగదా! ఒక దీపశిఖనుండి శతసహస్రదీపములు ప్రజ్వలించునట్లు, ఆత్మవితరణముననే ఆత్మ వికసించును. ప్రాణదానమునందే జీవి వృద్ధినొందును. వ్యయమునందే ప్రాణి ప్రాణిగ నుండగల్గును. ఈశ్వరుడు జీవునకు ప్రాణ మొసంగినపుడు, ప్రాణముతోపాటు ప్రాణదానము చేయగల శక్తియు నిచ్చియుండుటచేతనే మోక్షము నభిలషించి తపఃక్లేశములను సంతోషపూర్వకముగ బడయుచున్నాడు. తల్లి శిశువునందు, భార్య భర్తయందు, గురువు శిష్యునియందు, సేవకుడు స్వామియందు, సాధువు ధర్మమునందు, దేశభక్తుడు దీనదుఃఖనివృత్తియందు ప్రాణదాన మొనరించి ఉత్తీర్ణులగుచున్నారు. మానవుడు స్వాభావికముగ క్లేశములయందే తృప్తి చెందుచుండును. "క్షురధారా నిశితదుర్గమ దురత్యయ" పథముననే శాంతియు ఆనందమును ప్రవహించుచుండును. ఆత్మవితరణమువలననే మానవుడు తన యల్పత్వము వదలి విశ్వాత్మను బొందగల్గును. ప్రాణదానమువలననే సంకల్పము తనదుర్బలత్వమును వీడి చిచ్ఛక్తియందు సుస్థిరమగును. ఆత్మసమర్పణము వలననే ప్రేమ తన చాంచల్యమును జయించి, అఖండానందరసమున లీనమగును. స్వధర్మనిర్వాహణమునకు, గృహపాలనమునకు, సంఘసంస్కరణమునకు, రాజ్యాంగనిర్మాణమునకు, స్వాతంత్ర్యప్రతిష్ఠాపనమునకు, సర్వకళాశోభకు, మానవసేవానిరతికి, తుదకు మోక్షప్రాప్తికి గూడ ఈ యాత్మవితరణమే, ఈ ప్రాణదానమే, ఈ యాత్మయజ్ఞమే మూలము, సాధనమును.

తాపసికి వసుధయంతయు కుటుంబమేయగును. తన మేలు దా నెప్పుడును బ్రత్యేకముగ జూచుకొనడు. అన్యుల సుఖదుఃఖములను దనవిగనే భావించుకొని, లోకశ్రేయము

కొంచె కెన్నడును బాటువడును. స్వతంత్రుడయ్యు బానిసల దాస్యముచే తన్ను బంధించుకొనును. పవిత్రుడయ్యు పాపుల భారమును తన మూపున దాల్చి, వారి విముక్తికై తనప్రాణమును భక్తిపూర్వకముగ నిచ్చివేయును. ఈశ్వరుని యజ్ఞము కూడ నిట్టిదేకదా! ప్రతి బంధనమున ఈశ్వరుడే బంధింపబడుచున్నాడు. ప్రతి హింసాకార్యమున ఈశ్వరుడే హింసింపబడుచున్నాడు. ప్రతి పాపవిషయమున ఈశ్వరుడే అవజ్ఞ పాలగుచున్నాడు. ఈశ్వరుని అనంతశక్తి సృష్టికి ఆవల వెలుగు శుద్ధజ్యోతియందుకంటె, సృష్టియందా జ్యోతి తన్నుతాను అజ్ఞానతిమిరమున మఱుగుచేసికొనుటలోనే ఎక్కువగ వ్యక్తమగుచున్నది. పాపిని ఋషిని సమభావముతో జూచుకొను భూదేవి సహనమును జూడుడు! ఎట్టి క్షమ! ఎట్టి యాత్మసమర్పణము! తల్లి శిశువునకు లోబడి, శిశువుతో తిరిగి పెరుగుచున్నది. గురువు శిష్యునకు వశుడై తిరిగి శిష్యుని అభివృద్ధియందు తానును అభ్యుదయమార్గమును దొక్కుచున్నాడు. దేశభక్తుడు సోదరదేశీయులదుఃఖమునందు నిమగ్నుడై, వారి విముక్తితోపాటు తానును తిరిగి విముక్తినొందును. ప్రజలు తనను రాజుగ గోరుకొనినను శ్రీరామచంద్రుడు పితృవాక్యపరిపాలనకై రాజ్యమును త్యజించెను. సీతాదేవి తన పాతివ్రత్యమహిమచే స్వరక్షణమునకు బూనుకొనగల్గినను ధర్మసంస్థాపనమునకై రావణుని చెఱకు లోబడెను. రాజకుమారుడగు సిద్ధార్థుడు దీనుల దుఃఖనివృత్తికై భిక్షుకుడయ్యెను. ఏసు పతితుల పాపభారమును తొలగించుటకై సిలువపై వధింపబడుట కంగీకరించెను. మానవుని ధర్మచరిత్రయంతయు ఆత్మవితరణము యొక్క దివ్యసంకీర్తనము.

1919

*

## సాధన * *

బ్రహ్మజ్ఞానసిద్ధికి శాస్త్రము, ఉత్సాహము, గురువు, కాలము— అని నాలుగు సాధనములు చెప్పబడుచున్నవి. సాధ్యస్వరూపమును యోగక్రమమును దెలుపునది శాస్త్రము. సత్యాన్వేషణముకొఱకు సాధకునియందు ప్రజ్వలించు ఆకాంక్ష ఉత్సాహము. ముఖాముఖి ప్రత్యక్షనిదర్శనముచే ఆత్మప్రబోధమును గావింపగల్గువాడు గురువు. వీని నన్నింటిని పరిపక్వముచేయగల్గునది కాలము.

ఆత్మోపలబ్ధికి సాధనభూతమైన శాస్త్రము బాహ్యమున గ్రంథస్థమై యుండునది కాదు. అయ్యది ప్రతిమానవుని యందును హృద్దేశమున నిత్యసిద్ధమైయున్నది. అయ్యది శాశ్వత జ్ఞానము— అనాదిసిద్ధమైన వేదము. అయ్యది మనలోపల పుండరీకమువలె ముకుళితమైయున్నది. సాధకుడు అనంతుని వంకకు ఈషన్మాత్రమైనను దిరుగ నారంభించుటతోడనే, ఆ హృత్పుండరీకమునందలి దళములు క్రమక్రమముగ వికసింప మొదలిడును. అందుండి వెలువడు జ్ఞానతేజము చుట్టును ఆవరించియుండు తమస్సులను ఛేదించి, జీవనమునంతను క్రమక్రమముగ ప్రకాశవంతముగ జేయును.

బహిర్ముఖుడై యున్న సాధకుడు అంతర్ముఖుడగువఱకే స్వప్రయత్నము నాశ్రయించును గాని, పిమ్మట తన ప్రయత్నము వెనుక అంతరమున నొకశక్తి సంచరించుచు తనను నూతన జ్ఞానభూమికి గొంపోవుచున్నట్లు గ్రహించును. నిజ

మైన ఆత్మబోధ కేవలజిజ్ఞాసచే సిద్ధింపజాలదు. భగవానుని కృపాకటాక్షముచేగాక, ఈశ్వరసాన్నిధ్య మెట్లులభ్యమగును? బ్రహ్మస్పర్శచేతనే హృత్పుండరీకము వికసింప నారంభించి ఆత్మోపలబ్ధి మందముగనో లేక సత్వరముగనో సిద్ధించును. జీవాత్మయందు జ్ఞానము గర్భితమై యుండనియెడల, ఎట్టి విద్యయు, ఎట్టి శిక్షయు మానవుని జ్ఞానినిగ జేయజాలవు. పూర్ణప్రకాశము, శాశ్వతానందము, అనంతశక్తి మానవుని యందు నిత్యసిద్ధమై యుండుటచేతనే, సాధకుడెప్పటికైనను ఉత్తమస్థితిని బొందగల్గును. గర్భితమైయున్నదానిని బహిర్గతము చేయునదియే విద్య.

జ్ఞానమునకు సాధనము శబ్దము. శబ్దమును బయట నుండియైన వినవచ్చును. లేక, అంతరముననైనను వినవచ్చును. అనుద్బుద్ధమైయున్న జ్ఞానస్వరూపమును ప్రకాశింపజేయుటయే శ్రుతియొక్క ప్రయోజనము. అంతకుపైన దాని ప్రయోజనము లేదు. హృదయమధ్యమున అనంత తేజోవిరాజమానుడై ప్రకాశించు జగద్గురువుయొక్క దివ్యవాణిని వినగల్గువానికి ఆత్మోపలబ్ధి సులభసాధ్యము. కాని సామాన్యుల కట్టి యుత్తమస్థితి వెంటనే లభ్యముకాదు. జగద్గురువు ప్రతి హృదయమున విరాజమానుడై యున్నను, వాని శబ్దమును ఆలకింపగల శ్రోత్రమెక్కడ? మనము శ్రోత్రముండియు శ్రోత్రములేని బధిరులవలె, చక్షువులుండియు చక్షువులు లేని అంధులవలె ప్రవర్తించు మందప్రజ్ఞులము.

నిమ్నాధికారులకు ప్రాచీనఋషులముఖతః ప్రతిధ్వనించిన శబ్దమును, లేక వర్తమానమున అట్టి అతీంద్రియశ్రవణమును వికసింపజేసికొనిన గురువును సాహాయ్యముగ స్వీకరించుట యావశ్యకము. కాని, ఈ శ్రుతులును, ఈ గురుసాన్ని

ధ్యమును అంతరమున నివసించు జగద్గురువునకు బదులుగ తాత్కాలికముగ ఉపయోగింపదగిన ప్రత్యామ్నాయములే కాని శాశ్వతముగ స్వీకరింపదగినవి కావు. వీని సాహాయ్యమును స్వీకరించుచున్నప్పుడుకూడ, వీని యుపయోగము తాత్కాలికమను నమ్మకము ఉండినగాని, హృదయమునందు ఆకాంక్ష తీవ్రము కాజాలదు.

మహాత్ములు లక్ష్యమును జూచినపిమ్మట లక్షణములను విశదీకరింతురు. సాధకులు లక్షణములనుబట్టి లక్ష్యమును జేరుటకు బ్రయత్నింతురు. ఉభయులకును శాస్త్రములు ప్రమాణములే. కాని మహాత్ములకు శాస్త్రములు అనుభవప్రతిష్ఠితములు, అనుప్రకాశకములు. సాధకులకవి అనుమానప్రతిపాదితములు, జ్ఞానప్రబోధకములు. ఆత్మ స్వతంత్రమైనదని చెప్పు శాస్త్రము స్వాతంత్ర్యమును భంగపఱచి ఆత్మస్వరూపమును నాశనము చేయజాలదు. పూర్వుల యనుభవములెంత గంభీరములైనను, అవి సాధకుని జీవితపథమును విశేషకాలము ప్రకాశవంతముగ జేయగల్గుచున్నను, వానియుత్తమ వికాసమున సర్వాంతర్యామియగు జగద్గురువునే పూర్ణముగ శరణము పొందక తప్పదు. ఉత్తమస్థితియందు సాధకుడుపాసించునది ఏగ్రంథమునుగాదు; సర్వగ్రంథములకు అతీతుడైన అనంతుడే ఉపాస్యుడు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యను అమృతవాణి హృదయకుహరము నుండి నిరంతరము ప్రతిధ్వనించుచున్నది.

సాధనవిషయము చాలవఱకు గ్రంథస్థమైయున్నను, గొంతవఱకు గురుపారంపర్యముగ అనుశ్రుతముగ వచ్చుచున్నను, సాధకులు ఎప్పటి కప్పటికి నూతనమార్గములను త్రొక్కకపోలేదు. యోగాభ్యాసమున పతంజలి సూచింపని

సాధన లనేకము లిటీవల వాడుకలోనికి వచ్చెను. ధర్మ పరిణామమున క్రొత్త క్రొత్త మార్గము లింకను కనిపట్టబడుచున్నవి. లోతుగ నాలోచించితిమేని ఎవరిపద్ధతి వారిదేయని తెలిసికొనగల్గుదుము. వ్యక్తుల గుణకర్మభేదములనుబట్టి, పద్ధతులు మాఱుచుండును. ప్రకృతిసిద్ధమైన వ్యత్యాసములుగల మనుజుల నెల్లరిని ఒక్కపద్ధతియందే అచ్చులోవేసి బిగింపజాలము. ప్రతిసాధకునకు సాధనయందుగలుగు ఆవేదనలో ఈశ్వరుడే తగిన మార్గమును వెల్లడిచేయును. సాధకుడు ప్రథమావస్థయందు తన మతమునందు అనుశ్రుతముగవచ్చు రాజబాటను పడి పోయినను, కొంతదూరము పోవుసరికి త్రోవతెన్ను లేని మహారణ్యమున బడినట్లగును. అప్పుడు సాధకుడు తనంతటతాను, అడుగడుగుకు మార్గమును గనిపట్టుచు ముందుకు సాగుచుండవలసివచ్చును. ఇయ్యది ఈశ్వరవిధానము. స్వప్రయత్నమునగాని “స్వ” ప్రతిష్ఠింపబడదు. ఏకాంతమునగాని ఆత్మ దుఃఖప్రదమగు పరవశతను తప్పించుకొని సుఖదాయకమైన స్వవశతను బొందజాలదు. దురంత కఠోర నిర్జనత్వమునగాని బాహ్యశబ్దములన్నియు స్తంభించి, ఆత్మగతమైన బ్రహ్మనాదము శబ్దింపదు.

ప్రకృతిని నిత్యము నూతనముగ నుంచుటకే సూర్యుడు తిరిగి తిరిగి యుదయించుచున్నాడు, ఋతువులు మాఱుచున్నవి. అటులనే, వ్యష్టిజీవితమునందును, సమష్టిజీవితమునందును నూతనదశలు, నూతనావస్థలు ఉద్భవించుచున్నవి. ఈశ్వరశక్తియు యుగయుగమున “సంభవామి” యని క్రొత్త క్రొత్త ధర్మావతారముల రూపమున ప్రబోధింపుచున్నది. సాధకుడు తన సాధనమార్గమునందు ఈ దేశకాలభేదములను, యుగధర్మములను గమనింపక తప్పదు. శక్తివిహీనమైన సత్తు, గతి

విహీనమైన శక్తి, పరిణామవిహీనమైన గతి అసంభావ్యములు. అఖండానంతశక్తిని స్వగతమున, వర్తమానమున, స్వదేశమున ప్రకాశింపజేయగలిగినప్పుడే సాధన సార్థకమగును. ప్రాచీనులు అట్టి స్వతంత్రమైన ఆత్మప్రతిభను ప్రతిష్ఠించి ధన్యులైరి. ఏ సాధకునియందు బ్రహ్మజిజ్ఞాస ఉజ్వలితమై ప్రకాశించునో ఆ సాధకుడు ఇతరుల సాధనప్రణాలికలచే బంధింపబడడు. సాధకుడు విశ్వమునంతను అవగాహనము, ఐక్యము చేసికొనియు, తన వ్యక్తిత్వమున సచ్చిదానందునకు నూతనదేహధారణము నొసంగగల్గును. ఈ విషయమునే వివేకానంద స్వామి కడు హృద్యముగ వాక్రుచ్చినాడు :—

"A free adaptability in the manner and the type of the individual's acceptance of the Universal and the Transcendent into himself is the right condition of the full spiritual life in man. The unity of all religions must necessarily express itself by an increasing richness of variety in its form. The perfect state of that essential unity will come when each man has his own religion—when not bound by sect or traditional form he follows the free self-adaptation of his nature in its relation with the Supreme."

ఈ యన్వయము సాధకుని సమగ్రజీవనమునందును, సకల ప్రకరణములయందును, లోపలను బయటను ప్రతిష్ఠింపగల్గినప్పుడే, సాధనయొక్క సిద్ధి ప్రారంభమైనదని తెలిసికొననగును. సాధనయొక్క తీవ్రతయు వ్యాప్తియు వికాసమును సాధకుని స్వోత్సాహముపైననే ఆధారపడియుండుననుట నిశ్చయము. కాని, ఈ స్వోత్సాహము క్రమముగ ఈశ్వరానుగ్రహముగ పరిణామము బొందుచుండునను విషయము తెలిసి

కొనినగాని, సాధన పరిపక్వము కానేరదు. సాధనవికాసమున మూడు క్రమావస్థలను సూచింపవచ్చును. పరబ్రహ్మముతో సాయుజ్యము స్వల్పముగనైన నేర్పడనంతవఱకు సాధకుని స్వప్రయత్నము క్రమముగ ఘోరతపస్సుగ పరిణమించును. ఇది ప్రథమావస్థ. తపస్సు తీవ్రతరమైనకొలదియు తనయందు ఉత్సాహమేకాక, ఇంకొక నూతనశక్తి ఉద్బుద్ధమగుచున్నదని గ్రహించి అంతకంతకు దాని కధీనుడగును. ఇది ద్వితీయావస్థ. ఆ దివ్యశక్తికి అధీనుడైనకొలదియు స్వపరభేదములు నశించును. అప్పుడు వాని దేహమనఃప్రాణములుకూడ విశ్వరూపములై వెలయును. జీవితమంతయు ఈశ్వరలీలగ రూపొందును— ఇది మూడవ యవస్థ.

ఈ తృతీయావస్థయందు మమత్వము పూర్తిగ నశించును. ఈశ్వరేచ్ఛయే తన యిచ్ఛ. ఈశ్వరకర్మయే తనకర్మ. ఈశ్వరభోగమే తన భోగము. అజ్ఞానావస్థయందీసత్యము అనుభవవేద్యము కాజాలదు. అనుశ్రుతముగవచ్చు కొన్నిమతానుష్ఠానములతో సాధకుడు సంతృప్తిపడుచుండును. తనయందు వృద్ధినొందుచుండు జ్ఞానము, ప్రేమ, బలము, కార్యోత్సాహము తనవిగనే భావించుకొని గర్వించుచుండును. తన యుక్తికి తట్టినది సత్యము, తన యభీష్టసిద్ధిని గావించినది ఆనందము, తన యభిరుచికి అనుకూలమైనది కళ్యాణము. ఇది యంతయు ప్రవర్తకావస్థ.

స్వతంత్రమైన ధర్మచింత యుదయించుటతోడనే, గతానుగతికముగ జరిగిపోవుచున్న సంసారమున సంక్షోభము పుట్టును. అసంతృప్తి, వ్యాకులత, ఆకాంక్ష, జిజ్ఞాస ప్రజ్వలించి, సాధకుని జీవనము ధర్మసంగ్రామమునకు రంగమై వెలయును. అంతకుపూర్వము సత్యమనుకొనినది అసత్యమగును.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)


బలమనుకొనినది అశక్తతయగును. శాంతి మాంద్య మని పించుకొనును. తన మంచియంతయు మోసమగును. ఎట్టి యీ వేదన, ఎట్టి అనుతాపము!— చిత్తశాంతిని వశింపజేసి పలుభంగుల వేధించుచుండును. ఇంద్రియములు ప్రతిఘటించును. భయమోహములు జిజ్ఞాసను నిరోధించును. లోపలను బయటను విరోధము, సంఘర్షణము. ఉపాసనకు గూర్చుండును. ఇంద్రియనిగ్రహము సాధ్యము కాదు. ఏకాగ్రత కుదురదు. ఉపాస్యమెట్టిది? సరియైన భావన లేదు. కర్మ నాచరించును. వాక్యములను పఠించును. నామమును స్మరించును. జపమాలను త్రిప్పును. కాని వానియందు అర్థబోధ లేదు. సాధనను వదిలివేయునా, వదలుటకు ఇచ్ఛకలుగదు. పైమెట్టు కన్పట్టదు. ఆకాంక్ష యొకవైపు, దౌర్బల్య మింకొక ప్రక్క; ఈమధ్య సాధకుని జీవనము రభసతో, ప్రయాసతో, తాపముతో బీడింపబడుచు, వ్యాకులత నొందుచుండును. ఎక్కడనుండియు సాహాయ్యము రాదు. ప్రార్థనము ఫలింపదు. నిష్ఠ కుదురదు. చంచలమైనమనస్సు, కామముతో రగులుచుండినహృదయము, అహంకార భూయిష్ఠమైన నడవడి సాధకుని క్రుంగదీయుచుండును. "పాహిమాం, పాహిమాం" అని ఆక్రందించును. అశ్రువుల రాల్చును. ఇంకను ఎంత కాలము? కన్నులాశించుచున్న రూపము, ప్రాణము కోరుచున్న శాంతి, మనస్సు అన్వేషించుచున్న సత్యము, హృదయము కాంక్షించుచున్న ఆనందము, సంకల్పము అభిలషించుచున్న బలము లభ్యములు కావు. బహుశః భ్రమలయందు చిక్కుకొనెనా? కాదు. "కలడు కలం డనెడివాడు కలడో లేడో!" ఈ సంశయముకూడ హృదయమును వేధించుటకే బయల్వెడలినది. ప్రపంచము భ్రమ కావచ్చును. సంసా

రము భ్రమ కావచ్చును. కాని, ఈశ్వరనామము భ్రమ కాదు, ఆత్మ భ్రమకాదు.

బహుశః పరిశోధనము చాలకపోవచ్చును. ఆకాంక్ష యం దింకను కాపట్య ముండియుండును. లేనిచో నీదార్బల్య మెక్కడిది? శాస్త్రములు సహాయపడుటలేదు, ఆచారములు తోడ్పడకున్నవి. గురుబోధ చాలదు. పూజలు, పురస్కార ములు ఫలప్రదము లగుటలేదు. ఈయగ్నిపరీక్ష చాలదా? ఇకనైనను ఈశ్వరుని కరుణాకటాక్షము ప్రసరింపదా? ఏకాం తమున విలపించును. రాత్రుల జాగరణము చేయును. విపిన భూముల తిరుగును. భజనకూటముల జేరును. ఉపదేశముల నాలకించును. కాని ఆ వ్యాకులతకు తృప్తి యెక్కడ? అంధ కార మంతకంతకు దట్టమై, అనుతాపము దురంతమగును. సాధకు డొక్కపెట్టున నీయిచ్ఛ అని జగత్పిత చరణాబ్జ ములపై బడును. పితృవాత్సల్యము వర్ణనాతీతము. ఆ దయా రసనసముద్రము అపారము. సాధకుని జీవనాంతరాళమున నూతనజ్యోతి వెలిగినది. భక్తుని పుష్పాంజలిని భగవానుడు స్వీకరించినాడు. బలి ఈశ్వరప్రీతికర మైనది. తపస్సు ఫలించి నది. కృశించిన తనువు, పరితప్తమైన హృదయము, నిస్స్వా ర్థమైన మనస్సు, ఆత్మనివేదనము— సర్వమును, శుష్కించి యుండిన సరోవరము వెల్లివిరిసినట్లు, స్వర్గోన్ముఖమై ఈశ్వరారాధనమై వెలుగును.

సాధకుడు ఈశ్వరాధీనుడై ప్రవర్తించినకొలదియు, తాను ఈశ్వరుని యధీనమున ప్రవర్తించుటపోయి, ఈశ్వ రుడే తనయందు ప్రవర్తించుటయగును. కాని, జీవనమింకను మధురముకాలేదు. జగత్తు సుందరముకాలేదు. బ్రహ్మభావ మున ఆత్మ అంతర్ముఖమైయున్నదిగాని, తిరిగి బహిర్ముఖ

మగుటకు సంకోచము. ఇంకను ముందుకుబోవును. ఈ యవస్థలో స్వగతభేదముకూడ నాశనమగును. అంతయు నొక్కటే. బ్రహ్మమే తన్ను దాను జూచుకొనుచు నిగ్రహించుకొనుచు ఆనందించుకొనును. భక్తునియందు భగవానుడు, భగవానుని యందు భక్తుడు ఏకాత్మతచెంది పరిపూర్ణులగుచుందురు.

అఖండ సచ్చిదానందమూర్తి మనకు ప్రథమమున విశ్వశక్తిగనో, విశ్వప్రేమగనో, విశ్వాత్మగనో, సర్వాతీతమైన అనంతసత్యముగనో, అంతర్వ్యాపకుడైన పురుషోత్తముడుగనో—ఏ రూపముననైన ఏ నామముననైన గోచరింప వచ్చును. తుదకు ఈ నామరూపములన్నియు నొకటేయని తెలిసికొనగలుగుదుము. ఈశ్వరుడు నీ యింటికి ఏ రూపమున, ఏ నామమున, ఏ వేళను వచ్చునో వేచియుండుము. ఇంటిని పరిశుభ్రపఱచియుంచుము. ద్వారములను దెఱచియుంచుము. అన్యమనస్కుడవై యుండకుము. శ్రీరామచరణరజముకొఱకు నిరీక్షించుచుండిన అహల్యవలె, విశ్వాసముతో వానిరాకకై కనిపెట్టుకొనియుండుము.

శ్రీ వేమన గ్రంథాలయము
వేటపాలెం (కృష్ణా)

1916



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B200 |
| పుస్తకం పేరు | ధ్రువజ్యోతి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 221 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II, IV, 2-IX, II |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |

BLANKS

14,54,96,98,104,112,118,124,132,150,164,168,188,194